# మీ యింటిలో 'గ్రంథాలయం'
# నెలకొల్పాలని వుందా?....

అది ఒకేసారి మీకు సాధ్యపడక పోవచ్చు!

అందుకే... **మీకో స్వంత గ్రంథాలయ పథకం**

మొదటి నెలలో
సభ్యత్వ రుసుము రూ. 4 తోపాటు
ప్రతి నెలా రూ. 10 చొ॥న 12 నెలలు చెల్లించండి!
మొదటి 3 నెలలు మీరు పొందబోయే నవలలు

మొదటి నెల:
- డా॥ కొర్రపాటి గంగాధరరావుగారి అమృత మధనం
- డా॥ సి. ఆనందారామంగారి పాంచజన్యం
- శ్రీమతి. కురుముద్దాలి విజయలక్ష్మిగారి ఒక జంట కలసిన తరుణాన
- బహుమతి కథ: శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి శరద్రాత్రులు

రెండవ నెల:
- కళాప్రపూర్ణ లతగారి ఇది ఉదయం
- శ్రీమతి గోవిందరాజు సీతాదేవిగారి మిస్. మధుమతి
- డా॥ కె.వి. కృష్ణకుమారిగారి పదవి హీనులు ఎవరు?
- బహుమతి కథ: కీ॥శే॥ భమిడిపాటి కామేశ్వరరావుగారి కాలక్షేపం

మూడవ నెల:
- [illegible] గారి ఎలమావితోట
- శ్రీమతి ప్రమీలా జనార్దన్ గారి మనోమందిరం
- శ్రీధర గారి సాలికలు
- బహుమతి కథ: భమిడిపాటి శివాకృష్ణ గారి నీ కోసం

నాలుగవ నెలలో:
- శ్రీ రావుగోపాలరావుగారి నాకు పోటీ చెయ్యాలనుంది
- శ్రీ అల్లురామలింగయ్యగారి ?
- శ్రీమతి చావలి మణిశాస్త్రిగారి ?

ఆంధ్రప్రదేశ్ అంతటా ఏజెంట్లు కావలెను!

రూ. 171-50 విలువ గల 49 నవలలు కేవలం
రూ. 124 లకే! లేదా ఒకేసారి చెల్లిస్తే రూ. 114 లు!
* ఒక్క రూపాయి కూడా ఖర్చు లేకుండా
పై 49 నవలలు ఉచితంగా కూడా పొందవచ్చు!!
వివరములకు మరియు ఉచిత ప్రాస్పెక్టస్ కై నేడే వ్రాయండి!




## లత ఎంటర్‌ప్రైజెస్
బుక్ పబ్లిషర్స్ అండ్ డిస్ట్రిబ్యూటర్స్
మెయిన్ రోడ్, రాజమండ్రి. బ్రాంచి: హైదరాబాద్.

DIMPLE /LEP/ DESIGNERS






ముఖచిత్రం : మార్గశిర పూర్ణిమ

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

# యువ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 38 డిశంబరు, 1978 సంచిక 6


శ్రీమతి ఇందిరగాంధి పార్లమెంటు సభ్యురాలు అయారు. ఇందిర కాంగ్రెస్‌కు పలుకుబడి హెచ్చుగావున్న కర్ణాటక రాష్ట్రంలోని చిక్‌మగళూరు నియోజక వర్గం నుంచి లోక్‌సభకు నవంబరు 5వ తేదీన జరిగిన ఉప ఎన్నికలో శ్రీమతి ఇందిరగాంధి గెలుపు పొందారు. ఆమెకు ప్రత్యర్థులుగా నిలిచిన 27 మంది అభ్యర్థులు ఓడిపోయారు. వారిలో 26 మంది డిపాజిట్లను కోల్పోయారు. పూర్వం కర్ణాటక రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా వున్న శ్రీ వీరేంద్రపాటిల్, జనత పార్టీ అభ్యర్థిగా నిలబడి, శ్రీమతి గాంధికన్న 77 వేల తక్కువ ఓట్లు వచ్చినందున ఓడిపోయారు.

ఈ ఉపఎన్నిక దేశమంతటి దృష్టినేకాక, ప్రపంచంలోని కొన్ని అగ్ర రాజ్యాల నాయకుల దృష్టిని కూడా ఆకర్షించింది. దానికి కారణం, పాతిక సంవత్సరాలు నెహ్రూ కుటుంబానికి ఓట్లు వేసి, మొదట్లో జవహర్‌లాల్ నెహ్రూను, తరువాత శ్రీమతి ఇందిరను గెలిపించిన రాయబరైలీ నియోజక వర్గం, 1977 ఎన్నికలతో శ్రీమతి గాంధిని, ఆమె ప్రధాన మంత్రిగా వుండగా ఓడించడము, దాదాపు 12 సంవత్సరాలు ప్రధానమంత్రిగా వుండి, లోక్‌సభ ఎన్నికలలో ఓడిపోయిన శ్రీమతి గాంధి, చిక్‌మగళూరులో గెలుస్తారా,

గెలుపరా అనే విషయం ప్రజలందరికీ కుతూహలాన్ని కలిగించింది. పైగా, ఇందిర కాంగ్రెసు, జనత పార్టీలు యీ ఎన్నికలో తమకుగల సర్వసాధన సంపత్తినీ సంపూర్ణంగా వినియోగించి, ముమ్మరమైన ప్రచారాన్ని సాగించారు. ఇందిర కాంగ్రెస్‌పార్టీకి విశేష పలుకుబడి కలిగి, ఆ పార్టీయే పరిపాలన చేస్తున్న కర్ణాటక రాష్ట్రంలో ఆ పార్టీ తరపున నిలబడిన శ్రీమతి ఇందిర గాంధి గెలుపు విషయంలో మొదటినుంచీ ఏ విధమైన సందేహం లేకపోయినప్పటికీ, జనతా పార్టీవైపు ప్రజాభిప్రాయం ఏమైనా కొంత మొగ్గిందా, చూదాం అనే కుతూహలం ప్రజలలో బాగా కలిగింది. ఈ ఎన్నికలో శ్రీమతి గాంధి గెలుపు పొందడంతో, కర్ణాటక రాష్ట్రంలో జనత పార్టీ ఎక్కువగా ప్రజామోదాన్ని పొందలేకపోయిందని తేలిపోయింది.

శ్రీమతి ఇందిరగాంధి, లోక్‌సభ సభ్యురాలు అయినందువల్ల గలిగే పరిణామలను గురించి, అనేకులు అనేక విధాలుగా భావిస్తున్నారు. ప్రతిపక్ష నాయకురాలుగా వ్యవహరిస్తూ, తన పార్టీకి ఎక్కువ బలాన్ని చేకూర్చుకోవడానికి ఆమె ప్రయత్నించవచ్చుననీ, యీ ప్రయత్నాల ఫలితంగా, చీలిపోయిన కాంగ్రెస్ మళ్లీ ఏకమై ఒకే బలమైన ప్రతిపక్షం తయారుకావచ్చుననీ, కాలక్రమేణ జనతా పార్టీలోని కొందరు తమ పార్టీవ్యవహారాల పట్ల అసంతృప్తి పొంది, కాంగ్రెస్‌లో చేరవచ్చుననీ, అలా జరిగిననాడే జనతా పార్టీ బలం తగ్గి, కాంగ్రెస్ పార్టీయే మళ్లీ అధికారంలోకి రావచ్చుననీ, అప్పుడు శ్రీమతి ఇందిరగాంధి మళ్లీ ప్రధానమంత్రి అవవచ్చుననీ ఊహించేవారు కూడా వున్నారు. ఏది ఎలా జరుగుతుందో, ఊహాగానాలు మాత్రమే కాని, స్పష్టంగా చెప్పడానికి ఎంతమాత్రమూ వీలులేదు.

అయితే చిక్‌మగళూర్ ఎన్నిక ఫలితం ప్రభావం ఆంధ్రప్రదేశ్‌లో త్వరలోనే జరుగబోయే రెండు ఉపఎన్నికలమీద ఎంత వుంటుందనే విషయం మాత్రం, ఆలోచించవలసిన సంగతే. 1977లో జరిగిన పార్లమెంటు ఎన్నికలలో, ఆంధ్రప్రదేశ్‌లోని 42 స్థానాలలో, 41 స్థానాల నుంచి కాంగ్రెస్ అభ్యర్థులే గెలుపొందారు. అప్పుడు, ఆ పార్టీకి నాయకురాలు శ్రీమతి గాంధి. త్వరలోనే ఉపఎన్నికలు జరుగబోయే సికిందరాబాద్, సిద్దిపేట నియోజకవర్గాల నుంచి ఎన్నిక అయిన ఎం. ఎం. హాషీం, జి. వెంకట

స్వామిగార్లు రాష్ట్ర మంత్రివర్గంలో చేరినందున, పార్లమెంటు సభ్యత్వానికి రాజీనామా ఇచ్చారు. వీరిద్దరూ, ఇందిర కాంగ్రెస్ సభ్యులు. ఈ నియోజక వర్గాలలో ఇందిర కాంగ్రెస్ పలుకుబడి ఎంత అని ఆలోచించవలసిన అవసరం ఎందుకు వచ్చిందంటే, 1977 నాడు కాంగ్రెస్ ఒకటే. ఈనాడు రెండు అయింది. ఈ నియోజకవర్గాలలో, 1977 ఎన్నికలలో జనత పార్టీ కొంత వరకు బాగానే నిలబడింది. అప్పటికి యిప్పటికీ, ఇక్కడ జనత పార్టీ పట్ల ప్రజల ఆదరణ పెరిగిందా, తగ్గిందా అనేది చూడవలసిన విషయమే.

# కాంతి కిరణాలు

పందిరిమంచంమీద, తెల్లటి దుప్పటి దానిమీద మల్లెపువ్వులు ఘుమఘుమలాడుతున్నాయి. పందిరి చుట్టూరా, మల్లెపూవుల దండలు వ్రేలాడుతున్నాయి. మల్లెపువ్వులన్నీ ఒక్కసారిగా తమలోని సువాసనలను వెదజల్లుతున్నాయి. మంచం ప్రక్కనే టేబుల్ మీద రకరకాల తినుబండారాలు, వాటిమధ్య అగరవత్తుల స్టాండు, అగరవత్తులు వెదజల్లే కమ్మటి సువాసనలకు, మల్లెపువ్వుల పరిమళాలు తోడై, గిరిధర్‌ను మత్తెక్కిస్తున్నాయి.

మధురమైన అనుభూతులతో, తియ్యని కోరికలతో, అతడి మేను పులకించిపోసాగింది. ఝాన్సీతో, అందుకోబోయే స్వర్గం గురించి ఆలోచిస్తూ, ఆమెకోసం ఎదురుచూడసాగాడు.

క్షణం ఒక యుగంగా ఎదురు చూస్తుంటే, ఝాన్సీ గదిలోకి అడుగు పెట్టింది. పాలనురుగులాంటి చీరతో ఆమె పుత్తడిబొమ్మలా ఉంది. సిగ్గుతో తలవంచుకొని తలుపుదగ్గర నిలబడింది.

కోటి కోరికలతో తనకోసం ఎదురు చూస్తూ, మనసు, తనువు, చివరికి తన జీవితమే అర్పించటానికి సిద్ధంగా ఉన్న ఆ స్త్రీమూర్తిని, తన హృదయానికి హత్తుకోవాలని, ఆమెను చేరబోతుంటే, తన్మయత్వంతో నెమ్మదిగా ఝాన్సీ దగ్గరకు వచ్చాడు గిరిధర్.

"ఝాన్సీ!" మధురంగా పిలుస్తూ, రెండూ చేతులు జాపి, తన బాహువుల్లో బంధించేందుకు, చిరునవ్వుతో భార్యను ఆహ్వానించాడు

ఝాన్సీ నెమ్మదిగా, తల పైకి ఎత్తి భర్తవంక చూసింది. ఆరాధనతో నిండిన అతడి చూపులకు, ఒక్క ఉదుటున వచ్చి, అతడి బాహువుల్లో వాలిపోయింది. ఆమె నడుము చుట్టూ చేతులు బిగించి, గాఢంగా హృదయానికి హత్తుకున్నాడు గిరిధర్. తొలి స్పర్శకు ఇద్దరి మేనులు పులకించిపోయాయి. ఆ మధురానుభూతిని, ఆస్వాదిస్తూ ఒక నిముషంసేపు మైమరచిపోయారు.

ఝాన్సీ నెమ్మదిగా కిందకు జారి, భర్త పాదాలపై వాలిపోయింది.

ఝాన్సీ తలఎత్తి భర్తవంక చూసింది. ఆమె కళ్ళు తడితో మెరుస్తున్నాయి

"మీరు నిజంగా దేవతలు. మీ ఇల్లాలుగా నన్ను చేసుకొని, నా జీవితానికి ఒక అర్థాన్ని కల్పించిన దైవ

కందేపు సుజాత



స్వరూపులు." ఆనందాన్ని తట్టుకోలేక తడబడుతూ, అంటున్న భార్యవంక వింతగా చూశాడు గిరిధర్.

భార్య కళ్లల్లో ప్రతిఫలిస్తున్న, అనురాగాన్ని తిలకిస్తూ, ఆమెను లేవనెత్తి హృదయానికి అదుముకున్నాడు.

"ఏవండీ!" ఆరాధనగా అంటూ, వెక్కి వెక్కి ఏడ్చింది ఝాన్సి.

భార్య భుజం తడుతూ, "పిచ్చిదానా! ఏమిటీ పిచ్చి. ఇలాంటి సమయాల్లో ఏడవకూడదు." అనునయిస్తూ మంచం దగ్గరకు నడిపించి, మంచంమీద కూర్చో బెట్టి, పక్కనే తాను కూర్చున్నాడు గిరిధర్.

ఝాన్సీకి ఉపశాంతి కలిగింది శాసేపటికి.

"ఝాన్సీ" అంటూ, ఆమె చేతిమీద చెయ్యివేసి మృదువుగా నొక్కాడు గిరిధర్. ఇద్దరి హృదయాలు తన్మయత్వంతో తేలిపోయాయి. గిరిధర్ భార్యకు దగ్గరగా జరిగి, ఆమె భుజం మీద తల ఆనించి, ప్రక్కనుండి కనిపిస్తున్న ఆమె నునుపాటి బుగ్గలను చూస్తూ, "ఈ రాత్రి మనకు ఎంతో మధురమైనది. ఈ రోజు నుండి మన ఇద్దరి జీవితాలు, ఒకటిగా కలిసి పోతాయి ఈ రేయిలోని మాధుర్యాన్ని చవిచూడకపోతే, ఆ లోటు జీవితంలో ఎప్పటికీ తీరదు. అంత అందమైన రాత్రి ఇది." నెమ్మదిగా గుసగుసలాడు తున్నట్లు చెప్పుతున్న, భర్త మాటలకు సిగ్గుపడిపోయింది ఝాన్సీ. ఆమె బుగ్గలు కెంపులుగా మారాయి.

సిగ్గుతో ముడుచుకుపోతున్న భార్యను చూస్తుంటే, గిరిధర్‌కు ఆవేశం ముంచుకు వచ్చింది. ఆమె గడ్డాన్ని పట్టుకొని పైకెత్తి చప్పున ఆమె పెదవులతో, తన పెదవుల్ని కలిపాడు గిరిధర్.

క్షణం సేపు కాలం స్తంభించి పోయింది ఇద్దరి మధ్య. భర్త చేసిన పనికి అతడివంక చూడలేకపోయింది ఝాన్సీ. తొలిసారి ముద్దు ఝాన్సీకి చాలా మధురంగా వుంది...ఆ తియ్యని అనుభూతినుండి బయటపడి, భార్యవంక తదేకంగా చూడసాగాడు.

"ఈరోజు అనుభవించే అనుభవం కోసం ఎంతగా ఆరాటపడుతున్నానో తెలుసా!" అని, "మరి...నీకు అలాంటి అనుభవంకోసం ఆరాటం లేదా ఝాన్సీ?" భార్య చేతిని, తన చేతిలోకి తీసుకొని మృదువుగా నిమురుతూ, అడిగాడు గిరిధర్.

భర్త మాటలకు ఝాన్సీ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. జలజల చెంపల మీదుగా జారి, గిరిధర్ చేతిమీదపడ్డాయి.

తృళ్ళిపడ్డాడు గిరిధర్. "ఏమిటిది ఝాన్సీ?" ఖంగారుగా అడిగాడు...

"ప్రతి ఆడపిల్ల యవ్వనంలో ఎన్నో కలలు కంటుంది. తన భర్త గురించి, అతడితో పంచుకొనే జీవితాన్ని గురించి ఎన్నో ఊహలు, అల్లుకుంటుంది. తాను కన్న కలలు నిజంకావని తెలిసినప్పుడు ఎంతగా విలపిస్తుందో, అనుభవించే వారికే తెలుస్తుందండీ!" అంది ఝాన్సి.

"నా కేమీ అర్థంకావటంలేదు." అనుమానంగా, నెమ్మదిగా అడిగాడు గిరిధర్.

ఆహ్లాదకరమైన సమయం తారుమారైంది. అతడి వదనం చిన్నబోయింది. దుఃఖంలో వున్న ఝాన్సి అది గమనించలేదు. ఆమె దుఃఖించే విధానం చూస్తుంటే ఎన్నాళ్ళబట్టో ఆనకట్టవేసిన దుఃఖం, ఇప్పుడు కట్టలు తెంచుకుని వచ్చినంత ఉధృతంగా ఉందనిపించిం దతడికి.

భార్య భుజంమీద చెయ్యివేసి, "ఏడవకు ఝాన్సీ! నీకు కలిగిన బాధ ఏమిటో నాకు చెప్పు! ఇప్పుడు మన మిద్దరం భార్యా భర్తలం. ఇన్నాళ్ళూ ఒకరికి చెప్పుకోలేని బాధలు మనం చెప్పుకొని, ఉపశాంతి పొందవచ్చు" అంటూ అనునయించాడు. చిన్నపిల్లల్ని బుజ్జగిస్తున్నట్లుగా ఓదార్చుతున్న భర్త గుండెల్లో తలదాచుకొంది ఝాన్సి.

కొంతసేపటికి సర్దుకొని కూర్చుని, భర్తవంక చూసింది. అతడి ముఖంలో విచారం, కళ్ళల్లో లక్ష అనుమానాలు, కోటి ప్రశ్నలు కనిపించాయి.

ఝాన్సి నెమ్మదిగా మొదలుపెట్టింది.

ఇన్నాళ్ళూ, నాలో నేనే కుమిలిపోతున్న బాధను ఎవరికీ చెప్పుకోలేకపోయాను. తల్లిదండ్రులకు కూడా చెప్పుకోలేని బాధ అది.

"అదే నా పెళ్ళి సమస్య. నా కీ జన్మలో పెళ్ళి జరుగుతుందని కలలో కూడా ఊహించుకోలేకపోయాను. ఇల్లాలి స్థానం పొందలేననుకున్నాను.

మా నాన్నగారు ఎలిమెంటరీ స్కూల్ టీచర్. ఆయనకు వచ్చే జీతం బొటా

పాటిగా తిండికిసరిపొయ్యేది. ఇక దాచు కునే ఆలోచనే రాలేదాయనకు. నాన్నగారు ముగ్గురు పిల్లలతో సరిపెట్టు కున్నారు. గంపెడు పిల్లలు ఉండి ఉంటే, మరింత హీనస్థితికి దిగజారి ఉండేవారం.

ఇంటికి నేనే పెద్దదాన్ని. వయస్సు రాగానే, పెళ్ళి సంబంధాలు చూడ సాగారు నాన్నగారు. నేను, నచ్చితే నాన్నగారు ఇచ్చే బహుతక్కువ కట్నం నచ్చలేదు చాలామందికి

నాన్నగారు నిరాశ చెందక పట్టుదలతో అల్లుడిని కొని, కూతురికి కట్టబెట్టాలని ఎంతగానో తాపత్రయ పడ్డారు. ఒక్కటి కూడా కలిసిరాలేదు

ఇలా అయిదేళ్ళు గడిచినా నాకు సంబంధం కుదరలేదు. సంవత్సరాలు గడిచేకొద్దీ నాకు పెళ్ళి జరుగుతుందనే నమ్మకం పోయింది. ఇన్నాళ్ళుగా పెంచుకున్న ఆశలన్నీ పేకమేడలుగా ఒక్కొక్కటిగా కూలిపోయాయి.

ఉద్యోగం చేస్తానంటే అందుకు నాన్నగారు ఒప్పుకోలేదు. ఉద్యోగం చేస్తే తన శవాన్ని పూడ్చిన తరువాత ఉద్యోగంలో చేరమన్నాడు.

నాన్నగారి పట్టుదలకు అదిరిపోయి ఆయన బెదిరింపుకు మౌనం వహించాను. రాను రాను నాలో అశాంతి చోటు చేసుకుంది. నా ఒక్కదానికే పెళ్ళి చేయలేక అవస్థలుపడుతున్న నాన్న గారిని చూస్తుంటే నా గుండె తరుక్కు పోయింది. చెల్లెలి పెళ్ళి, తమ్ముడి చదువు, ఎలా సంసారాన్ని నెట్టుకొస్తారో అర్థంకాలేదు.

నాన్నగారి వరుల వేటకు అంతం అనేది ఉన్నదా ? అనిపించేది. నాన్నగారు ఒక సంబంధం చూశారు.

నేను బ్రతికిఉన్నంతవరకు నాన్నగారి వేటకు, అంతువుండదు. అసలు దీని కంతటికి కారణమైన నేనే అంతం అయిపోతే, నాన్నగారి వేటకు, నాకు, ఒక పరిష్కారం దొరుకుతుందని ఆశించాను.

ఇప్పుడు తెచ్చిన సంబంధం కూడా తప్పిపోతే, ఆత్మహత్య చేసుకుందామనే నిర్ణయానికి వచ్చాను.

మీరు నన్ను చూడటం, వెంటనే మీ అంగీకారం తెలియబరచటం, అప్పటి కప్పుడు ముహూర్తం నిర్ణయించటం అన్నీ వరుసగా జరిగాయి.

మీరు కట్నం తీసుకోకుండా నన్ను చేసుకుంటున్నారని, విని ఆశ్చర్య పోయాను. కల కాదుకదా అనిపించింది. అడుగంటిపోయిన నా ఆశలు మళ్ళీ మొలకెత్తటం ప్రారంభించాయి. ఇంట్లో అందరూ పండగ చేసుకున్నారు. అమ్మ నాన్నల సంబరానికి హద్దు లేకపోయింది.

ఒక కన్యను ఆత్మహత్య నుండి తప్పించారు. మీరు మీ యిల్లాలుగా చేసుకున్నారు..." ఇంకా ఏదో చెప్ప బోతున్న భార్యను వారించాడు గిరిధర్.

"అవు ఝాన్సీ!" వారింపుగా అన్నాడు.

తల త్రిప్పి, భర్తవంక చూసింది ఝాన్సీ. అతడి వదనం కళా విహీనమై వాడిపోయి ఉంది. అతడి కళ్ళల్లో బాధ స్పష్టంగా కదలాడింది.

"నిన్ను ఆత్మహత్య నుండి నేను కాపాడాను. కాని, మా అక్కయ్యను ఎవరూ రక్షించలేకపోయారు." అతడి కంఠం జీరవోయింది.

ఝాన్సి ఆశ్చర్యంగా చూస్తూ "ఏమిటండీ మీరు చెప్పేది?" అర్థం కానట్టుగా, అయోమయంగా అడిగింది.

"మీ కుటుంబగాథ, మా కుటుంబ చరిత్ర అంతా ఒకటే ఝాన్సీ! మా నాన్నగారికి ఎనిమిది ఎకరాల పొలం, ఒక ఇల్లు వుండేవి. ఆస్తి ఉందనే అహంకారంతో, ఏ ఉద్యోగమూ చెయ్యకుండా, డబ్బును ఇష్టంవచ్చినట్లుగా ఖర్చు చేశారు. మేము పెద్దవాళ్ళం అయ్యేసరికి, ఆస్తి అంతా హరించుకు పోయింది. పూట గడిచేందుకే కష్టం అయిపోయింది.

అప్పుడుగాని నాన్నగారికి, కనువిప్పు కలగలేదు. అప్పటికి ఎదిగిన కూతురు వుందని, గుర్తుకువచ్చింది. ఎన్నో సంబంధాలు చూశారు. ఒక్కటి కూడా కుదరలేదు. అలా పెళ్ళి కాకుండా అక్కయ్య పాతికసంవత్సరాల వయస్సు వచ్చేవరకు కన్యగానే ఉండిపోయింది. ఇక ఈ జన్మలో తనకు పెళ్ళి జరగదనే దిగులుతో బావిలో దూకి, ఆత్మహత్య చేసుకుంది.

ఆస్తిపోయిన దిగులుతో ఉన్న నాన్నగారు కూతురి పెళ్ళిచేసే స్తోమత లేక, కూతుర్ని దూరంచేసుకొని, కుమిలిపోయి, మంచం పట్టి, పెళ్ళి కాకుండా, కన్యగా చనిపోయిన కూతుర్ని వెదుక్కుంటూ తానూ వెళ్ళిపోయారు.

నేను అప్పటికి బి.కాం. పాసయ్యాను. సరిగ్గా ఆ సమయంలోనే, చిన్నప్పుడే భర్తపోయిన మేనత్త ఒకామె ఉన్నది. ఆమెకు పిల్లలు లేరు. జబ్బు చేసి, ఆమె పోయింది. పోతూ పోతూ రెండు ఎకరాల పొలం, ఒక ఇల్లు, కొన్ని నగలు, నా పేర రాసి, పొలం అమ్మి చెల్లెలి పెళ్ళిచెయ్యమనే తన కోరిక వెల్లడించి, చనిపోయింది.

వెంటనే ఒక ఎకరం పొలం అమ్మి చెల్లెలి పెళ్ళి చేశాను. ఉన్నదాంట్లో ఘనంగా చేసి, దాన్ని అత్తగారింటికి పంపించాను.

నాకు ఉద్యోగం వచ్చింది. మళ్ళీ మా యింటి పరిస్థితులు బాగుపడ్డాయి. మేనత్త ఇచ్చిన ఆస్తి మా జీవితాలు, అధోగతి పట్టకుండా కాపాడింది.

అక్కయ్య మరణం నాకు చాల మనస్తాపం కలిగించింది. అక్కయ్య లాంటి అభాగ్యులు దేశంలో చాలామంది ఉన్నారు. కనీసం అలాంటి స్థితిలో ఉన్న ఒక పేదపిల్లను పెళ్ళిచేసుకొని అక్కయ్య ఆత్మకు శాంతి కలిగించా లనే నిర్ణయానికి వచ్చాను.

నా అభిప్రాయం అమ్మకు చెప్పాను. అనుభవాన్ని పొందిన అమ్మ వెంటనే ఒప్పుకుంది. అప్పటినుండి వాకబు చెయ్యసాగింది. సరిగ్గా అక్కయ్య ఉన్న స్థితిలో నువ్వు వున్నట్లు తెలిసింది. వెంటనే మనస్ఫూర్తిగా నిన్ను పెళ్ళి చేసుకున్నాను," అన్నాడు గిరిధర్.

ఝాన్సీ మనస్సు వికలం అయింది. బాధగా నిట్టూర్పు విడిచి, మంచంమీద నుండి లేచి, కిటికీ దగ్గరకు వెళ్ళి, నిలబడి, బయిటికి చూడసాగింది.

ఆకాశంలో చంద్రుడు చల్లని వెన్నెల కురిపిస్తున్నాడు. నక్షత్రాలన్నీ మిణుకు మిణుకు మంటున్నాయి. కొన్ని ఎక్కువ కాంతితో ప్రకాశిస్తున్నాయి. కొన్ని తక్కువ కాంతితో ప్రకాశిస్తున్నాయి

దేశంలో ఉన్న కన్నెపిల్లల పరిస్థితులు కూడా అలాగే ఉన్నాయి. ఈ డబ్బుగలవాళ్ళు, తమ పిల్లలకు ఎక్కువ కట్నంఇచ్చి, మంచిభర్తతో ముడిపెట్టి, వాళ్ళకు ఎక్కువ ప్రకాశాన్ని కలిగిస్తారు.

కాని, పేదింటి, కన్నెపిల్లలు, అభాగ్యులు, తగినంత కట్నం ఇచ్చుకోలేక నానా యాతనలు పడుతున్నారు. ఆ కన్నెపిల్లలు, తక్కువకాంతితో ప్రకాశిస్తున్నారు. దేవుడి సృష్టిలో, ప్రతివిషయంలోను తేడాలే.

ఆలోచిస్తున్న, ఝాన్సీ మనసు, భారమైంది. అలా ఎంతసేపు నిలబడి ఉన్నదో, ఆమెకే తెలియదు. చప్పున, భర్త గుర్తుకు వచ్చాడు. తిరిగి చూసింది. అతడు అటు తిరిగి పడుకొని ఉన్నాడు

మొదటిరాత్రి మధురంగా ఉండవలసిన వాతావరణం, మోయలేనంత విషాదంగా మారింది ఝాన్సీకి, చాలా బాధ కలిగింది.

ప్రేమగా మాట్లాడిన భర్త మాటలకు తట్టుకోలేక, తన బాధనంతా బయటపెట్టి ఇద్దరిలోనూ విషాదం నింపింది. నెమ్మదిగా నడుచుకుంటూ, వెళ్ళి... మంచమీద, భర్త ప్రక్కన కూర్చుంది.

"ఏమండీ!" అతని, భుజంతట్టి, "నిద్రపోతున్నారా" అంది, నెమ్మదిగా.

"లేదు" కదలకుండానే, అలాగే పడుకొని,సమాధానం ఇచ్చాడు గిరధర్.

భర్త హృదయంలో, విషాదం నింపిన తానే, అతడిని ఆహ్లాదపరచాలనుకొని, ప్రక్కనే బల్లపైన ఉన్న, పాలగ్లాసును అందుకొని, "కొంచెంపాలుతీసుకోండి!" అంది.

"ఇప్పుడు నాకు ఏమీవద్దు ఝాన్సీ! నువ్వు పడుకో," అన్నాడు

గిరిధర్ మాటలకు, ఝాన్సీ మనస్సు చివుక్కుమంది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి తననుతాను సంభాళించుకొని, "ఇందాక నాతో ఏమన్నారో గుర్తులేదా? అప్పుడే మరచిపోయారా?" ఆమె కింతం బరువుగా పలికింది

చప్పున, గిరిధర్ ఇటు తిరిగి, "ఏమన్నాను." భార్య కళ్ళల్లోకి చూస్తూ, కుతూహలంగా అడిగాడు.

భర్తలో కుతూహలం కలిగినందుకు ఝాన్సీ సంతోషించింది... కళ్ళల్లోకి చూస్తున్న, అతడి ... చూపులకు సిగ్గుపడింది.

"చెప్పుఝాన్సీ! ఏమన్నాను. నాకు గుర్తు లేదు." చెప్పమని బలవంతం చేశాడు

నిరుత్సాహంగా ఉన్న భర్త, ఇప్పుడు ఉత్సాహాన్ని పుంజుకొనేసరికి, ఒక ప్రక్క ఆనందం, భర్త అన్న మాటలు, తిరిగి అతడికే చెప్పాలంటే, ఏదో తెలియని, సిగ్గు ఆవరించాయి, ఝాన్సీకి.

"ఈ రాత్రి గడిచిపోతే, మళ్ళీ తిరిగి రాదని, అనుభవించవలసిన, అనుభూతులు అన్నీ వదలకుండా, తనివితీరా జీవితంలో, ఎప్పటికీ... మరచి పోకుండా... అనుభవించాలని, అనలేదా?" సిగ్గుపడుతూనే, చెప్పింది.

ఝాన్సీ, మాటలు గిరిధర్‌కు, ఎంతో ముద్దుగా, వినసొంపుగా ఉన్నాయి. మాటలు, నేర్చుకుంటున్న పాపాయి మాటలుగా ఉన్నాయి. తనివి తీరా ఆనందంగా భార్యను చూశాడు.

భార్య భుజం చుట్టూరా చేతులువేసి దగ్గరకి జరిగి, "మొత్తానికి గడుసు దానివే," అంటూ, భార్య చేతిలో ఉన్న పాలగ్లాసు అందుకున్నాడు.

"చప్పగా, చల్లారిపోయ్యాయి. ఎలా గోయి తాగేది." మారాంచేస్తూ, అన్నాడు.

"ఈ రోజుకు ఎలాగో త్రాగండి! రేపటినుండి, వేడిగా ఉన్నప్పుడే తాగుదురుగాని," సముదాయిస్తున్నదానిలా, అంది ఝాన్సీ.

సగం త్రాగి, మిగతా సగం భార్యకి ఇచ్చాడు గిరిధర్.

"ఝాన్సీ!" మృదువుగా, పిలిచాడు.

"ఊఁ మత్తుగా పలికింది, ఝాన్సీ.

"ఈ పాలులాగా, మన జీవితం, చప్పగా ఉండకూడదు. ఎప్పుడూ పచ్చగా ఉండాలి. అలా ఉండాలంటే నీ సహకారం కూడా ఉండాలి." భార్య నడుము చుట్టూ చేతులువేసి, దగ్గరకి లాక్కుంటూ, మృదుమధురంగా, అన్నాడు.

"మీ ఇల్లాలిగా, స్థానం కల్పించిన, మీరు, మీరేది కోరినా కాదనే శక్తి నాకు లేదండీ! ఇప్పుడు నా తనువు, మనసు, అన్నీ మీకే అంకితం చేస్తున్నాను. మన జీవితం, నందనవనం కావాలి. నా జీవితం మీద కాంతికిరణాలు ప్రసరింప చేసిన దైవం మీరు. ఆ చల్లని, కాంతి కిరణాలలోనే నా జీవితాన్ని దాలిస్తాను." అంటూ, భర్త హృదయంలో తల దాచుకుంది.

ఇద్దరూ ఆనందపు అంచులకు చేరుకున్నారు.

---

# ధరిత్రి

## వేమకోటి సీతారామశాస్త్రి

శారదను రోడ్డుమీద వదలి బస్సు దుమ్ము రేపుకుంటూ పోయింది. రోడ్డు ప్రక్కన బోర్డు చూసింది. సత్యవరం ఐదు కిలోమీటర్లు అని రాసివుంది. రోడ్డువేపు చూసింది. నల్లని మెట్లంగి రాళ్ళతో అస్తవ్యస్తంగా వుంది. రోడ్డుకు యిరుప్రక్కలా ముళ్ళడొంకలు.

శారద మనస్సు లేడిపిల్లలా చెంగుచెంగున గెంతులు వేస్తోంది. తను చేరుకోవాల్సిన ఊరును గురించి గమ్మత్తు గమ్మత్తు కలలు కంటూ చూసింది, హుషారుగా.

శారద సన్నగా మెరుపుతీగలా అందంగా వుంది. ఆమె కట్టుకున్న తెల్లచీర ఆమెకు చాలా అందంగా కుదిరింది. ముఖానవున్న కుంకుమ బొట్టులోని చెమ్కీ నిప్పులుకక్కే సూర్యుడి కిరణాల్ని తనలో దాచుకొని చిరునవ్వుతో తళుక్కుమంటున్నది!

చేతితో పెట్టె పట్టుకొని జీవనయాత్ర ప్రారంభానికి తొలి అడుగు వేసింది. అడుగువేస్తున్నపుడే తన నింతవరకూ అనాధ శరణాలయంలో వుంచి, పెంచి పెద్దచేసి, విద్యాబుద్ధులు గరిపిన అనాధ శరణాలయం అధిపతి దీనబందుగారు గుర్తుకు వచ్చారు

ఆ రోజు ఉద్యోగం ఆర్డరు చేతిలో పెట్టినపుడు, అప్రయత్నంగానే, ఆయన పాదాలమీద పడి కన్నీటి అభిషేకం చేసింది. ఆప్యాయంగా లేవనెత్తారు. ఆయన కన్నీటిలో తృప్తితో కూడిన ఆనందబాష్పాలు రెండు, ఆమె తలమీద నిలచి

---

**1978** చక్రపాణి మూడవ అవార్డు పొందిన నవల

ఆశీస్సులుగా మారాయి. ఒకరి మనస్సులో కృతజ్ఞత, వేరొకరి మనస్సులో బాధ. ఆవేదన, రెక్కలొచ్చిన పిట్ట, గూడు వదలి వెళ్ళిపోతోంది, జీవనయాత్రా సమరానికి. పాలరాతి శిల్పం పల్లెపట్టుల నివసించడానికి బయలుదేరాల్సి వచ్చింది.



దేశంలో పేదరికంమీద, అజ్ఞానంమీద, నిరక్షరాస్యతమీద, ఆర్థిక సమానతలమీద, ఆయనకు కొన్ని నిర్దుష్టమైన అభిప్రాయాలు వున్నాయి. వాడవాడలా, పల్లెపల్లెలా పసిపాపలు పలకలు పట్టాలి. పెదవులు కదపాలి. పెరిగి పెద్దలై, విజ్ఞానంతో ప్రభుత్వమును నడపాలి. సామ్యవాదాన్ని, సమతా భావాన్ని, విశ్వశ్రేయస్సును కాంక్షించడానికి పురోగమింప జేయాలి.

"అమ్మా, శారదా! నీ జీవితాన్ని సరిదిద్దుకోవడానికి తొలి మజిలీ చేరుకోబోతున్నావు. మానవతను సంతరించుకున్న మనిషి ఆశయాలు నీకు తెలుసు. యివాళ పల్లెల్లో జరుగుతున్న అభివృద్ధి మాట అలా వుంచి ముఖ్యంగా, రాజకీయాలూ, కక్షలూ, కావేశాలూ, వీటన్నిటి మధ్య పెత్తందారీ వ్యవస్థ, నాట్యంచేస్తూ, అజ్ఞానాన్నీ, దారిద్ర్యాన్నీ పెంచేస్తున్నది. మేదస్సు వికసించని మనుషులు వొకరకమైన వింత బానిసత్వానికి బలైపోతున్నారు. జీవన గమ్యం యేమిటో వాళ్ళకు తెలియదు. వాళ్లు అంధకారంవేపు పురోగమిస్తున్నారు.



వారి భావిజీవితానికి చిరు వెలుగు నీవు. విద్య ప్రసాదించి, వారిలో నిద్రాణమైన చైతన్యాన్ని జాగృతం చేయగలిగితే చాలు, నీ జన్మ ధన్య మౌతుంది. వీటికి యెన్ని అవాంతరాలు వచ్చినా ధైర్యంగా యెదుర్కొగలిగే శక్తి, నా శిక్షణద్వారా నీకు లభించిందన్న విశ్వాసం నాకు వుంది. వెళ్ళిరా..." అంటూ వీడ్కోలు చెప్పారు.

కాలికి చిన్న మెట్లంగిరాయి తగిలేసరికి, శారద ఆలోచనలు తెగిపోయాయి. వర్తమానంలోకి వచ్చింది. అప్పుడే సగం దూరంకు పైగా నడిచింది. చుట్టూ చూసింది. నల్లని కొండలు. బండరాళ్ళు...అక్కడక్కడ వొకటో రెండో తాటి చెట్లు.

కొండల మధ్యనుండి పొగ ఆకాశంమీదకు ఎగురుతున్నది. 'అదే సత్యవరం పూరు' అనుకుంది, శారద. ఆమె ముఖంమీద స్వేదబిందువులు నీటిముత్యాల్లా ఎండలో మెరుస్తున్నాయి.

ఊరు దగ్గరవుతున్నకొలదీ యేవో శబ్దాలు విన్పిస్తున్నాయి. రోడ్డు పక్కగా పాతిక గజాల దూరంలో వొక ఆరుగురు గునపాలు పారలతో భూమిని తవ్వుతున్నారు. యెండలో వాళ్లు బాగా అలసిపోయారు. చెమట వాళ్ళ శరీరాన్ని తడిపేసి వుంది. మనుషులు కనిపించేసరికి ఆమెకు ప్రాణం లేచివచ్చినట్లయింది. నెమ్మదిగా నడిచి వెళ్ళింది. వాళ్ళామెను ఆశ్చర్యంగా చూస్తున్నారు, చేస్తున్న పని ఆపి

"యెవరమ్మా మీరు...?" అడిగాడొకడు.

"నేను ... నేను ... ఈ వూళ్ళో టీచరుగా పనిచేయడానికి వచ్చాను. ప్రెసిడెంటుగారి యింటికి వెళ్లాలి..." అంది.

ఆమె గొంతు తడారిపోయింది. వాళ్ళందరూ మొహమొహాలు చూసుకున్నారు. అందరూ కలిసి కుండలో నీళ్ళు గ్లాసులో వొంపుతున్న యువకునివేపు చూసారు.

"యిందండి, కాస్త మంచినీళ్ళు తాగండి. యెండనబడి వచ్చారు" అన్నాడు ఆ యువకుడు ఆమెచేతికి గ్లాసు యిస్తూ. అమృతం దొరికినంత పనయింది శారదకు. తాగి సేద తీరింది.

"ఈ గ్రామంలో వొకటే మేడ వుంది. అదే ప్రెసిడెంటుగారిల్లు... అన్నాడు," ఆ యువకుడు కొంచెం సంస్కారం వుట్టిపడే కంఠంతో.

అప్రయత్నంగానే అతనివేపు చూసింది అతను చాలా అందంగా సన్నని మీసకట్టుతో వున్నాడు అతని కళ్ళలో ఒక వింత తేజస్సువుంది. వొంటినిండా, చేతినిండా మట్టి అంటుకొని స్వేదజలంతో కరిగిపోయి వుంది.

"నా పేరు రవి..." అన్నాడు మర్యాద పుట్టిపడే స్వరంతో.

"నా పేరు శారద..." అంది అప్రయత్నంగానే.

"ఊళ్లోనే వుంటారు కదా, మళ్లా కలుద్దాం..." అంటూ అతను తవ్వకం పని ప్రారంభించాడు.

ముందుకు సాగింది శారద. వూళ్లో ప్రవేశించిన శారదకు "దణక్...దణక్... ...దణక్...దణక్..." లయబద్ధంగా డప్పులు మ్రోగటం విన్పించాయి. జనం గుమిగూడటం, కేకలు, ఈలలు విన్పిస్తున్నాయి. పసుపుపచ్చని సిరిమాను ప్రెసిడెంటుగారి మేడముందు ఆగి వుంది. జనంలో కొంతమంది పూనకం వచ్చినట్లుగా ఊగిపోతున్నారు. పిచ్చిగా "పాదాలమ్మా తల్లీ రచ్చించు. వొరసం పంపించు..." కేకలు వేస్తున్నారు.

సంబరం ముందుకు సాగేవరకూ అక్కడే వారగా నిల్చుండిపోయింది. అమ్మలక్కలందరూ ఆమెని వింతగా చూసారు అప్పుడప్పుడు ప్రెసిడెంటుగారి కోసం ఆఫీసర్లు, చదువుకున్న ఆడవాళ్ళు రావటం వాళ్ళకు బాగా తెలుసు. అప్పటికి మధ్యాహ్నం పన్నెండుగంటలు కావస్తోంది.

"నమస్కారమండీ ప్రెసిడెంటుగారు." తీయని కంఠస్వరం విని లోపలికి వెళ్ళబోతున్న కామినాయుడు వెనక్కు తిరిగి చూసాడు.

సన్నగా మెరుపుతీగలా వుందామె. అతని కోరమీసాల క్రింద చిరునవ్వు తొణికిసలాడింది అతని వయస్సు యేభై సంవత్సరాలు దాటినా నలభై కి మించనట్లుగా కనబడుతోంది.

"యెవరు నువ్వు ?" అన్నట్లుగా చూసాడు. అతని కళ్ళలో యెర్రజీర వుంది.

"నా పేరు శారదండి ఈ ఊళ్లో టీచరుగా వేసారు" అంది వినయంగా.

"అలా కూర్చో" అన్నాడు, ఆమెను నఖశిఖ పర్యంతం చూపులతో గుచ్చుతూ యేకవచన ప్రయోగంతోనే.

శారద శరీరం సిగ్గుతో కుంచించుకుపోయింది. భుజం నిండుగా పైట కప్పుకొని కూర్చుంది.

"సాంబా ఒరేయ్...సా. బా...ఎక్కడ చచ్చావురా..." గర్జించాడునాయుడు.

"వొత్తన్నా బాబూ..." అంటూ చేతిలో నూరుతున్న కత్తిని బల్లమీద పెట్టి చేతులు కట్టుకొని నిలబడ్డాడు.

"ఈమెగారు! కొత్త పంతులమ్మగారు. మన బడి, పాత మేష్టరుండే యిల్లు

సూపించు...యిదిగో యేమైనా దాహం తాగుతావా ?" అన్నాడు సుతారంగా మీసం మెలివేస్తూ.

"యేమీ అక్కర్లేదండి" నమస్కారం పెడుతూనే లేచింది. ముందు సాంబడు నడిచాడు. ఊరులో జాతర సంరంభం, రెండో పేటవేపు మళ్ళింది.

చెరువుగట్టు పక్కగా తాటాకుల పాక స్కూలు. చెరువుగట్టుమీద పాడుపడిన శివ దేవాలయం, పిచ్చిగాలికి, తాటాకులు రేగిపోయి రెక్కలు కత్తిరించేసిన పక్షిలా వుందా స్కూలు. స్కూలు ఆవరణ, వరండా అంతా పేడగుట్టల మయం. కొంతమంది స్త్రీలు పేడ చరుస్తున్నారు స్కూలు గోడలమీద.

"యిదేనండి స్కూలు..." అన్నాడు సాంబడు. వాడివేపు అయోమయంగా చూసింది. శారద చూపులో అర్థం గ్రహించాడు సాంబడు.

"ఈ స్థలం మన ప్రెసిడెంటుగోరిదండి. ఫ్రీగా గవర్నమెంటువారి కిచ్చేసినారండి అంతెందుకండీ మీ రుంకబోయే ఆ యిల్లు గూడా మన ప్రెసిడెంటు గోరిదేనండి," అన్నాడు గర్వంగా

స్కూలుకు పదిహేనుగజాల దూరంలో వుందా యిల్లు. యిల్లనడంకన్నా దాన్ని పశువు శాల అనడం న్యాయం. పిడకలు చేయడం మాని ఆ స్త్రీలు స్కూలుకు వచ్చిన శారదను చూడడానికి వచ్చారు.

"కొత్త పంతులమ్మేంటిరా అన్నా..." అడిగింది, ఒక యువతి. ఆమె మోకాళ్ళవరకూ చీర యెగగట్టింది. రెండు చేతులూ పేడమయమై వున్నాయి

"అవునే. మట్టినేల స్కూలంతా సీపురుతో వూడిసెయ్యండి. పిడకలు మరి గచ్చుమీద సరవమాకండి. యిది మా సెల్లెలు లచ్చి..." అన్నాడు. లచ్చి శారద కట్టుకున్న తెల్లచీర వంక యెగాదిగా చూస్తున్నది.

"ఒసేయ్ సెల్లీ. పంతులమ్మగోర్ని యింటికి తీసుకెళ్ళు. ఆరిగోరికి దగ్గరుండి సూడు. యేటయినా కావాలంటే పెసిడెంటుగా రింటికొచ్చిసి వొట్టి కెళ్ళు..." అంటూ సుడిగాలిలా దూసుకుపోయాడు గర్వంగా చూస్తూ సాంబడు.

పేడ కుప్పల్ని తప్పించుకొని నెమ్మదిగా గదిలో అడుగుపెట్టింది శారద. లోపల భరించలేనంత పేడ కంపు. కుర్చీగాని టేబిలుగానీ యేమీ లేవు

"మీరీ వాసన భరించలేరమ్మగారు. రేపటికల్లా సుబ్బరం సేస్తాను. పదండి అమ్మగారూ..." అంటూ శారదను పూర్వం మేష్టరుగారుండిన యింటివేపు దారితీసింది. తలుపు తడితే వూడిపోతుందా అన్నంత సుతారంగా వుందా

ముందుగది తలుపు కిర్రుమని తెరుచుకుంటూ. వొక గది, వొక వంటిల్లూ, తర్వాత కొంచెం స్థలం.

లోపల గదినిండా చుట్టపీకలు, కాల్చి పారేసిన బీడీముక్కలు నలిగిపోయిన పువ్వులదండలూ యివన్నీ గలీజుగా కనిపిస్తున్నాయి. గది మధ్యలో చిరిగి పోయిన ఈతాకుల చాప వొకటి వుంది. సూట్ కేసు యెక్కడ పెట్టాలో తెలియ లేదు.

"యింతకు ముందో ముసలిపంతులుగా రుండేవోరండి. ఆయనకి గుండె నొప్పి వస్తే పట్నం పెద్దాసుపత్రికి పంపించేసారండి, మన పెసిడెంటుగోరు. ఆ ముసలాయనకు ముందు మీలాంటి పంతులమ్మ గారొచ్చినారండి. ఆరిగోరు యేడాది పన్జేసి కానుపుకు పట్నం యెల్లిపోనారండి; ఆయమ్మ కాడనే నాను నాలుగచ్చరం ముక్కలు నేరిసినానండి..." అంది లచ్చి. హుషారుగా నవ్వుతూ గెంతే సెలయేరులా వుంది లచ్చి, మూలనున్న మొండి చీపురుకట్టతో గదిని శుభ్రంచేస్తూ. యింతలో కావిడితో సంబరాలు వచ్చాయి. వాటి వెనకాతల రెండు కుండల కావిడితో నీళ్ళు మోసుకుని సాంబడు వచ్చాడు.

"మా పెసిడెంటుగోరు పంపారమ్మగోరూ. మీ రీ పూటకు సెయ్యికాల్చుకో వద్దని కేరియరు పంపినారమ్మా..." చెప్పాడు.

శారద మనస్సు కృతజ్ఞతతో నిండిపోయింది. యెంత పుణ్యంచేసుకుని వచ్చానో యీ వూరు అనుకుంది, సామాన్లు సర్దటం ప్రారంభిస్తూ.

* * *

సాయంకాలం నాలుగు గంటలు కావస్తోంది. కామినాయుడు అప్పుడే చిన్న కునుకు తీసి లేచాడు. అతనికి సమంగా నిద్రపట్టలేదు. బుర్రలో యెన్నో ఆలోచనలు. పనిమనిషి అప్పుడే గ్లాసుతో బోర్నవీటా తెచ్చింది. అది తాగుతూ సావిట్లోకి వచ్చాడు. అక్కడ వొకటే కుర్చీ వుంది. ఆ కుర్చీలోనే అతను కూర్చుంటాడు. కుర్చీలో కూర్చోవడానికి తగిన అర్హతగలవాళ్ళు వస్తే లోపల్నుండి కుర్చీ తెప్పిస్తాడు. మిగతా జనం అంతా నేలమీద కూర్చోవలసిందే. యెవరో వొకరు అప్పుకోసం, తగువుకోసం, పరిష్కారంకోసం వస్తూంటారు. కుర్చీలో కూర్చుని త్రేవుమని తేన్చాడు, కామినాయుడు. అతని చూపు బయట నిల్చున్న అసిరయ్యమీద పడింది. వాడు మాలపేటకు పెద్ద. కాలం వొంచేసిన యినుపకమ్మిలా వున్నాడు.

"యేంరా? యిలా వచ్చావు...?" అడిగాడు.

"చిత్తం దొరా! తమ గులాపోడ్ని. తమతో నా బాధలు సెప్పుకోడానికి వచ్చాను..."

"కరణంగారు నీకు కబురంపినారా ?"

"సిత్తం దొరా! తమ గులాపోడ్ని. యేటి సెప్పమంటారు..."

కామినాయుడికి కోపం వచ్చింది. వాడి మనసులో వుద్దేశ్యం తెలవదు, చెప్పదు.

"అయితే ఆ కాస్త భూమి నా కిచ్చేరా! అక్కడో బియ్యంమిల్లు పెట్టుదామనుకుంటున్నారా?" అన్నాడు అధికారంగా. అసిరయ్య నేలమీదబడి దండం పెట్టాడు.

"దొరా తమరు కోపం సేయకండి. తమ భూముల పక్కనున్న సిన్నసిన్న ముక్కల్ని కలిపేసుకున్న నా నేటననేదు దొరా. యికాస్తా భూమిలో యేవో కూరగాయలు పండించుకొని బ్రతుకుతున్నా దొరా..." అన్నాడు దీనంగా. వాడి కళ్ళమ్మట నీళ్ళు తిరుగుతున్నాయి.

"బాబు కిచ్చేరా! ముసలోడా! బతికినంతకాలం బతకవు. దరమ పెబువు..." అన్నాడు సాంబడు అప్పుడే మెట్లెక్కుతూ. వాడు మరి మాట్లాడలేకపోయాడు.

"ఒరేయ్ నాకు నీ భూమి తీసుకోవాలని లేదురా! అయితే రోడ్డుపక్కన వుంది. ధాన్యంతో బళ్ళు రావడానికి వీలవుతుందని అడిగాన్రా...సరే నీ యిష్టం...ఆలోచించు..."

"ఈ సమయంలో నన్ను మొగమాట పెట్టకు దొరా! నా మంగ నో యింటి దాన్ని సెయ్యాల. నా రెక్కల కట్టంమీదనే జరగాల దొరా..." అన్నాడు. నాయుడు కళ్ళు కోపంతో జేవురించాయి. యేమైనా చేసివుండేవాడు. పొరుగూరునుండి యెవరో రైతులు వచ్చారు. అందువలన మరి, మాట్లాడలేకపోయాడు.

"ఓరి అసిరయ్యా మరోసారి ఆలోచించి రారా..." అన్నాడు, కంపెనీ చుట్ట వెలిగించుకుంటూ.

"ఆడి కా భూమి వొగ్గడం యిట్టం లేదయ్యా. ఆడి తాతల్నాటినుండి అందులోనే బతికారటయ్యా. ఆడు వొగ్గనుగాక వొగ్గనంటున్నాడు," అన్నాడు, సాంబడు. వెళ్ళిపోతున్న వాణ్ని నిదానంగా చూస్తూ.

"ఆ మంగకట యీడు పెళ్ళి సేస్తాడట, గొప్పోటి పెళ్ళి..." అన్నాడు. మీసాల వెనక అతని విషపునవ్వు బయటికి రాలేదు.

''కుల పెద్ద కదా! మరి సెయ్యడా...'' నవ్వేశాడు సాంబడు లోపల గదిలోకి వెడుతూ.

వాడి వెనకాతలే బిస్కట్లు తిన్న కుక్కలా వెళ్ళాడు, నాయుడు.

''యిదిగోనయ్యా. జాతర సందాలు అందరి దగ్గరా వసూలు చేసినాను. కోమటి బంగారయ్య మాతరం రేపిస్తానన్నాడు...'' అంటూ రొంటినున్న నోట్లూ సిల్లరా, అతని చేతిలో పోశాడు. కామినాయుడి కళ్ళు మిలమిల మెరిశాయి.

''అది సరేగాని యేటంటోందిరా కొత్తపంతులమ్మ'' అడిగాడు చుట్టపొగ బయటకు వదుల్తూ

''పంతులమ్మగోరు కాదు బాబు...ఆ యమ్మాయి బంగారం బొమ్మనుకోండి. మీ రంపించిన వస్తువులు సూసి యెంతో సంతోషపడిపోనాది. నానింకా తమ యివరాలు యేటి సెప్పనేదనుకోండి...'' అన్నాడు తల గోక్కుంటూ.

''యెంత పనిచేశావురా! యెంటనే సెప్పలేకపోయావురా!'' చిరుకోపం ప్రదర్శించాడు.

''తమరిగోరి గొప్పతనం నానెందుకు సెప్పాలి దొరా! మా సెల్లెలుందికదా అది సెబుతుంది లెండి...దా నెచ్చరించి వొచ్చాను'' అన్నాడు.

''యేమోరా! దాన్ని సూసిందగ్గర్నుండి నా మనసు కుతకుతలాడిపోతుంది,'' అన్నాడు గోడకు యెదురుగావున్న అద్దంలో తన మీసం దువ్వుకుంటూ.

''కొత్తపిట్ట దొరా! నిదానంగా మచ్చికచేసి వొడుపుసూసి పట్టుకోవాలె. యేమాత్రం పొక్కిపోయినా...'' చెప్పడానికి సందేహించాడు.

''నాకు తెల్సు లేరా...'' అన్నాడు. అంతకు పూర్వం వుండే వొక పంతులమ్మను జాగ్రత్తగా బంగారం గిల్టు నగలు ప్రెజంటుచేసి, పెళ్ళి చేసుకుంటానని నమ్మించి, ఆమె గర్భవతి అయితే చాలా డబ్బిచ్చి, ఆమెను వొదిలించుకున్నాడు.

''యేమైనా మీరీసారి జాగరత్తగా యెవ్వారం సూసుకోవాలి...'' అన్నాడు సాంబ.

''నాకు తెలుసులేరా! పాత పంతులమ్మలాగ జరగనివ్వనులే. అది సరేగానీ యింకేటిరా సంగతులు ఊళ్ళో...'' మరో చుట్ట వెలిగించాడు.

''మనోళ్ళు నుయ్యి తవ్వటం ప్రారంభించారయ్యా...'' అన్నాడు నవ్వి పోతనగా.

"ఓరేయ్ యిల్లు అలకగానే పండుగ గాదురా..." అన్నాడు నవ్వి.

ఐదువందల గడపకన్నా యెక్కువలేని వూరు సత్యవరం. కొండల మధ్య వెలిసింది. సత్యవరం అన్న పేరు యెందుకు వచ్చిందో యెవ్వరికి తెలియదు. అన్ని కులాలవారూ ఆ వూళ్ళో వున్నారు. ఆ వూరికి నాయకుడు ప్రెసిడెంటు, కామినాయుడు, ప్రభుత్వానికి ప్రజలకు మధ్య బ్రోకరులాంటివాడు. ప్రజలందర్నీ అతను తన గుప్పెట్లో బిగించి వుంచాడు. స్వతహాగా అతను చదువుకోలేదు. కానీ అనుభవం నేర్పిన పాఠాలు జీవితంలో చాలా నేర్చుకున్నాడు. ప్రజల కష్టసుఖాలకు ఆదుకున్నట్లే ఆదుకొని వాళ్ళకుండే కొద్దిపాటి మెరక భూముల్నీ, ఆస్తుల్నీ ఆక్రమించుకొని, అహంకారం పెంచుకున్నాడు. వూళ్లోకి యెవరొచ్చినా సరే అతని దర్శనం చేయాల్సిందే మరి. ప్రతీదీ అతని పరంగానే జరగాల్సిందే. ఆ వూళ్ళో పేరుకు ప్రజలకు ప్రభుత్వం చేసే సదుపాయాలన్నీ కామినాయుడిద్వారా అందుతూనే వున్నాయి.

ఆ వూళ్ళో పేరుకు చెరువు వున్నా అందులో నీరు వుండదు. నాయుడి పొలాలకు ఆ నీరు రెండో పంటకు మళ్ళించబడుతుంది. చెరువున్నా లేనట్టే లెఖ్ఖ.

వూళ్ళో అందరికీ కలిసి వొకటే బావి.

అది కొంచెం లోతైనా వూరివాళ్ళ అవసరాలకు సరిపడదు. వేసవిల్లో పాతాళానికి పోతుంది.

ఆ బావి కాక కామినాయుడి పెరట్లో వొక చిన నందనుయ్యి వుంది. అది అతని అవసరాలకు మించినదైనా మరొకరు ఆ దట్టమైన ప్రహరీ గోడను దాటి రావడానికి వీలులేదు. అన్ని గ్రామాలలోలాగే ప్రభుత్వం, నూతులు తవ్విస్తుందని, మంచి రోడ్లు వేయిస్తుందని, వొక నమ్మికను కామినాయుడు ఆ అమాయక ప్రజల మనస్సులో కలిగిస్తున్నాడు. గొర్రెల్లాంటి ప్రజలువింటున్నారు సకాలంలో వర్షాలు పడటంకోసం మహాధికం, మొదలైన అంటువ్యాధులు రాకుండా వుండటంకోసం, ప్రతి సంవత్సరం, సాదాలమ్మ జాతర చేయిస్తాడు, ప్రజలదగ్గర డబ్బు చందాలు యెత్తి కాని యీసారి ఆ కార్యక్రమం సజావుగా సాగిపోలేదు. కొంత ప్రజల మధ్య రభస జరిగింది.

"నీళ్ళకోసం చేయాల్సింది జాతర కాదు... మరో నుయ్యి తవ్వటం..." అన్నాడు రవి, నిదానంగా ఆలోచించి వూళ్ళో కొంతమందిని వెనకేసుకు వెళ్ళి.

"అది కాదు బాబూ! యిది చాలా సంవత్సరాలుగా వస్తున్న ఆచారం. దీన్ని




యివాళ కోసం పాదాలమ్మకు అపచారం చేసినవాళ్ళ మవుతాం..." అన్నాడు పంతులు. అతనికి కరణం ఉద్యోగం.

"ఆచారం, సాంప్రదాయం యివన్నీ మతానికి, విశ్వాసానికి సంబంధించిన విషయం. మంచినీళ్ళు మనిషి మనుగడకు కావల్సిన అవసరం. జాతరలు చేసుకోండి. కానీ నీళ్ళకోసం అని మాత్రం ముసుగువేయకండి. దానికోసం అమాయకపు ప్రజలదగ్గర చందాలు వసూలు చెయ్యకండి. యిది దారుణమైన విషయం..." అన్నాడు కొంచం కోపంగా.

"ఈ వూరికి అతగాడు పెద్దా! నేను పెద్దా; అడుగు పంతులూ..."అన్నాడు కామినాయుడు గర్జిస్తూ.

"ఊరి పెద్ద యెవరన్నది కాదు పంతులుగారూ. ఊరికి యేం కావాలి అన్నది ప్రధానం. యీ వొక్క బావిలో నీరు వూళ్ళో యెంతమంది అవసరాలకి సరిపోతున్నాయి. దీనికోసం రాత్రింబవళ్ళు యెంతమంది పడిగాపులు పడ్తున్నారు. ఊరికి పెద్దన్నవాడు యిది యెప్పుడయినా గుర్తిందాడా? వాటికోసంయేమయినా ప్రయత్నాలు చేసారా!" ఆవేశంగా అడిగాడు రవి.

"అలా గడగండి బాబూ..." అన్నాడు కోటీశు.

అక్కడ గుమిగూడిన వాళ్ళందరి ముఖాలు చూసాడు, కామినాయుడు. అందరూ అదే ప్రశ్న వేస్తున్నట్లుగా కనిపించింది.

"ఓ రూరకోరా! ప్రతీ నాయాలా మాట్లాడటమే..." అన్నాడు సాంబడు కోపంగా. కోటీశు కోపంగా చూసాడు.

"ఓరి ఆద్నేటనకురా! ఆడు కుక్కలాటోడు. ఆడికేటి తెలుసు మన ప్రజలకేటి తెలుసు. దానమ్మ సిగతరగ. వచ్చిన ప్రతి అఫీసరుకీ ఈ వూరి బావి

కోసం సెప్పానో లేదో మీ కే ఎరిక. యేటి సేస్తాం, యిగో శాంక్షన్ సేస్తాం. అగో శాంక్షన్ సేస్తాం అనేవోరే. ఈసారి అయిద్రాబాద్ యెల్లినప్పుడు గట్టి పట్టు పట్టేస్తా..." అన్నాడు.

ప్రజల ముఖంలో సంతృప్తి కనిపించింది.

"యిలాంటి హైద్రాబాద్ కబుర్లు చెప్పి ప్రజల్ని చాలాసార్లు నమ్మిస్తున్నాడు పంతులుగారూ మీ ప్రెసిడెంటుగారు...కానీ యింక ఆ పప్పులు ఉడికేరోజులు మరి మిగలవు...యేది యేమయినా జాతర రోజునే బావి తవ్వేతాం" అన్నాడు దృఢంగా.

''యెలా తవ్వేతాడో నానూ సూస్తాను.యీ వూర్లో నాయాలి యెవరు తవ్వకాని కెడతారో నానూ సూస్తాను. యెల్లమనండి. ఆడితో మనకి మాటేటి..." అని తసిరేసాడు.

ఆ నవ్వులోనే గతరోజు వుదయం జరిగిన ఆ సంఘర్షణ గుర్తుకు వచ్చింది.

"యింతకీ యెవరెవరు తవ్వారురా ?" అడిగాడు కోపంగా.

"రవిబాబుగోరూ, మా కోటీశుగాడు, మరో యిద్దరు, మాలపల్లె నుండి మరో ముగ్గురు కలిసి తవ్వకం మొదలెట్టారు బాబూ..." అన్నాడు.

"ఆహా!" తల పంకించాడు. క్షణం సేపు ఆలోచించాడు. మరో చుట్ట వెలిగించాడు.

"ఒరేయ్ సాంబా ! అసిరయ్య గాడితో చెప్పు, మాలపల్లెనుండి యెవడెళ్లినా, అళ్లకింక మన పొలాల్లో కూలి దొరకదని సెప్పు..." అన్నాడు కోపంగా. సాంబడు తలవూపి నడుంకు తువ్వాలు చుట్టుకుంటూ వెళ్లిపోయాడు.

* * *

గోధూళి సమయం. అలసిపోయిన సూర్యుడు కొండల చాటుకు వెళ్లిపో తున్నాడు, జేవురించిన ముఖంతో. తల దువ్వుకొని అందమైన ప్రకృతిని చూస్తున్నది శారద.

"సీ కిక్కడ అన్ని సమపాయాలూ అమరినట్లేనా?..." నవ్వుతూ నాయుడి ప్రశ్నతో ఆమె తలెత్తిచూసింది. వెనకాతల సాంబడు రెండు కుర్చీలు వేసాడు.

"యేదో మీ దయవల్ల. చాలా కృతజ్ఞురాలిని" అంది. నాయుడు పొంగిపోయాడు.

''సీ కేటి కావల్సినా యిబ్బందిపడకు. నేను సెజాలమీద యేర్పాటు సేస్తాను. అదేటలా నిల్చున్నావ్? కూర్చో..." అంటూ రెండో కుర్చీ

చూపించాడు. కామినాయుడు తెల్లగ్లాస్కోపంచె కట్టుకున్నాడు. సిల్కు చొక్కాకు రాసుకున్న సెంటు గాలిలో కలిసి కరిగి సువాసనల్ని మత్తుగా విరజిమ్ముతోంది.

"రేపట్నుంచి బడి ప్రారంభిస్తానండి."

"అప్పుడే యేటి తొందర. కాస్త అలసట తీర్చుకో. మంచిరోజు చూచి ప్రారంభించుదువు గాని. ఆఁ! కొంచెం మంచినీళ్లు యిస్తావా?"

శారద లోనికి వెళ్లి గాజుగ్లాసులో మంచినీళ్లు తెచ్చి యిచ్చింది.కావాలనే ఆమె వేళ్ళుతాకాడు. పాముకాటేసినట్లుగా భయపడ్డది. ఆ భయంలోనే కొంచెం నీళ్ళు వొలికాయి.

"యిదేనా మొదటి వుద్యోగం ... యిదివరకెక్కడయినా సేసావా?" అడిగాడు నీళ్ళు త్రాగుతూ.

"యిదేనండి మొదటిసారి వుద్యోగం రావటం," అంది వినయంగా.

యిది కొత్త పిట్ట. వొట్టి బెదురుమనిషిలా వుంది. నిదానంగా లొంగదీసుకోవాలి మచ్చిక చేసి" అనుకున్నాడు మనస్సులో, మంచినీళ్ళు త్రాగుతూ. కొన్ని క్షణాలు ఆమె అందాల్ని, సొంపుల్ని చూసి—

"యింక నే వస్తాను. ఒరేయ్ సాంబా! యింటికాడ నుండి పట్టె మంచం, పరుపు, తలగడా, పంతులమ్మ గోరింటికి తీసుకురా!" అన్నాడు. తల వూపాడు సాంబడు వినయంగా.

"అక్కర్లేదండి. నేను నేలమీద పడుకోగలను. మీరేమీ శ్రమపడకండి..." అంది వినయంగా.

"మాకు శ్రమేటి! మా మనుషులన్న తర్వాత మేం సదుపాయాలు సెయ్యకపోతే యెలా......?" ఒక విషపు నవ్వు నవ్వి కోరచూపు విసిరేసి హుందాగా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు. కాని రెండడుగులు వేసి మళ్ళా తిరిగివచ్చి ఊళ్లోక్కరౌడీమూక వొకటి తయారయింది. జాగ్రత్తగా తలుపేసుకు పడుకో" అని హెచ్చరించి వెళ్ళిపోయాడు.

ఊరంతా సందడి తగ్గింది. అక్కడక్కడ చిన్న చిన్న పల్లె పదాలు రాగయుక్తంగా విన్పిస్తున్నాయి. దీపం వెలిగించింది, శారద. "దేశమును ప్రేమించుమన్న..." శరణాలయంలో ప్రార్థనాగీతం మనస్సులోనే పాడుకుంటోంది అరమోడ్పు కన్నులతో.

ఆమెకు పవిత్ర దేవాలయంలాటి శరణాలయ వాతావరణం గుర్తుకు వచ్చింది.

పితృ సమానులయిన దయానందగారి ప్రార్థనలు, బోధలు; మతం, ధర్మం మొదలైనవాటిమీద ఆయన ఉపన్యాసాలు, శరణాలయంలో ప్రతీ రోజూ ఆయన ధ్యానం మీద చెప్పే వివరణా జ్ఞాపకం వచ్చింది.

"ప్రార్థించినా, ప్రార్థించకపోయినా రోజూ వుదయం స్నానంచేసి వద్యాక కాస్సేపు రెండు మూడు నిముషాలు ధ్యానించు మనసు నిశ్చలం చేసుకొని. యితర సంగతులేవీ రానీయకుండా యేదైనా ఉదాత్తవిషయం ధ్యానించు నీవు మనసుని నిలకడచేసుకోవటం చాలా అవసరం. రాత్రి పడుకునే ముందు ఒక్క-క్షణం ఆ నాటి నీ చర్యలు గురించి విమర్శించుకో. జీవితము అమూల్యమైన వొక అవకాశం.

ప్రతి నిముషం యెంతో విలువైనది. ఈ రోజు నీవు యెంత సదవకాశాన్ని వృధా చేసావో తెలుసుకోగలిగితే, రేపు మరింత జాగ్రత్తగా వుంటావు. యిలా విమర్శించుకునేటప్పుడు నిర్దాక్షిణ్యంగా వుండాలి. నిన్ను నీవే వెనకేసుకు రాగూడదు యెప్పుడూ ఈ ఆత్మపరీక్షవల్లే వొక్కొక్క మెట్టు పైకి వెళ్లగలం. అందుకు ధ్యానం అవసరం," అని గంభీరంగా చెప్పేవారు; ఆయన వదనం లోకి చూస్తేనే యెంతో ప్రశాంతత లభించేది.

"మిమ్మల్ని నేనేం డిస్టర్బు చేయటం లేదు కదా?" అన్న గొంతు విని కళ్లు తెరిచింది. ఉదయం తనని ఊరి ముందు పరిచయం చేసుకున్న రవి.

"రండి! కూర్చోండి..." అంటూ కుర్చీ చూపించింది.

"ఫర్వాలేదు. యిలా కూర్చుంటాను. యెలా వుంది మా వూరు?" అంటూ బయట అరుగుమీద కూర్చున్నాడు. యిద్దరి మధ్యా దీపం వెలుగుల్ని వెదజల్లుతోంది. గదిలోపల అగరొత్తి చల్లటి వాసనను వెదజల్లుతోంది.

"దాహం తాగుతారా?" అడిగింది.

"అక్ఖర్లేదండి. యింతకీ ఈవూరు......"

"చాలా బాగుందండి. రాగానే ఈ వూరి ప్రెసిడెంటుగారు కన్నకూతుర్ని ఆదుకున్నట్లు అన్నీ పంపించారండి. కొద్దిరోజులు శ్రమపడితే స్కూలు గూడా కొంచెం పరిశుభ్రమైన స్థితిలో పెట్టవచ్చు..." అంది.

ప్రెసిడెంటు పదం వినేసరికి పిడికిలి బిగిసింది రవికి.

"మీరేమీ అనుకోకుండా వుంటే వొక విషయం చెప్పదలచుకున్నాను" అన్నాడు దృఢంగా. శారద ఆశ్చర్యపోయింది. యేమిటన్నట్లుగా చూసింది.

"ఈ వూళ్లో ప్రజలు చాలా అమాయకులు. శ్రమజీవులు. వీళ్ళకక్కడ

దోచుకోబడుతున్నారు. చిన్నపిల్లలతోపాటు వీరిలో గూడా జ్ఞానదీపాలు వెలిగించాలి. ఆలోచన అనేది మానవులకు రాగలిగితే అది దేన్నయినా శస్త్ర చికిత్స చేయగలుగుతుంది. వాళ్లకోసం మీరు రాత్రి పాఠశాలలు గూడా నిర్వహించాలి," అడిగాడు ప్రాధేయపూర్వకంగా. శారదకు ఆశ్చర్యంవేసింది. తన ఆశయాలకు అనుగుణమైన వ్యక్తి వొకడున్నారు.

"తప్పకుండా మీ సూచన పాటిస్తాను..."అంది ఆనందంగా.

"పిల్లలకు నేర్పవలసింది కేవలం చదవటం, రాయటం మాత్రమే కాదు ఊహించటం, భవిష్యత్తును గూర్చి ఆలోచించటం నేర్పాలి. అంతేకాదు మీరు వృత్తిని వృత్తిగా తీసుకోకండి. బాధ్యతగా తీసుకోండి. అభ్యుదయకరమైన పనులు ప్రారంభించే ముందు అభివృద్ధి నిరోధక శక్తులు యెదురవుతాయి. పిరికి వాళ్లయితే పలాయనమంత్రం పాటిస్తారు. హేతువాదులైతే ధైర్యంగా యెదుర్కొని సాధిస్తారు. యిలా అంటున్నానని యేమనుకోకండి. నాకు చిన్నప్పట్నించీ వున్నది వున్నట్టు మాట్లాడ్డం వొక అలవాటు," అన్నాడు.

రవి హెచ్చరికలో యేదో ఆవేదన వుందని గ్రహించింది శారద. యింతలో రవి దగ్గరికి నలుగురైదుగురు మనుషులు రావటం గమనించింది.

"చినబాబూ ? మాలపేట పెద్దని తీసుకొచ్చాను" అన్నాడు కోటేశు.

"దండాలండీ సినబాబు గోరూ" అన్నాడా మాల పెద్ద అసిరయ్య.

"యేం లేదులూ ? వూళ్లో వున్న వొక్క నూతితో యెంతో అవస్థపడు తున్నాంకదా ! వూళ్లో కొంతమంది యువకులం కలసి, కొత్తగా తాటితోపు దగ్గర నుయ్యి తవ్వుతున్నాం. రేపట్నించి మీ పేటనుండి మరో నలుగురు మనుష్యుల్ని పంపిస్తే కొంచెం త్వరగా పని పూర్తవుతుంది. ఈ యేడు యిప్పటి వరకూ వొక్క వర్షంచుక్క రాలలేదు మరి" అన్నాడు రవి, అసిరయ్యను కూర్చోమని చెబుతూ.

"నిజమే సినబాబూ ! కానీ మావి కూలి బతుకులు...ఒక పూట కూలి పోయిందంటే, ఆ యింటి పొయ్యిలో పిల్లి తొంగుంటుంది" అన్నాడు యిబ్బందిగా.

"ఓరి అందరి బతుకులూ అలాంటివే కదా. కొంచెం యిబ్బందొచ్చినా సరుదుకోవాలి......" అన్నాడు కోటేశు.

"మీ పేటలో మిగిలినవాళ్ళు వాళ్లకి సహాయం చెయ్యవచ్చు కదా..." అన్నాడు రవి.

నిజమే బాబూ! మరి పెసిడెంటుగోరికి సంగతి యెరికైతే మమ్మల్ని నరికి పోగు పెట్టేత్తారు. యిప్పుడే సాంబయ్యొచ్చి యెవర్నీ పంపొద్దని సెప్పినాడు" అన్నాడు, దీనంగా ముఖంపెట్టి.

"ఒరేయ్ ఎన్నాళ్లురా ? యిలా వొకరికి భయపడి దిక్కుమాలిన చావు చావడానికి తయారవుతారు. మన వూరికి మనం మతో నుయ్యి తవ్వుకోవటం పాపం కాదుకదరా! ఆలోచించు. మనకోసం మన పిల్లలకోసం చేస్తున్న ఈ మంచి ప్రయత్నానికి సహకరించు." ప్రాధేయపూర్వకంగా అడిగాడు రవి.

మాల పెద్ద అసిరయ్య అతి కష్టంమీద అంగీకరించాడు శారదకు యిప్పుడిప్పుడే రవి మాటల్లో అంతరార్థం ద్యోతకమౌవుతోంది. ప్రెసిడెంటు కామినాయుడు పయోముఖ విషకుంభం అన్నమాట ఆమెకు రవిమీద అభిమానం యెక్కువయింది.

"మరింక వస్తానండి శారదగారూ" అంటూ భారమైన గుండెలతోనే లేచాడు రవి. మౌనంగానే నమస్కరించింది. రవిని సాగనంపి కోటీశు తిరిగివచ్చాడు. శారద అతన్ని చూసింది.

"నన్ను కోటీశంటారండి అమ్మగారు! రవిబాబుగోరి దగ్గర పనిచేస్తున్నాను. అమ్మగారు నాకో సిన్న ఉపకారం సేయండి. మా లచ్చికి కాసింత ఎంగిలిపీసు ముక్కలు నేరపండి" అన్నాడు, బుర్ర గోక్కుంటూ. నవ్వొచ్చింది శారదకు.

"లక్ష్మి నీ కేమవుతుంది ?" అడిగింది.

"నాకండి...మరి నాకండి...నే సెప్పలేనండి. నాకు సిగ్గేత్తుంది" అన్నాడు.

"లక్ష్మి నీ కాబోయే పెళ్ళామా ?" నవ్వుతూ అడిగింది. ఆనందంగా తల వూపి పారిపోయాడు కోటీశు.

* * *

అందంగా తెల్లవారింది.

"ఈ రోజు జీవితంలో తొలి అధ్యాయం ప్రారంభం అనుకుంది శారద. తొందరగా స్కూలుకు తయారయి వెళ్ళింది. అప్పటికే లచ్చి స్కూలు పరిశుభ్రంగా ఊడ్చింది.

"అమ్మా గంట కొట్టమంటారా ?" అనడిగింది లచ్చి.

శారద చేతి వాచీ చూసింది. టైమయింది. లచ్చి గంట కొట్టింది.

"నిన్న నీ మొగుడొచ్చి నీకు బాగా చదువు చెప్పమన్నాడే..." అంది. లచ్చి సిగ్గుపడిపోయింది.

"ఆదెప్పుడూ అంతేనండి స్కూలుకు ఏ పంతులుగా రొచ్చినా అలాగే సెప్తుతాడు. కానమ్మగారు మా అన్నకి యిట్టముండదు" అంది దీనంగా.

"ఏం, ఎందువలన ? నీ అన్నకి యిష్టంవేదా?" స్కూల్లో పీటను వేసుకొని కూర్చుంది. లచ్చి దగ్గరగా కూర్చుంది.

"మా కోటీశు మావకి, మా అన్నకి ఒక సిటం పడదు" అంది రహస్యం చెబుతున్నట్లుగా.

"ఏం, ఆస్తి తగవులు వున్నాయా ?" అడిగింది.

"అవేం లేవమ్మగారు కొలువు తగవులు..."

"అంటే..." అర్థంకాక అడిగింది.

"మా అన్నేమో పెసిడెంటుగోరి దగ్గర కొలువు. మరి మా కోటీశు మావేమో సినబాబుగోరి దగ్గర కొలవు..."

"అది తప్పా! ఎక్కడో అక్కడ పనిచెయ్యాలి కదా..."

"నిజమేనమ్మా. కానీ మరి ఆ తండ్రి కొడుకుల మధ్య పచ్చగడ్డేస్తే భగ్గన మండిపోతాది."

"ఏ తండ్రీ కొడుకులే...!?" ఆశ్చర్యంగా అడిగింది.

"అదేనండీ పెసిడెంటుగోరు, రవిగోరూ. పెపంచకంలో యెక్కడా సూడ లేరండీ, యిలాంటి కచ్చలు, కావేశాలూ..." అంది బాధగా.

అప్రతిభురాలైంది శారద.

"కారణం ఏమిటయి వుంటుంది...?" ప్రశ్నించింది.

"యేమీ లేదమ్మగారూ. సిన్నపట్నుంచీ రవిబాబంటే పడదాయనగోరికి. రవిబాబూ, మా కోటీశుమావ సిన్నతనంనుండి కలిసి తిరిగేవారు. ఆఖరి కిల్ల కొట్టాటలవల్ల నాను మా కోటీశు మావను మనువాడ్డానికి మా అన్న వొప్పుకో నంటున్నాడండీ..." అంది బాధగా, కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ. ఆప్యాయంగా భుజంమీద చేయివేసింది శారద.

"నీకేం భయంలేదు. నీకు, మీ మావకు పెళ్ళిచెయ్యడానికి నేను ప్రయత్ని స్తాను" అని ధైర్యం చెప్పింది.

గంటకొట్టి చాలాసేపు అయినా యెవ్వరూ బడిలోకి రాలేదు. శారదకు ఆశ్చర్యం వేసింది.

"సాలా నెల్లయిందికదా! పిల్లోళ్ళు అలవాటు తప్పిపోయివుంటారు. మీరు ఉండండి. నాను యిల్లకెల్లి పిలుసుకొత్తాను" అంటూ లేడిపిల్లలా పరిగెట్టింది.

చేతి వాచీ చూసుకుంది శారద. పదిగంటలు దాటింది. లచ్చి వొకిద్దరు పిల్లల్ని తీసుకువచ్చింది. వాళ్ళిద్దరూ ఏడుస్తున్నారు. మురికిబట్టలతో అసహ్యంగా వున్నారు. ముక్కు చీమిడి కారుతోంది

"యేం బాబూ యెందు కేడుస్తున్నారు ?..." అడిగింది బుజ్జగిస్తూ. వాళ్ళిద్దరూ లచ్చికేసి చూపుడువేలు పెట్టారు.

"అవునమ్మగోరు. బలే కోపం వచ్చింది నాకు. మరేటి బరువు లెత్త మన్నారూ. సదువుకోండ్రా బాగుపడ్తారు అంటే ఏడుత్తూ లగెత్తితే, రెండు తగిలించి తీసికొచ్చాను" అంది ఆయాసంతో, నుదుటిమీది స్వేదబిందువుల్ని తుడుచుకుంటూ. శారద లచ్చిచేత పిప్పరమెంట్లు తెప్పించింది. వాళ్ళిద్దరికీ యిచ్చి మళ్ళా స్కూలుకు వస్తే యిస్తానని చెప్పింది. పిల్లలిద్దరూ గెంతుకుంటూ పోయారు. స్కూల్లో యెక్కడ కూర్చోవాలో తెలియలేదు శారదకు.

"ఈ స్కూల్లో కుర్చీ, బెంచీ, పిల్లలకు బల్లలు యేవైనా వున్నాయా... లచ్చీ...?" అడిగింది.

"ఉన్నాయమ్మగారూ ! రికార్డులు అన్నీ పెసిడెంటుగోరి దగ్గర వున్నాయి. నన్ను పట్టించుకురమ్మంటారా ?" కుతూహలంగా అడిగింది.

లచ్చికి శారదంటే యెంతో అభిమానం ఏర్పడింది. సన్నగా మెరుపుతీగలా చిరునవ్వుతో సంస్కారం వుట్టిపడుతూ స్వచ్ఛంగావుండే ఆమెను చూస్తే లచ్చికి యెంతో ఆత్మీయమైన అనుభూతి కలుగుతోంది. శారద తల వూపింది.

మరో ఐదునిముషాలకు తిరిగి వచ్చింది లచ్చి.

"పెసిడెంటుగోరు మిమ్మల్నోంటబెట్టుకు రమ్మన్నారండి" అంది నీరసంగా.

"నేనా ! యెందుకు ?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

"తెలవదండి...మీతో స్కూలు గురించి మాట్లాడాలంట..."

యిద్దరూ కలిసి కామినాయుడింటికి వెళ్ళారు అప్పుడే భోజనంచేసి త్రేవుమని తేన్చుకుంటూ, బయటకు వచ్చారు.

"యేటి స్కూలు తెరిచినావట..." అన్నాడు చిద్విలాసంగా. తల వూపింది శారద.

"దాహం యేటి తీసుకుంటావా ?"

"అక్కర్లేదండి..."

"లచ్చీ, సిక్కటి మజ్జిగ తేయే" అన్నాడు సైగచేసి. లచ్చి అర్ధాంతరంగా నిలబడిపోయింది.

"నీకేనే సెప్పేది...యెల్లు...లోపలికి" అన్నాడు. లచ్చి ఉలిక్కిపడి లోపలికి వెళ్ళింది.

"అదేటలా నిలబడిపోనావు. కూకో..." అన్నాడు యెగాదిగా చూస్తూ.

"రమ్మన్నారట..." అంది నేలచూపులు చూస్తూ.

అవును కదూ, అసలు యిసయం మరిసిపోనాను. కుర్చీ, టేబిలూ యీడనే వున్నాయి. యింకా రికార్డు లేటీ లేవు. ఆటన్నిటినీ స్కూలు సరంబీమీద పెడితే సెదలట్టిపోనాయి. యింకా నిల్సునే వున్నావా..." అన్నాడు నవ్వి.

తప్పనిసరిగా కూర్చుంది.

"యింతకుమునుపు వొక పంతులమ్మ వుండేది. సాలా మంచిది, నీలాగే. రాగానే 'పెసిడెంటుగోరూ ఈ వూరు నాకు కొత్త. వుద్యోగం నాకు కొత్త. అన్నీ మీరే...మీరే...సూడాలి' అంది అలాగే నన్నాను. ఆమె వొంటిమీద ఈగవాలకుండా ఏర్పాటు సేసినాను. నీకు అన్నీ అలాగే సేస్తాను. నువ్వేటి పిల్లలూ, సదువూ అని అలసిపోకు. నీ వుద్యోగం కేటి డోకా రానివ్వను. యేటంటావు ?" అడిగాడు కొంచెం గొంతు తగ్గించి, ఆమె కళ్ళల్లోకి చూడాలని ప్రయత్నిస్తూ.

శారద ఏం సమాధానం చెప్పేదో కాని యింతలో లచ్చి మజ్జిగ తెచ్చేసింది. తాగక తప్పలేదు శారదకు.

"మరి శలవ్..." అంది లేచి చేతులు జోడిస్తూ.

"మేం చెప్పిన యిసయం మర్చిపోకు..." తిరిగి హెచ్చరించాడు.

శారద పులిబోను నుండి బయటపడినట్లుగా ఊపిరి పీల్చింది

సత్యవరం ఊరంతా మూడు వీధులు, మాలపేట, ఊరి చివర పూజా పునస్కారాలు లేని జగన్నాథస్వామి కోవెల వుంది.

"అచ్చీ మనం యిళ్ళన్నీ ఒక్కసారి చుట్టబెట్టి వద్దామే..." అంది శారద.

మధ్యాహ్నం పన్నెండు కావస్తోంది.

"యిప్పుడేటమ్మా సందెయేళ యెల్దాం మీ రింకా కూడొండుకోవాలి కదా..." హెచ్చరించింది లచ్చి.

"తిండి సంగతి తరువాతే. మధ్యాహ్నమేనా పిల్లలు స్కూలుకు రాకపోతే యెలాగే..." అంది బాధగా. అప్పుడే ఒకపూట నిష్కారణంగా వృధా అయిపోయిందన్న బాధ ఆమె నావరించింది.

"పదండమ్మా" అంది లచ్చి ఆమె నిర్ణయాన్ని సడలించటం యిష్టంలేక.

లచ్చి కా ఊళ్లో తెలియని గడపలేదు. సుబ్బమ్మ యింటివరండాలో నిల్చుని రామమ్మా, యెల్లమ్మా, పుల్లమ్మ, గోపమ్మ, సూరమ్మ, అప్పమ్మ మొదలయిన వాళ్ళందర్నీ పిలిచింది. ఊళ్ళో చిన్న పనికీ, పెద్ద పనికీ లచ్చి ఊళ్ళో తలలో నాలికలా ఉంటుంది. శారద తన్ను తాను పరిచయం చేసుకుంది. కొత్త పంతులమ్మ వచ్చిందని ఊళ్లో అమ్మలక్కలందరికీ తెలుసుకానీ, కొంతమంది చూడలేదు.

"సూడవే పంతులమ్మ అచ్చు సినేమా స్టారులా వుంది" అంది సుబ్బమ్మ రాములమ్మతో రహస్యంగా. లచ్చి విని గర్వంగా చూసింది శారదవేపు.

"నేను యీ ఊళ్ళో చదువుచెప్పడానికి వచ్చాను మీ మీ యిళ్లల్లో వుంటే ఐదు యేళ్లు దాటిన పిల్లలందర్నీ స్కూలుకు పంపించాలి" చెప్పింది ప్రాథేయ పూర్వకంగా.

"మా పిల్లోళ్ళ కెందుకమ్మా సదువులు. ఆళ్లేమి వుద్దోగాలు సెయ్యాలా? ఆళ్ళయ్యకు పొలంపనుల్లో సేదోడువాదోడుగా వుంటే సరిపోద్ది..." అంది పుల్లమ్మ.

"యిదివరకొచ్చిన పంతులమ్మ, పంతులుగోరూ ఏటీ సెప్పనేదు. అటు పనికీ, యిటు సదువుకీ దొంగైపోనారు మా పిల్లోళ్ళు" అంది మరో యెల్లమ్మ.

గొర్రెల మందలాంటి మనస్తత్వం, ఎవరేది ముందంటే అది.

"అలాకాదు. యిదివరకు పరిస్థితులు వేరు. నన్ను నమ్మండి. ప్రమాణ పూర్వకంగా చెబుతున్నాను. మీ పిల్లలకు బాగా చదువు చెబుతా... యెవరి పిల్లలు యెంత గొప్పవారవుతారో యెవరు చెప్పగలరు. నీవు చెప్పు, నీ పిల్లలు చదువుకొని గొప్పవాళ్ళు కావాలని లేదా?" అడిగింది అందులో వొకామెను.

"యెందుకుండదమ్మా. కాని యెట్టా. కడుపు కింత తిండి, కట్టుకుంది కింత బట్ట కరువుగావున్న ఈ రోజుల్లో ఆళ్ళు యేటి సదువుతారు. యెంతవరకూ సదువుతారు. పేదోళ్ళకు సదువబ్బదమ్మా..." అంది సుబ్బమ్మ నిరాశగా.

"నువ్వలా నిరాశపడకు. ఈ గ్రామంలో పిల్లలందర్నీ చదివించి, గొప్ప వాళ్ళను చెయ్యడానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను. ఈ రోజు దేశంలో వున్న మహానాయకుల్లో చాలామంది, యెంతో బీదవాళ్ళు, వారాలు చేసుకొని వీధి లాంతర్ల క్రింద చదువుకొన్నవారే. నా మాట విని కొద్దిరోజులు పంపించండి. ప్రయోజనంలేకపోతే మరి పంపించవద్దు..."




"యేమోనమ్మా! మా యజమాని పొలం కెళ్ళినాడు. రాగానే సెప్పి పంపించమంటే రేపు పొద్దుటేల పంపిస్తాను" అంది పుల్లమ్మ. ఆ మాటకు అన్ని కొప్పులు వంత పాడినట్లే లెఖ్ఖ.

"రేపు పొద్దుటేల నానొస్తా పుల్లమ్మత్తా..." అంది లచ్చి ఉత్సాహంగా.

అందర్నీ విడిచి శారద, లచ్చి ముందుకు సాగి మాలపల్లె వెళ్ళారు. వాళ్ళ యిళ్ళు పిచ్చివాడు కట్టిన పిచ్చికగూళ్ళలా వున్నాయి. వాటిమీద రేగిపోయిన తాటాకులు, కోడి ఈకలు గుచ్చినట్లుగా వున్నాయి పల్లెంతా మురికిగాను, అసహ్యంగానూ వుంది. పల్లెంతా నిర్మానుష్యంగా వుంది. వొకరిద్దరు సీమ చింతచెట్టు క్రింద గోళీలు ఆడుకుంటున్నారు. వాళ్ళకు గోచీలుతప్ప మరేం లేవు.

అసిరయ్య మెరకబొడ్డు నుండి పార భుజాన వేసుకుని పల్లెలోకి అడుగు పెట్టాడు. యిద్దర్నీ గుర్తించాడు.

"యేటమ్మా! యింత యెండవేళొచ్చారు?" అన్నాడు. వాడిదగ్గర సారా వాసన కొడుతున్నది.

లచ్చి విషయం చెప్పింది.

"అమ్మగోరు పెద్ద మనసేసి సెప్పినాది. సంతోసవే. కాని మా గుంటలకి సదువెందుకమ్మా. ఆళ్ళలా కూలీ నాలీ సేసుకొని నోకంమీద బతికేత్తారు. మీరు సెప్పినా ఆల్లకేటి బోధవుతాయా?..." అన్నాడు నవ్వి అసిరయ్య.

"అలాగనకండి అసిరయ్యా! ప్రయత్నిద్దాం పసి మనసులన్నీ వొకటే. ఏ మొక్కయినా పెంచే విధానాన్ని బట్టి ఫలితం యిస్తుంది. యేమంటావు...?"

"నిజమే తల్లీ...కానీ ఈ పల్లె సౌడు భూమి. యిక్కడే పెరుగుతున్న మొక్కలేవీ పనికిరావు..." అన్నాడు బాధగా.

"ఆ విషయం నా కొదిలిపెట్టు..." అంది దృఢంగా.

"తల్లీ నిన్ను సూస్తావుంటే సదువుల తల్లిని సూసినట్టుంది...కానీ మా గుంటల్ని పంపిస్తే పెసిడెంటుగోరి కేటి కోపంవస్తుందో..." అన్నాడు భయ భయంగా.

శారదకు ఆశ్చర్యంవేసింది. ఈ ఊళ్ళో ప్రతీ వ్యవహారం ప్రెసిడెంటుగారి కనుసన్నల్లో, అనుమతుల్తో వుండాలనుకొంది

"నీ కెందుకు ఆ విషయాలన్నీ నా కొదిలేయ్. రేపు పొద్దున లచ్చి వొస్తుంది..." అంది అడుగు ముందుకువేస్తూ.

"లచ్చమ్మా ! మా మంగసిగానీ యెక్కడైనా సూసావా ? యెక్కడి కెళ్ళిందో ఏటో మరి..." అని గొణుక్కుంటూ, గుడిసెలోకి వెళ్ళారు.

"మంగ యెవరు ?" శారద ప్రశ్న.

"వాడి కూతురమ్మా ! పెసిడెంటుగోరింట్లో పశువుల పని, పాలు తీతపనీ, అదే సేస్తుంది...ఆ గొడ్ల సావిడిలో యెక్కడో కునుకు తీస్తా వుంటుంది" అంది శారదను అనుసరిస్తూ.

సాయంసంధ్య. శారద చెరువుగట్టుమీద వుండే శిధిల శివాలయం గడపమీద కూర్చుంది. చెరువు యెండిపోయింది. ఆ చెరువు కవతల రెండు తాటిచెట్లు. వాటి కవతల నల్లని బండరాళ్ళు. ఎండకు వేడెక్కిన బండరాళ్ళమీదుగా వచ్చే గాలి గోరువెచ్చగా వుంది. ఆమె మనస్సు తేలికగా వుంది. దీనబంధుగార్కి, సమితి ఆఫీసరు తను జాయినయినట్లు తెలియజేసింది. దూరంగా ఆవుల మందలతో పిల్లలు గెంతుకుంటూ రావటం కన్పించింది. అందులో ఒకరిద్దరు పిల్లలు పిల్లనక్రోవి ఊదుతూ గేదెమీద కూర్చుని వస్తున్నారు.

"యింతమంది పిల్లలు యిలాగే పెరిగి పెద్దవారయిన తరువాత, చివరకు అజ్ఞానానికి, బానిసత్వానికి బంధీలయిపోతున్నారు. యీ వ్యవస్థనుండి వాళ్ళని యెలా తప్పించాలి" అని మనస్సులో అనుకుంటున్నది.

"యేమిటీ అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు..."

ఉలిక్కిపడి చూసింది! రవి తెల్ల పైజామా లాల్చీ వేసుకున్నాడు

"యేంలేదండి. రండి కూర్చోండి..." అంటూ కొంచెం జరిగి అతనికి చోటు చూపించింది. అతనామెకు అభిముఖంగా కూర్చున్నాడు.

"యెలా వుంది మీ స్కూలు ?..." అన్నాడు. శారద చెప్పింది, ఉదయం నుండీ తన అనుభవాలు.

"మన సమాజంలో పిల్లల పెంపకం శాస్త్రీయ జ్ఞాన పద్ధతులలో జరగటం లేదు..." అన్నాడు.

"కారణం ఏమిటంటారు...?" కుతూహలంగా అడిగింది. ప్రతీ విషయం తెలుసుకోవాలన్న జిజ్ఞాస శారదకు అధికం చిన్నతనంనుండీ.

"ముఖ్యంగా కుటుంబ వ్యవస్థలో వుండే ఆర్థిక పరిస్థితులు. వాస్తవానికి ఆ పిల్లలు సంపాదించలేరు. అయితే తల్లిదండ్రుల జీవన విధానం, వాళ్ళ ఆలోచనలు, చాలావరకు వాళ్ళమీద ప్రభావితం అవుతాయి. కూపస్థ మండూకాలైన వాళ్ళకు వుండే ఆలోచనా పరిధి తక్కువ. యింక రెండోది సమాజంలో వుండే పెత్తంవారీతనం. ఇది స్లోపాయిజన్ లాంటిది. మనిషి మేదస్సు వికసించగూడదు. వాళ్ళు విద్యావంతులయితే, తన వునికీ, రాబోయే తరాల వునికీ, హోదా, వీటన్నిటి జాతకాలు మారిపోతాయి. యిలాంటి చీడపురుగుల ఆలోచనలవల్ల గూడా పిల్లల భవిష్యత్తు దెబ్బతింటుంది..."

సెలయేరులా ఆవేశంగా చెప్పుకుపోతున్న, అతనివేపు కళ్ళింతలు చేసుకొని వింటోంది.

"అందువలన మొక్క బలంగా, ఏపుగా పెరగాలంటే ముందు భూమిని సారవంతంచేయాలి. ఈ ప్రయత్నం వొక యజ్ఞం లాంటిది దీనికి యీనాటి యువతరం నడుం కట్టాలి..." అన్నాడు రవి.

"వాళ్ళందరికీ చెప్పాల్సిన విధంలో చెప్పాను. ఉదయం లచ్చిని పంపిస్తానని చెప్పాను. వాళ్ళ ధోరణి చూస్తే వాళ్ళు పంపించేటట్లు లేరు. యేమంటే ప్రెసిడెంటుగోరు అంటున్నారు. యిక్కడంతా గమ్మత్తుగా వుంది. అయినా నా శాయశక్తులా నా ప్రయత్నం నేను చేస్తాను..." అంది దృఢంగా, అతని మాటలకు ఉత్తేజితురాలై.

"యిందులో ఏమీ ఆశ్చర్యంలేదు. దేశ సౌభాగ్యానికి పల్లెసీమలు దర్పణాలు అని రాయడానికి చదవడానికి బాగుంటాయి కానీ యివాళ అన్ని అరాచకాలు, నీచమైన రాజకీయాలు, పల్లెగ్రామాల ప్రజా జీవితంలో నుంచే ప్రారంభమవుతున్నాయి..." అన్నాడు కొంచెం నిదానంగా బాధతో.

"మీ మాటలు వింటూంటే, యిక్కడి పరిస్థితుల్నిబట్టి చూస్తే నిజమని పిస్తోంది..." అంది.

"మీరేం ఆశ్చర్యపడకండి. సూర్యుడిచుట్టూ భూమి ఎలా తిరుగుతుందో ఈ గ్రామ ప్రజ, ప్రెసిడెంటు కామినాయుడు చుట్టూ అలాగే తిరుగుతోంది. ఇప్పుడిపుడే ఆ తిరుగుడిలో మార్పు తేవాలని తీవ్ర ప్రయత్నాలు జరుగుతున్నాయి. చూద్దాం ఫలితాలు యెలా వుంటాయో..." అన్నాడు దీర్ఘంగా నిట్టూర్చి.

"మీరేమీ అనుకోకపోతే ఒక విషయం అడుగుతాను. నాకు అంత చనవు లేకపోయినా యిలా అడుగుతున్నందుకు క్షమించండి..." అంది శారద.

"సఖ్యం సాప్త పదీనం... అడగండి" అన్నాడు నవ్వి.

"ఏంలేదు. మాతృ దేవో భవః; పితృ దేవో భవః అని ధర్మశాస్త్రాలు ఘోషిస్తున్నాయి కదా...అలాంటిది మీరు మీ తండ్రిగారిని యెందుకు ద్వేషిస్తున్నారు?...'' అడిగింది.

"అయితే! నేను కామినాయుడి కొడుకుని అన్న సంగతి మీ వరకూ వచ్చేసిందన్నమాట...'' నవ్వేసి. మళ్ళా నేను ద్వేషించటంతోనే సరిపెట్టుకున్నాను. నా స్థానంలో యింకొకరుంటే హంతకుడే అయి వుండేవాడు..." అతని ముఖం యెరుపెక్కిపోయింది.

"ఆ కథ వింటారా! న్యాయమైన తీర్పు మీరు చెప్పండి" అన్నాడు కాస్సేపాగి మళ్ళీ.

శారద తల ఊపి కుతూహలంగా అతను చెప్పింది వినడానికి సిద్ధమయింది

* * *

అర్ధరాత్రయింది. తలుపులు బడాలున తెరుచుకున్నాయి. ఐదేళ్ళ కొడుకుని దగ్గర వేసుకుని మంచి నిద్రలోవున్న సూరమ్మ జుట్టు నొప్పి పెట్టడంతో హఠాత్తుగా తెలివి వచ్చింది.

యెదురుగా కామినాయుడు చిత్తుగా తాగి వున్నాడు. అతని పక్కన మరొక స్త్రీ వుంది అది గూడా చాలా బాగా తాగి వుంది. జుత్తు విరబోసుకుని దెయ్యంలా వుంది.

"యెళ్లవే నంజా, ఈ గదినుండి. నీవల్ల నాకు పిసరంత సుఖం నేకపోతోంది.'' మంచం దిగువ కీడ్చాడు. పసిడి కలలతో నిద్రపోతున్న ఆ పసివాడిని మంచం క్రిందికి రెక్కపట్టుకొని ఈడ్చేశాడు. యింకా కోపం పట్టలేక కాలితో పేడను కుమ్ముతున్నట్లు సూరమ్మను కుమ్ముతున్నాడు

"నా వొళ్ల సుకంనేదని, నా గుండె జబ్బుని, నువ్వేటి తిరుగుళ్ళు తిరిగినా

వోరిసినాను. కానీ వుప్పు డింటికే తీసికొచ్చినావు. నా నొల్లకోను. యిది నా గది. నా నెల్లను...సంపేసినా యెల్లను. అదీ నువ్వు యెక్కడికి పోతావో పోండి..." ఏడుస్తూనే యెదురుతిరిగింది సూరమ్మ. కోపంతో మరీ రెచ్చిపోయాడు.

"ఏటి సూసుకునే ఆ మిడిసిపాటు, కన్నోరు ఎవ్వరు లేకుండానే యింత పొయ్యేకాలవే. యిదిగో నువ్వు మరి యేగంగా ఎల్తావా ? ఎల్లవా'' మంచం కోడుకు ఆమె తలకేసి కొట్టాడు. ఆమె నుదురు చిట్లి రక్తం కారుతోంది.

ఆ పిల్లవాడికి నోట మాట రాలేదు. భయంతో గజగజ వొణికిపోతున్నాడు. కన్నతల్లి రక్తం చూ సేసరికి, ఆ పసిప్రాణం విలవిలలాడిపోయింది.

మరోసారి జుత్తుపట్టుకొని బరబర గుమ్మం దగ్గరకు ఈడ్చుతూంటే ఆమె హృదయవిదారకంగా రోదిస్తూవుంటే, భరించలేకపోయిందా పసిప్రాణం.

చిరుతపులి పిల్లలా తండ్రిమీద పడ్డాడు. తండ్రి చేయి మాంసముక్క కనబడినంతగా కరిచాడు, అంతే ! తండ్రి పట్టు వదిలేశాడు. అతని మణికట్టు నుండి రక్తం కారుతోంది. కామినాయుడి కళ్ళు అగ్నిశిఖల్ని కురిపించాయి. ఆ పసి ప్రాణాన్ని తెలివి తప్పినంతగా కసితీరా కొట్టాడు తల్లి మీదపడి వాడిని అదుకోకపోతే అప్పుడే ఆ పసివాడి ప్రాణాలు గాలిలో కలిసిపోయేవి.

ఆ సంఘటననుండీ తండ్రీ కొడుకుల మధ్య బద్ధవైరం ప్రారంభమయింది. లోకానికి మాత్రమే ఆ కుటుంబంలో భార్యాభర్తలు తండ్రీ కొడుకుల సంబంధాలు మాత్రం గమ్మత్తుగా కన్పించేవి.

రోగగ్రస్తురాలైన తల్లికి సరైన తిండిపెట్టక వైద్యం చేయించక, కొడుక్కి సరైన విద్య చెప్పించక, తిండితిప్పలు లేక మాడ్చి చంపటం వీలయితే ఏదైనా తప్పు మోపి చావబాదటం లాంటి పనులు చేయటం ఆ పసివాడి హృదయంలో కథలుగా విన్న ప్రహ్లాద, హిరణ్యకశిపుని కథలు జ్ఞాపకం వచ్చేవి. తండ్రి చేస్తుండే అరాచకపు పనులు, వ్యభిచారం యివన్నీ వాడి మస్తిష్కంలోని మమకల పొరల్ని కోసేసాయి. యింట్లో వుంచడంకన్నా తండ్రి గొడ్ల కాపుకు పంపించేవాడు. ఒకనాడు మందలో ఒక గేదె తప్పిపోతే కొరడాతో తట్లుతేరేటట్లు బాదేసాడు. గొడ్ల సావిట్లోనే పడుకోమని గెంటేసాడు.

పాపం వాడు అక్కడే పడుకున్నాడు. చుట్టూ పేడకంపు. దోమలరొద, వొంటిగాయాలు విపరీతమైన బాధ కలిగిస్తుంటే ఆ కుర్రవాడు ఏడవడానికి కళ్ళల్లో మరి నీళ్ళు లేవు.

అర్ధరాత్రి గాయాలమీద చల్లగా తగిలింది. చూస్తే అతని తల్లి కొబ్బరి చిప్పలో నూనె తెచ్చి, కన్నీరు కారుస్తూ గాయాలకు రాస్తోంది.

"అమ్మా..." అన్నాడు దీనంగా. ఆమె వాడిని గుండెలకు హత్తుకుంది

"ఒరేయ్ బాబూ ! నూపీడ వుండొద్దురా. ఏడకైనా పారిపో. నీ అయ్య నిన్ను మరి బతకనీడు పట్నం పోయి పనో, పాటో సేసుకొని సదువుకొని గొప్పోడివికా..." అంది.

మౌనంగానే ఆమె వొడిలో ఒదిగిపోయాడు.

"అమ్మా ! నువ్వు గూడా రాయే పోదాం" అన్నాడు. ఆ పసివాడికి భార్యా భర్తల సంబంధం తెలియదు. వాడికెంతో నచ్చచెప్పి, రొండినున్న కొన్ని నోట్లు, చిల్లర డబ్బులు తీసిచ్చి కడసారిగా ముద్దుపెట్టుకొని, యింకా చీకటి తెరలు తోయబడకముందే, ఆ యింటినుండి పంపేసింది.

అలా అభం శుభం తెలియని కుర్రవాడు బ్రతుకుతెరువు జీవన ధ్యేయం వెతుక్కుంటూ పట్నం వచ్చాడు. బస్సులు కడిగి, రిక్షాలు, కార్లు తుడిచి, హోటళ్లలో కప్పులు కడిగి రాత్రి మునిసిపాలిటీల లైట్ల కాంతిలో చదువు కున్నాడు. అంత వయస్సులో నూరేళ్ళు పడాల్సిన కష్టాలన్నీ పడ్డాడు

తను గొప్పగా చదువుకోవాలి. తన తల్లికి తిరిగి తను విద్యాధికునిగా కనుపించాలి. తన తల్లిమీద జరిగిన హింసాకాండ యికమీద జరగనివ్వకుండా కాపాడుకోవాలి తనకు జన్మనిచ్చిన తల్లి ఋణం తీర్చుకోవాలి." యివీ అతని మస్తిష్కంలో గాఢమైన ముద్రవేసుకుపోయాయి.

ఆ రోజు చాలా సంవత్సరాల తర్వాత ఆసన్నమయింది. ఆ కుర్రవాడు బియ్యే పరీక్షలు రాసాడు

"అమ్మా! నేను నీ ఆశీర్వాదంవల్ల బాగా చదువుకున్నాను. నీ శృంఖలాలు విడగొట్టే శుభక్షణం ఆసన్నమయింది" అనుకుంటూ మెయిలెక్కి నాలుగువందల మైళ్ళదూరంవున్న తన తల్లిదగ్గరకు ప్రయాణమయ్యాడు.

తన ఊరిలో అడుగుపెట్టేసరికి అతని ప్రాణం లేచివచ్చింది చిన్నపుడు తన గొడ్లను కాస్తూ పిల్లనగ్రోవి ఊదిన స్థలం. ఎండిపోయిన చెరువులు ఇవన్నీ జ్ఞాపకం వచ్చాయి.

తన యిల్లు మారిపోయింది, చిన్న రంగులమేడ ఆ స్థానంలో తయారయింది. చుట్టూ ప్రహరీ గోడ. ఇంటిముందు జనం మూగివున్నారు. ఆతృతగానే వాళ్ళ మధ్యనుండి చోటుచేసుకుంటూ వెళ్ళాడు.

అంతే! నిశ్చేష్టుడైపోయాడు. గొడ్లసాల ముందు, కుక్కిమంచంలో తన తల్లి అంతిమప్రయాణానికి ఆఖరి శ్వాస విడవడానికి ఆయాసపడిపోతోంది. యెదురుగా తండ్రి యింకేం పట్టనట్లుగా నిశ్చింతగా నిల్చున్నాడు, ప్రజలకోసం తప్పనిసరిగా.

"కన్నకొడుకుకోసం కాబోలు నాలుగు రోజులుగా వచ్చే పేనం, పోయే పానం" అని గుంపు మధ్యలో ఎవరో అంటున్న మాటలు అతని చెవిలో పడ్డాయి.

"అమ్మా నే నొచ్చానమ్మా...నీకోసం బాగా చదువుకొని..." అతని కళ్ళమ్మట నీరు దారావాహికంగా స్రవించటం మొదలుపెట్టింది.

ఆమె కళ్ళు తెరిచి చూసింది. జీవితపు అంచుల చివరన నిలబడి, మమతతో ఆప్యాయంగా చూసింది. అదే చివరి చూపు. అతనిలో దుఃఖం స్థానే ఆవేశం చోటుచేసుకుంది.

"నువ్వే నా తల్లిని చంపేసావు బలవంతంగా. నిర్దాక్షిణ్యంగా నేరంలేని శిక్షని నా తల్లికి విధించావు. నీ పాపానికి నిష్కృతిలేదు. నిష్కృతిలేదు..." పిచ్చిగా, అరిచి తండ్రిని పట్టుకొన్నాడు. కామినాయుడి నోట మాట రాలేదు. చచ్చిపోయాడు, 'పీడ విరగడైపోయింది' అనుకొన్న కన్నకొడుకు తిరిగి వచ్చేసరికి పాత సంఘటనలన్నీ గుర్తుకువచ్చాయి.

మధ్యలో జనం కలుగజేసికొని, ఆ తండ్రీ కొడుకుల్ని విడిపించారు.

పది సంవత్సరాలు వాతంతో కాళ్ళు పడిపోయి, సాలలో పశువుకన్నా హీనాతిహీనంగా బ్రతికి, తన అభివృద్ధికోసం, కలలుగన్న తన తల్లి శరీరంలోని ప్రాణం, ఆ కలలు నిజమైన శుభావహ వేళ్ళల్ని చూడకుండానే తనకి కట్టెని మిగిల్చేసి పారిపోయాయి. ఆ కట్టెను కాల్చిన మంటలు, యింకా అతని గుండెల్లోనే మండుతున్నాయి.

* * *

"యింతకీ ఆ కుర్రవా డెవరో కాదు, శారదగారూ. నేనే ఆ కుర్రవాడిని..." అన్నాడు వెక్కి వెక్కి ఏడుస్తూ. రవికి తన తల్లి చావు గుర్తుకు వచ్చింది.

రవి చెపుతున్నంతసేపు ఆ దృశ్యాలన్నీ కళ్ళముందే కదలాడాయి.

"తల్లీ తండ్రీ లేక, చిన్నతనంలో యెవరో తెచ్చి అనాధ శరణాలయంలో బ్రతికిన నాకే మీ కథ యింత బాధను తెప్పిస్తే...అనుభవించిన మీరు... విచారించకండి. మీ తండ్రిగారు పశ్చాత్తాపపడే శుభక్షణం త్వరలో వస్తుంది..." అనునయించింది, శారద.

సాయం సంధ్య చీకటి తెరల్ని సింగారించుకుంటోంది.

"ఆ నీచుడి హృదయంలో పరివర్తన ప్రశ్న లేదండీ. యీ గ్రామానికి, సమాజానికి అతను నెమలి రూపంలోవున్న రాబందు. అతనిమీద పగ సాధిస్తాను. అర్థరాత్రప్పుడు, వాడి గొంతు నులిమి చంపితే పీడ విరగడైపోతుంది. యీ పని యెప్పుడో చేసేవాడిని దీనివలన వాడు ఒక్కసారే చస్తాడు. యే ప్రజల్నయితే అతను నిర్దాక్షిణ్యంగా దోచుకుంటున్నాడో, ఆ ప్రజలే. అతనికి గుణపాఠం చెప్పాలి. ఆ చెప్పిన పాఠం సమాజంలో విశృంఖలంగా విహరించే దోపిడీదారులు, స్వార్థపరులు, స్వార్థంలో సమాజ శ్రేయస్సును కాక్షించనివారి పట్ల గుణపాఠాలుగా మారాలి. ఆ పాఠాలు ముందుతరాలవారికి పఠనీయాంశాలుగా మారాలి. ఆ రోజుకోసం ప్రజల్లో కొత్త ఊపిరి రావాలి. క్రొత్త భావన, ప్రేరణ కలగాలి..." అన్నాడు ఆవేశంగా అంత దుఃఖంలోనూ

"నిజమే. అధ్యయనం ద్వారా జ్ఞానాన్ని సంపాదించగలం. జీవితం అనుభవాల ద్వారా ప్రభావితం అవుతుంది. మెరుపులు, మేఘమాలలు లేకుండానే యింద్రధనుస్సు యెప్పుడూ ఏర్పడదు. చీకటి చీల్చబడాలనే తాపత్రయం వెలుగుకు లేకపోతే, కాంతికిరణాలు ఉదయించటమే జరగదు. క్రమశిక్షణాయుతమైన మీ ఆవేదన వెనుకవున్న అభిలాష జయప్రదం కావాలని నేను ఆకాంక్షిస్తూన్నాను..." అంది శారద.

యిద్దరూ లేచారు. శారద ఇంటివరకూ వచ్చారు, మౌనంగానే. యిద్దరి హృదయాల్లో సంఘటనలు బాగా ముద్రవేసుకుపోయాయి.

"యీవాళ నా కథంతా చెప్పి మిమ్మల్ని విసిగించానేమో..."

"అబ్బే అదేం లేదండి. యివాళ ఒక గొప్ప వ్యక్తిని కలుసుకున్న తృప్తి నాకు జీవితంలో లభించింది" అంది.

"మరి వస్తానండి..." అంటూ రవి శెలవు తీసుకున్నాడు.

చీకటిలో వెడుతున్న రవిని గమనిస్తూ నిట్టూర్పు విడిచి లోపలకు వచ్చి తాళం తీసి లైటు వెలిగించింది.

* * *

మూడు రోజుల తర్వాత గానీ స్కూలు ఒకదారికి రాలేదు స్కూలుకు పది పదిహేను మందికన్నా ఎక్కువ రాలేదు.

వాళ్ళు విరిగిపోయిన బల్లముక్కలు, చీమిడిముక్కులు మురికి గుడ్డలతో అసహ్యంగా వచ్చేవారు. శారద యిచ్చే పిప్పరమెంటు బిళ్ళలకోసం వచ్చేవారు. ఆ

పిల్లలతో చాలా బాధపడేది శారద. అయినా వాళ్ళందర్నీ వొక క్రమశిక్షణలో పెట్టాలని వొక తపన. పట్టుదల వుండేది. పల్లెనుండి గూడా ఒక రిద్దరు పిల్లలు వస్తూవుండేవారు.

ఒకనాడొక ఐదేళ్ళ కుర్రవాడు శారద పాఠాలు చెబుతూంటే దాటకు నిల్చుని దీక్షగా చూస్తున్నాడు. కళ్ళింతలు చేసుకొని, వాడొక చిన్న గోచీ కట్టుకొని వున్నాడు. వాడి వొళ్ళంతా మురికిగా వుంది. ఎంద వాణ్ణి స్నానం చేయిస్తు న్నాది. చెబుతున్న పాఠం ఆపి, వాడివేపు చూసింది. వాడ్ని పిలిచింది. దగ్గరకు వచ్చాడు.

"నీ పేరు..." అడిగింది, వాడి భుజంమీద చెయ్యివేసి వాడు నోరు తెరిచి ఏదో చెప్పబోయాడు. కానీ మాట్లాడలేకపోయాడు.

"ఆడి పేరు కిష్టిగాడు అమ్మగారు. ఆడు మూగోడు" అని పిల్లల్లో ఒకడు చెప్పాడు. వాడిని చూస్తే జాలేసింది. వాడికి తల్లి లేదనీ,డివున్నా తండ్రి పుల్లయ్య యేదో కూలీ, నాలీ చేసుకొని బ్రతుకుతాడని వివరాలు పిల్లలద్వారా సేకరించింది.

"నువ్వు చదువుకుంటావా ?" ఆప్యాయంగా అడిగింది. వాడు ఉత్సాహంగా తల ఊపాడు. వాడిని పట్నంలో వుండే ప్రత్యేకమైన పాఠశాలకు పంపాలనే ఉద్దేశ్యం ఆమెలో కలిగింది. ముందు వాడి తండ్రిని ఒప్పించాలికదా ? అనుకుంది.

"అయితే కూర్చో..." అని సౌంజ్ఞ చేసింది.

వాడు వెళ్ళి మాలపేట నుండి వచ్చిన పిల్లల దగ్గర కూర్చున్నాడు. వాళ్ళు వేరేగా కూర్చున్నారు. వీళ్ళు వేరేగా కూర్చున్నారు. మూడో రోజునే ఈ సమస్య ఎదురయింది.

"మేం ఆ పల్లెనుండి వచ్చిన పిల్లలతో కూర్చోం" అన్నారు పిల్లలు.

శారదకు చాలా కోపం వచ్చింది. కానీ తమాయించుకొంది వాళ్ళని అనాల్సిన పనిలేదు. అలాంటి విషబీజాల్ని, వాళ్ళ బుర్రల్లో నాటిన వాళ్ల తల్లిదండ్రులననాలి. దండనతో పరిష్కరించే సమస్య కాదు. నిదానంగా సరిచెయ్యాలి. అందరూ ఒకటేనని వాళ్ళ మనస్సులో మంచి ఆలోచనలు ప్రసరింపజేయాలి అనుకుంది ఆనాడు. కిష్టయ్యవేపు చూసింది. వాడు నేలమీద చూపుడువేలుతో ఏదో గీస్తున్నాడు. ప్రక్కవాడి పలక యిచ్చి, బలపం ఇచ్చి, 'ఓ' అన్న అక్షరం రాసి వాడికిచ్చింది దిద్దమని. వాడు శ్రద్ధగా దిద్దటం మొదలుపెట్టాడు. వాడిని చూస్తూ అలాగే వుండిపోయింది.

యింతలో బడి గంట విన్పించింది. లచ్చి కొడుతోంది.

"అప్పుడే టయిమయిందా ?" ఆశ్చర్యంగానే అడిగింది.

"అవునమ్మగారూ. బళ్లోకొస్తే సరి మీకు బయట పెపంచమే గ్నాపకం వుండదు" అంది నవ్వి. అది నున్నగా తల దువ్వుకుంది

"అవునే. నాకు బడి ఒక పవిత్రదేవాలయములా కనబడుతుందే. అక్కడే నా ధ్యేయం, నా జీవిత లక్ష్యం. యివన్నిటిని సఫలంచేసే దేవతలు బాలల రూపంలో వున్నారే" అంది చిరునవ్వుతో.

ఒంటిపూట బడేమో, మధ్యాహ్నం కాస్సేపు వున్నవారి మాలపల్లి చదివించి, తను వచ్చేటప్పుడు కొన్ని పుస్తకాలు తెచ్చుకుంది. లచ్చి గుమ్మంలో కూర్చుని, యింగ్లీషు అక్షరాలు దిద్దుతోంది. శారదకు రవి జ్ఞాపకం వచ్చాడు. మూడు రోజులుగా అతను కనబడటంలేదు ఆ మాటే లచ్చితో అంది. అక్షరాలు దిద్దటం ఆపి, లచ్చి శారదవేపు చూసింది

"ఆ బాబు బావికాడ వుండి తవ్విస్తున్నాడమ్మా..." అంది

"ఒకసారి వెళ్దామే..." అంటూ లేచింది.

లచ్చికి గూడా యిష్టమే. కోటీశు గూడా అక్కడే వుంటాడు. ఎండ తీక్షణత తగ్గింది. అక్కడికి వెళ్ళేసరికి ముందు రవే కనబడ్డాడు. మరో నలుగురు పనివాళ్ళూ తనూ కలిసి తవ్వుతున్నారు. అతని తెల్లని శరీరం, విశాలమైన వక్షస్థలం, బలమైన కండరాలు, చెమటతో తడిసి అరుణిమను దిద్దుకుంటున్నాయి, వాలువారుతున్న ఎండలో.

"యిదేమిటి ఇలా వచ్చారు ?..." అన్నాడు పని ఆపి.

"ఏంలేదు. నూతి పని ఎంతవరకు వచ్చిందో చూతామని..." చిరుగాలికి శారద పైట ఎగురుతోంది. అప్పుడే లచ్చి కోటీశు దగ్గరికి చేరిపోయింది వాడేదో అంటే విరగబడి నవ్వుతోంది.

"భూమిని నీ కిమ్మని, మమ్మల్ని భగీరథుల్ని చెయ్యవద్దని ప్రార్థిస్తూ తవ్వుతున్నాం..." అన్నాడు. రవి చేతినిండా మట్టి వుంది. అది దులుపుకున్నాడు.

"యిప్పటికి బదడుగులకు పైగా తవ్వాం. యింకా తవ్వాలి" అన్నాడు గంభీరంగా మళ్ళా.

"నమస్కారం పంతులమ్మగోరూ ... యిందండి యీ తాటిముంజెలు తినండి..." అంటూ తాటాకుల దొప్పలో యిచ్చాడు కోటీశు. అవి దబనుకు పైగానే వుంటాయి...శారద తటపటాయించింది.

"తినండమ్మా తియ్యగా వుంటాయి..." అంది లచ్చి, వాడివంక ఓరగా చూస్తూ. వాడి గుండెలకు యెఱ్ఱగా కుంకుమ అంటుకుంది. లచ్చి బొట్టు చెదిరి వుంది.

"మరి మీరో..." అంది శారద రవివేపు చూస్తూ.

రవి చేతులు కడుక్కొని వచ్చాడు. నలుగురూ చెట్టునీడన కూర్చున్నారు.

"బడిలో పిల్లలు యింకా యెక్కువమంది చేరలేదటగా..." అన్నాడు ముంజె తింటూనే

"అవునండి. ఏంచేయాలో తోచటంలేదు. వాళ్ళకి మధ్యాహ్న భోజనం, పాలు వీటి గురించి రాసాను స్కూలు పెట్టినది మొదలు యివన్నీ ప్రెసిడెంటు గారింటికి చేరవేయబడేవట. మరి పదిహేను రోజులలో సంఖ్య ఎక్కువ కావచ్చని నా ఆశాభావం..." అంది ఆమె ముంజెలు వొలిచి, అతని చేతిలో వేస్తూ.

"యింక చాలు. మరి మీరు తినండి..." అన్నాడు అభిమానంగా.

"బాబూ మరి మాకు సదువు సెబుతానన్నారు..." అడిగాడు కోటిగు.

"ఏట్రా. నీ పెళ్ళాం చదువుకుంటోందని యీర్ష్యగా వుందా..." అడిగాడు నవ్వుతూ రవి.

"ఆడికి సదువు రాదు బాబూ. మొద్దు మనిషి..." అంది లచ్చి వెక్కిరిస్తూ.

"నేను కాదే మొద్దు మనిషిని. మీ యన్నయ్యేనే నా లోజుల్లో సూసుకోయే ఎ. బి. సి. డి. టప్ మనిపించేత్తాను..." అన్నాడు ఉడుకుమోత్తనంగా కోటిగు, లచ్చిని వెక్కిరిస్తూ. శారద, రవి నవ్వారు.

"మనం యింతకీ రాత్రిపాఠశాల యెప్పుడు తెరుద్దామంటారు ?" అన్నాడు రవి.

"మీ యిష్టమే..." అంది నేలచూపులతో.

"మా స్కూల్లోనే పెడతావా బాబూ ! మీ బడి .." అంది లచ్చి.

"అదే ఆలోచిస్తున్నాను. స్కూల్లో కుదరదు. ఏమైనా గొడవొస్తుంది..." అన్నాడు సాలోచనగా

"యెందుకు వస్తుంది. నేను డి.యి వో. గారి పెర్మిషను రాసి తెప్పిస్తాను..." అంది శారద కొంచెం కోపంగా.

"అలాగే చేయండి. కానీ యీలోగా చెరువుగట్టుమీద శివాలయంలో చెబుదాం...." అన్నాడు శారదను చూస్తూ. అందరికి ఈ సలహా నచ్చింది.

* * *

ఆ రోజు ఆదివారం. శారద యింకా నిద్రనుండి లేవలేదు. తెలివి వచ్చినా, వొళ్ళంతా బద్దకంగా వుంది. ముందురోజే పట్నం వెళ్ళి తనకి రావల్సిన జీతం బ్యాంకులో మార్చుకొని వచ్చింది అధికారులతో స్కూలు స్థితిగతులు మాట్లాడి వచ్చింది అన్నివిధాల తగినంత సహాయం చేస్తామని వాళ్ళు హామీ యిచ్చారు పిల్లల మధ్యాహ్న భోజనాలకు కావల్సిన నూక బస్తా, పాలడబ్బాలు, నూనెడబ్బాలు సమితి ఆఫీసునుండి తీసుకుంది. రాత్రి పాఠశాలకు కావల్సిన లాంతర్లూ, చాపలు, పలకలు, బలపాలు కొంది. కిష్టయ్యకు రెడీమేడ్ షాపులో రెండుజతల బట్టలు కొంది. యివన్నీ తీసుకొని వచ్చేసరికి సాయంకాలం మైపోయింది.

సూర్య కిరణాలు, గడపముందు నేలకి బంగారం రంగు పూస్తున్నాయి

"యింకా లచ్చి రాలేదు కిష్టయ్య రాలేదు." అని మనస్సులో అనుకొంది, బద్దకంగా వొళ్ళు విరుచుకుని ముఖం కడుక్కుంటూ. ఆమె మనస్సు తవిని చూడాలని, తను తెచ్చినవి అందజేయాలని తహతహలాడుతోంది

"పంతులమ్మగోరు దండాలండీ ..." కొత్తగా బొంగురు గొంతుక వినిపించింది. ఆశ్చర్యంగా గుమ్మంకేసి చూసింది

"నా పేరు బంగారయ్య అంటారండి. నా కొడుకు గున్నయ్య మీ బళ్లోనే సదువుతున్నాడండి..." అన్నాడు వినయంగా.

బంగారయ్య నల్లగా వున్నాడు. మోకాలు దిగని తెల్లపంచె కట్టుకున్నాడు. యెందుకు వచ్చాడో అర్థంకాలేదు. అదే అడిగింది అతనిని.

"యేంలేదండి, నేనో సిన్న యాపారస్తుడనండీ. అందుకోసం తమరితో మాట్లాడదామని వచ్చానండి. పెసిడెంటుగోరు తమర్ని కలవమన్నారండి..." అన్నాడు వినయంగా, కొంచెం రహస్యంగా.

"యేమిటో చెప్పండి..." అంది.

"యేం లేదండి...నూక...పాలడబ్బాలు...నూనెడబ్బాలు మీ దగ్గర తీసుకోమన్నారండి...తమరిదగ్గర ఈ డబ్బు వుంచమన్నారండి. ఆయనొచ్చి తరువాత మాట్లాడతానన్నారండి...." అన్నాడు రొంటినుండి నోట్లు తీస్తూ.

శారదకు కోపం వచ్చింది.

"శెట్టిగారూ! యిది స్కూలు పిల్లలకు పెట్టాల్సిన ఆహారం...వాళ్ళ నోటి ముందు కూడు తీసుకోవడం మీకు అన్యాయం అనిపించలేదా..."

నవ్వాడు బంగారయ్య.




"అలాగనకండి, పంతులమ్మగారూ. యిది యాపారం. యిదివరకు యిక్కడ పనిచేసిన టీచర్లందరి దగ్గరా యిలా డబ్బిచ్చి తీసుకోవటం మామూలే. మిగతా లావాదేవీలు, ప్రెసిడెంటుగారూ వాళ్ళు చూసుకునేవారు..." అన్నాడు.

"పాతవాళ్ళ సంగతి నాకు తెలియదుగానీ నేను మాత్రం అలా చెయ్యను... దయవుంచి వెళ్ళండి..." అంది రోషంగా.

శెట్టి కదలలేదు.

"మీకు కిట్టకపోతే మరో వందో, యాభయ్యో యెక్కువ తీసుకోండి..." అన్నాడు మరికొంచం డబ్బుతీసి లెఖ్ఖపెడుతూ.

"శెట్టిగారూ..." గర్జించింది శారద. శెట్టి వులిక్కిపడ్డాడు అకు గూడా లొంగలేదు.

"అయితే మీరిలాగన్న సంగతి ప్రెసిడెంటుగారితో చెప్పాల్సి వస్తుంది. ఆయనగోరు అయిద్రాబాదు వెళ్ళారు. లేకపోతే యీ పొద్దే తేలిపోయేది." అన్నాడు కొంచెం డాంబికంగా, ఆఖరి అస్త్రానికేనా జడుస్తుందేమోనని.

"తప్పకుండా చెప్పండి. నేనూ ఆయన్తో చెప్తాను..." అంది కోపంగా.

నిరాశగా చూస్తూ వెళ్ళిపోయాడు శెట్టి.

"యేటండమ్మగారూ, పొద్దుటేల ఈ ముదనష్టపోడు వచ్చాడు" అంది పాలు తెస్తూ లచ్చి.

"యేం లేదులే ముందు తొందరగా కాఫీ పెట్టు..." అంది జడవిప్పుకుంటూ. అదే సమయంలో రవి రావటం కనిపించింది.

"యేమిటి బంగారయ్య మొదటి అతిథి నేను రెండోవాడినా..." అన్నాడు నవ్వుతూ.

"వాడు అతిథి కాడు. అహారాన్ని తన్నుకుపోదామని వచ్చిన గెద్ద" అంటూ శారద జరిగిన సంగతి చెప్పింది. "అప్పిచ్చువాడు వైద్యుడు...అంటూ వూరికే చెప్పలేదు." సుమతీ శతకారుడు. యిప్పటికాలంలో వీళ్ళు నరమాంస భక్షకులు. స్వార్థం పేరుకుపోయిన కాలాంతకులు..." అన్నాడు ఆమెవేపు చూస్తూ.

"మీకో గుడ్‌న్యూస్..." అంది నిడువైన శిరోజాల్ని ముడివేసుకుంటూ. గాలికి ఒకటి రెండు పాయలు ఆమె నుదుటిమీద కదలాడుతున్నాయి.

"చెప్పండి" అన్నాడు వుత్సాహంగా.

"రాత్రి పాఠశాల తెరవడానికి లాంతర్లూ, పలకలు, బలపాలు కొన్నాను. స్కూళ్లో వయోజన విద్యాశాల గురించి అధికార్లకు వివరించాను. వాళ్ళు తొందర్లో పరిశీలిస్తా మన్నారు" అంది.

"చాలా సంతోషమండి, నా ఆశయంలో మీరు భాగం పంచుకొని శ్రమిస్తున్నందుకు," అన్నాడు కృతజ్ఞతాపూర్వకంగా.

"మరయితే యెప్పుడు ప్రారంభిద్దాం..." అంది వుత్సాహంగా.

"జలస్యం, అమృతం, విషం. ఈ రోజే ప్రారంభిద్దాం. శివాలయం అరుగు మీద..." అన్నాడు లేవబోతూ.

"కొంచెం ఆగండి. కాఫీ తెస్తాను" అంది.

"నానే తెస్తాను అమ్మగారు..." అంటూ రెండు గ్లాసులతో కాఫీ తెచ్చి యిచ్చింది లచ్చి. శారద రవికి గ్లాసు అందించింది. లచ్చి చుట్టూచూస్తోంది.

"యింకా మీ కోటీశుమావ రాలేదే. పల్లె వెళ్ళి, వాళ్ళను కేకేసి రమ్మనమని పంపానే. యీపాటికి వచ్చేస్తుండాలి," అన్నాడు కాఫీ సిప్‌చేస్తూ. లచ్చి సిగ్గుతో మెలికలు తిరిగిపోయింది.

"పంచదార సరిపోయిందా..." అడిగింది శారద.

"చాలా యెక్కువే వేసింది లచ్చి..." అన్నాడు. ఆమె కళ్ళలోకి చూస్తూ యింతలో కోటీశు వచ్చాడు. వాడు నల్లగా, సన్నగా, బలమైన కండరాలతో యేపుగా వుంటాడు. వాడిది కాయ శరీరం. వాడి భుజంమీద గునపం, దానికి ఇనప పార వ్రేలాడుతోంది వాడ్ని చూడగానే లచ్చి ముఖం వికసించింది.

"బాబూ పల్లెలో మనసుల్ని పంపి, నాను యిట్టా వచ్చాను..." అన్నాడు. నిల్చునే. వాడి నీడ నిటారుగా నేలమీద కదలాడింది.

"లచ్చీ! మీ మావగ్గూర కాఫీ..." అంది శారద.

"నా కొద్దమ్మగారు. నాను సల్లంది తినేసినా. యేటే లచ్చీ ఈ పొద్దు సన్‌దేనా..."

"ఓలమ్మో! నువ్వుగూడా ఎంగిలిపీసు నేర్చేసుకుంటున్నావన్న మాట..." కళ్ళింతలు చేసుకొని గుండెలమీద చెయ్యి వేసుకుంది.

"మరేటనుకున్నావ్! నువ్వు అమ్మగోరి కాదయితే, నాను అయ్యగోరికాద... నావేటి నీకన్నా తక్కువోడినా" అన్నాడు గర్వంగా తల యెగరేస్తూ. వాడి నల్లని రింగుల జుత్తు గాలిలో యెగిరింది.

"యికమీదట మీరిద్దరూ విడివిడిగా చదువుకోకుండా కలిసి చదువుకునే యేర్పాటు, ఈ సాయంకాలం నుండీ జరుగుతుంది" అన్నాడు రవి. ఆశ్చర్యంగా చూశాడు కోటీశు

"అవున్రా ! రాత్రి పాఠశాల ప్రారంభిస్తున్నాం, మనవూళ్లో మీలాంటి యువజనులకు, వయసు మళ్ళినవాళ్ళకు..." అన్నాడు నవ్వుతూ

"అప్పుడు మీకు పెళ్ళయినతర్వాత మరి తెలుగు మానేసి మీరు ఎంగిలిపీసు లోనే మాట్లాడుకుంటూ సుఖజీవనం చేయండి..." అంది శారద కోటీశు సిగ్గుపడిపోయి లచ్చివంక చూశాడు, అడుగు ముందుకు వేస్తూ.

"లచ్చీ! వొకసారి రవిగారింటికి వెళ్దామే. యివాళ ఆదివారం కదా..." అంది, వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత.

"పెసిడెంటు గోరింటికా..." ఆశ్చర్యంగా అడిగింది లచ్చి

"కాదే రవిబాబుగారింటికి..." అంది.

"చినబాబుకు యిల్లు లేదమ్మగారూ..."

అప్రతిభురాలైంది.

"అవునమ్మగోరూ! ఆ బాబు వొంటరోడు. తండ్రితో తగవులాడి బయట కొచ్చేసినాడు. మా మావ గుడిసెలో వుంటున్నాడు. ఉన్నా కొంతమంది కష్టాలు పడతారు అలాంటోళ్ళలో రవిబాబొకడమ్మా" అంది బాధగా, మరేం మాట్లాడలేకపోయింది. బాధగానే కళ్ళు మూసుకుంది. యెందుకో జీవితం, చిత్ర విచిత్రమైన మలుపులు తిరుగుతుంది అనుకుంది. కళ్ళు తెరిచేసరికి యెదురుగా కిష్టిగాడు వాడు యిప్పుడు పూర్వంలా లేడు. కొంచెం శుభ్రంగా వున్నాడు. వాడి చేతిలో బాదమాకు, అందులో ఎర్రటి పట్టులా యెండకుమెరిసే ముద్ద మందారం పువ్వులు వున్నాయి. రోజూ అలా అలవాటే వాడికి తేవటం

మొదట్లో వాడు గుమ్మానికి పదిగజాల దూరంలో యెండలో నిలబడి పువ్వులు పట్టుకొని వుండేవాడు. తను అంటరానివాడని, అందుకని దూరంగా వుండాలని భయం. విత్తనం, వాడిలో బలవంతంగా పాతిపెట్టారు. వాడిలో ఆ భయం పోగొట్టింది శారద. యిప్పుడు చనువుగా శారద యింట్లోకి వస్తున్నాడు.

వాడ్ని యింట్లోకి తీసికెళ్ళి పెట్టె తెరచి ఒక జత బట్టలు కట్టబెట్టింది. తల దువ్వింది యెంతో చక్కగా వున్నాడు. వాడు ఆనదంతో ఉక్కిరిబిక్కిరి అయిపోయాడు. అప్రయత్నంగానే శారద కాళ్ళకు నమస్కారం పెట్టాడు. ఆనందంతో వాడి కళ్ళలో నీళ్ళు చిమ్మాయి. తనెక్కడ పుట్టిందో తెలియదు. కానీ వాడికీ, తనకీ ఈ మమతానుబంధం, ఆశ్చర్యం వేసింది శారదకు. మిగిలిన జత వాడి చేతిలో పెట్టింది. వాడు ఆనందంతో గంతులువేస్తూ మాలపల్లెకు పరుగులు తీసాడు, వాళ్ళ నాన్నతో చెబుదామని.

"యిప్పుడాడ్ని పోలిక పట్టలేమమ్మగోరూ...అంత సక్కగా నున్నాడు. ఆడికే తెచ్చారు. మరి నాకేం తేలేదు." అంది బుంగమూతిపెట్టి.

"నీకు తెచ్చానులే రవికగుడ్డ. ఊరికే అసూయపడకే." అంది తువ్వాలు భుజంమీద వేసుకొని.

"చాలా దేంక్సండి..."

"దేంక్సు కాదు థేంక్సు...థేంక్సు... అనాలి మరి" అంది శారద, స్నానానికి దారితీస్తూ.

సాయంకాలమైంది. లచ్చి యెంతో వుత్సాహంగా లాంతరు, చాపలు, పలకలు, పుస్తకాలు శివాలయం దగ్గరకు తీసికెళ్ళటం, ఊళ్ళో కొంతమంది వింతగా చూసారు.

ప్రకృతి చీకటి చీర సింగారించింది. పరచిన చాపల మీద ఎనిమిదిమంది కన్నా ఎక్కువలేరు. చలని గాలి వీస్తోంది. తమస్సును చీలుస్తామని బెదిరిస్తూ చిరుదీపాలు, చిరుగాలికి చైతన్యం పుంజుకుంటున్నాయి.

శారద, రవి యిద్దరూ చాలా ఉత్సాహంగా వున్నారు. శివాలయం దగ్గరయేదో వింత జరుగుతుందని కొంత జనం గుమిగూడారు, వింతగాచూస్తూ. కూర్చున్న వాళ్ళకి పలకలు బలపాలు పంచారు.

"సోదర సోదరీమణులారా! యివాళనుండి యిక్కడ రాత్రిబడి ప్రారంభించాం. యీ వయస్సులో చదువు ఏమిటని అంటారేమో! యేదైనా చెప్పవలసి వస్తుంది అప్పుడు మాట్లాడాలికదా! యేదైనా చెప్పడం యెందుకు? యింకొకరు

తెలిసికోడానికి. మనకు తెలియనివి చాలావున్నాయి. తెలియనివి తెలుసుకోవడం చదువు. చదువు అంటే తెలిసికోవటం. ఈ తెలిసికోవటం, మూడు రకాలు విని తెలిసికోవటం, చూసి తెలిసికోవటం, చదివి తెలిసికోవటం. చీకటిదారిలో మనం లైటు లేకుండా యెలా నడవడం కష్టమో, చదువు లేకుండా జీవితం సాగించటం అంతే కష్టం. కొంతయినా చదువుకోవటం అవసరం. ఆదర్శభావాలు గల శారదగారు యీ వూరు టీచరుగా రావటం ఈ వూరు యెంతో పూర్వపుణ్యం చేసుకుంది. మీరంతా శ్రద్ధగా చదువుకుంటారని ఆశిస్తున్నాను" అన్నాడు. అందరూ చప్పట్లు కొట్టారు.

శారద పలకలమీద ఓనమాలు రాసింది. పాపం వాళ్ళకి బలపం పట్టుకోవటమే రాదు. అందులో కొందరు యువకులూ, వయస్సు మళ్ళినవాళ్ళూ వున్నారు. లచ్చిగూడా వుంది. దానికి అక్షరాలు వచ్చు. కోటీశు ఓర్పుగా దిద్దటం ప్రారంభించాడు. లచ్చి మధ్య మధ్యలో వాడ్ని చూస్తోంది. వాడు దొంగచూపులు చూస్తున్నాడు. యెప్పుడు విడిచిపెడేస్తారా అన్నంత బద్ధకంగా దిద్దుతున్నారు. మొక్కనాడు వంగంది మ్రానైన తర్వాత వంగుతుందా?''

ఒక గంటయిన తర్వాత వాళ్ళ అవస్థ చూడలేక శారద,"మళ్ళా రేపు యిదే సమయానికి." హెచ్చరించి, థాంకర్లు యిచ్చి, విడిచిపెట్టింది. లచ్చి మిగిలిన చాపలు, పలకలు పట్టుకుని దాచడానికి వెళ్ళుతూంటే కోటీశుగూడా ఆమెను అనుసరించాడు.

శారద, రవి యిద్దరిమధ్యా దీపం మిగిలిపోయింది.

"ఈ రాత్రిపాఠశాల మీచేత తెరిపించి, మీకు శ్రమ యిస్తున్నానేమో, క్షమించండి..." అన్నాడు.

''శ్రమ యేముందండీ మీ పవిత్ర ఆశయానికి తోడ్పడగలిగే అవకాశం నాకు కలిగిందని యెంతో సంతోషపడుతున్నాను..." అంది.

"యిది నా ఆశయమా, నా స్వార్థమా...అని వొక్కొక్కసారి అనుమానం కలుగుతోంది.'' అన్నాడు నవ్వి.

"యిది మీ స్వార్థం కాదు అయితే పరిణామాలు యింకోలా వుండేవి దోపిడి వ్యవస్థని, పెత్తందారీ తనానికి బలైపోతున్న ప్రజల్లో చైతన్యం తేవడానికి ప్రయత్నం..." అంది ప్రశంసాపూర్వకంగా.

"ఈ ప్రజల్లో కావల్సింది ఆలోచన వొక్కటే కాదు. తమపై యెంత అన్యాయం జరుగుతున్నా భయంతో యేం మాట్లాడలేదు. వీళ్ళకి ధైర్యంగూడా

యెక్కించాలి. నూటికి తొంభై మందిలో తరతరాలనుండి వాళ్ళ నరనరాలలో జీర్ణించుకుపోయింది."

"అవును నిజమే మీరన్నది..." అంది సాలోచనగా. రవి శారదను యింటి వద్ద దిగబెట్టి వెళ్ళిపోయాడు.

మర్నాడుదయంకల్లా వూర్లో పాకిపోయింది. రాత్రి పాఠశాల వార్త సాంబడు మండిపోయాడు.

"యిప్పుడు మీకా సదువులేట్రా, నువ్వేటి కలకటేరు పనిసేస్తావా? గవరనేరు పనిచేస్తావా?" అన్నాడు. అక్కడ వొకరిద్దరు చదువుకున్న వాళ్ళని కసిరాడు. వాడి దగ్గర యిప్పుడు బోలెడన్ని ఫిర్యాదులు, కబుర్లూ వున్నాయి, రైసుమిల్లు లైసెన్సు, మిషనరీ కొనుగోలుకు వెళ్ళిన కామినాయుడికి తెలియజేయడానికి. ఆ చదువేమిటో, ఐడేమిటో చూద్దామని అనుకున్నారు, చాలామంది.

ఆ రోజు జనం చాలామంది వచ్చారు. అందరూ చాపలమీద అక్కడక్కడ విరిగిపోయిన రాళ్ళమీద, స్తంభాలమీద కూర్చున్నారు. శారద వెంటనే పాఠాలు ప్రారంభించలేదు. తన శ్రావ్యమైన గొంతుకతో రామాయణంలోని పద్యాలు చదివింది. తర్వాత అర్థం చెప్పింది. రామాయణ కథను అంతకు ముసుపు చాలా మార్లు విన్నారు. ఆమె చెప్పినంత కమ్మగా, తియ్యగా యెవ్వరూ చెప్పలేదు. దశరథుడు విశ్వామిత్రునితో రాముడ్ని యజ్ఞపరిరక్షణకు పంపటం వరకూ చెప్పింది. ఆమె చెబుతూంటే రామాయణం తెరమీద సినిమా చూస్తున్నంతబాగా వుంది. మరి కొంచెం చెప్పమన్నారు.

"రేపు సీతాకల్యాణం చెపుతాను. యింక మనం చదువులోకి వద్దాం," అంటూ అక్షరాలు దిద్దించటం ప్రారంభించింది.

గతరోజు బిద్దకంగా వున్న వాళ్ళంతయూ ఉత్సాహంగా దిద్దటం ప్రారంభించారు. ప్రేక్షకులలో కొంతమంది తాముగూడా చదువుతామని ముందుకు వచ్చారు. మిగిలిన పలకలు పంచేసింది యింకా కావల్సి వచ్చాయి.

తన గ్రామప్రజలలో ఇంత చైతన్యం రావటంచూసి ఆశ్చర్యపోయాడు రవి. అంతవరకూ మంత్రముగ్ధుడిలా కూర్చుని, ఆమె కమ్మని పద్యాలు విన్నాడు.

"యేమండీ మరికొన్ని పలకలు కావాలి, రేపు తెప్పించండి," అంది అందరూ వెళ్ళిపోయిన తర్వాత. ప్రతిరోజూ కలుసుకోవడానికి, లచ్చికి, కోటీశుకు పాఠశాల కేంద్రమై పోయింది. వాళ్ళిద్దరు చాపలు శారద యింటికి చేరవేయడానికి వెళ్ళిపోయారు.

"యివాళ నా జన్మ ధన్యమైపోయింది," అన్నాడు ప్రశంసాపూర్వకంగా ఆమెను చూస్తూ.

"యేదో శరణాలయంలో కొద్దిగా నేర్చుకున్నాను," అంది సిగ్గుతో. ఆమె చేతిలో రామాయణం వుంది. దాని పక్కన బెట్టి "నిన్న మీరు చెప్పిన తరువాత కొంచెం ఆలోచించాను. మంచీ, చెడ్డ, రెడింటికి మధ్య సంఘర్షణే మానవ చరిత్రకు పవిత్ర విలువలను, రసాత్మకంగా విజ్ఞాప్రదంగా అందించే ఆదికావ్యం పునాది. భారతీయుల రామాయణం సభ్యతా మర్యాదల్ని సంతరించుకున్న అన్ని ప్రపంచ భాషల్లోకి అనువదింపబడిన అపురూప గ్రంథం. వాల్మీకి సంస్కృతంలో రచించినా, భారతీయ భాషలన్నీ అందులోని యితివృత్తాన్ని సొంతం చేసుకున్నాయి. తమతమ సమాజ జీవనానికి అభిరుచులకు విశ్వాసాలకు అనుగుణంగా మార్పులూ, చేర్పులూ చేసుకున్నాయి. భారతీయ సాహిత్య శాస్త్రానికి, సాంప్రదాయాలకు భౌగోళిక సౌందర్యానికి, భారతీయుల విజ్ఞాన సంపత్తికి దర్పణం రామాయణం. అప్పటికీ, యిప్పటికీ ప్రజా జీవితంలో రాముడు ఆదర్శమూర్తి. వాడి మాట 'రామబాణం' లాంటిదిరా అని లోకోక్తి గూడా మనం వింటాం. భరతుడు, లక్ష్మణుడు, సీత, అంజనేయుడు, గుహుడు, శబరి, విభీషణుడు లాంటి పాత్రలు గ్రామీణ జీవన పరిధిలో మనకు యెన్నో కన్పిస్తాయి. ధర్మం మీద, అన్యాయం, అధర్మం; దురాశా, వ్యామోహం యివన్నీ చేసే హింసా కాండ వీటన్నిటినీ ధర్మం యెలా గెలిచిందో యివన్నిటినీ ప్రతిబింబించింది రామాయణం.

అందువలన స్తబ్దమైన వాళ్ల ఆలోచనా విధానాన్ని రామాయణంలో వుండే సారం జాగృతంచేసి, మౌలికమైన మార్పు యేమైనా తేగలనన్న ఆశ నాకుంది. అందువలన చదువుతో బాటు, రామాయణ కథను కూడా ప్రజలకు వినిపిస్తున్నాను..." అంది రవి వేపు చూస్తూ.

యెక్కడ బలహీనత వుందో కనిపెట్టగలిగిన శారద ఆలోచనా ధోరణికి ముగ్ధుడైపోయాడు, రవి. సమాజ వ్యవస్థలో అభిలషణీయమైన మార్పు తేవడానికి యెంతో దూరాలోచనతో కూడుకున్న శాస్త్రీయపరమైన సిద్ధాంతం, యివన్నీ తన యువకరక్తం, ఆలోచించలేదు. హింస వలన, యెదిరింపు వలన వచ్చే మార్పు కన్నా ప్రజల మానసిక ఆలోచనా విధానంలో మార్పు వచ్చినపుడు యెంతటి నియంతయినా భీరువై పరాజితుడవుతాడు. తనకన్నా హిమాలయ శిఖరాలంత యెత్తుకు యెదిగిపోయిన శారదను ప్రశంసా పూర్వకంగా అభినందించాడు మళ్ళా. శారద సిగ్గుతో తల వాల్చుకుంది.

యిద్దరూ కలిసి శారద యింటిదగ్గరకు వచ్చేసరికి కిష్టిగాడు శ్రద్ధగా అక్షరాలు దిద్దుతున్నాడు, లాంతరు ముందు కూర్చుని. రవిని చూసి వాడు లేచి దండం పెట్టాడు. యెవరని అడిగాడు రవి.

"వీడా! వీడు కిష్టయ్య? కాస్సేపు చదువుకొని వెళ్ళిపోతాడు" అంటూ వాడి కథ చెప్పింది.

అదే సమయంలో, లచ్చి గుడిసెలో అడుగు పెట్టింది హుషారుగా. పల్లె పదం కూనిరాగం తీస్తూ. దాని మనస్సు లేడిపిల్లలా గెంతులు వేస్తోంది. దాని మనసు గుండె నిండా కోటిశు చతురోక్తులు, రూపం ఆక్రమించింది.

"యేటే ఈ పొద్దింతాలీసెమైపోనాది సెల్లీ..." అన్నాడు సాంబడు. వాడు కొంచం తాగి వున్నాడు. మంచంమీద పడుకున్నాడు. గోడమీద క్రోడిగడ్డు దీపం మినుకుమినుకుమంటూ వెలుగుతోంది.

"యేట్నేదురా. ఈ పొద్దు పంతులమ్మగోరు రాముడికథ సెప్పినారు.

"సదువులయిపోయి, యింక పంతులమ్మ కథల్లోకి దిగారన్నమాట" అన్నాడు నవ్వి.

"ఊరుకో యేటా మాటలు. ఆయమ్మ యెంతో మంచిది. యెదవ త్రాగుడొగ్గి మంటే వొగ్గివు. నీ కిదో మాయరోగం. సర్లే కూడెట్టనా" అంటూ కంచుగిన్నె మంచం దగ్గరికి తీసుకువచ్చింది. నోరు నీటితో పుక్కిలించి కాళ్ళు చేతులు కడుక్కొని కూర్చున్నాడు సాంబడు.

"ఆ యెదవ గూడా సదువుకుంటున్నాడా?" అన్నాడు చేపల యిగురు అన్నంలో వేసుకుంటూ. ఆ యెదవ యెవరో లచ్చికి తెలుసు. వాడు కోటిశు వరసకు మేనత్త మేనమామ బిడ్డలయినా యిద్దరికీ చుక్కెదురు

"యేటే మాట్లాడవ్. నీకే అడుగుతున్నా..." అన్నాడు కొంచెం కోపంగా. లచ్చివాడూ కలిసి తిరగటం వొకసారి వాడి కంటబడింది.

"పత నా...." అంది నెమ్మదిగా లచ్చి. మతుతో సాంబడి కళ్ళు తూగుతున్నాయి.

"ఆ దొంగ నాకొడుకు మంచోడు కాదు. నిన్నేమంటే సెప్పు, మక్కలిరగ దన్నేస్తాను," అన్నాడు కొంచెం కోపంగా.

"నా కేటంటాడు నా నూరుకుంటానేటి" అంది కోపం నటిస్తూ.

"అద్గదీ, వుప్పుడు నువ్వు సాంబగాడి సెల్లెలనిపించినావు. పొన్నూరులో నీకో మనవు సూస్తున్నానే. యిదిగో పెసిడెంటుగారు అయిదరాబాదునుండి రాగానే

సెప్పేసి, పంతుల్నడిగి లగ్గం జరిపించేస్తానే. నువ్వో యింటిదానివైతే నాకంతే సాలు నాకంతే సాలు." అని గొణుక్కుని నిద్రలోకి జారుకున్నాడు.

ప్రేమగా అన్నవేపు చూసి గిన్నెలు సర్దటం ప్రారంభించింది

* * *

నాలుగు రోజులుగా శివాలయందగ్గర జనం యెక్కువవుతున్నారు. చదువు కన్నా ముందు ముఖ్యంగా శారద చెప్పే రామాయణం, వాళ్లని బాగా ఆకట్టుకొంది. ముసలీ, ముతకా ఒకరేమిటి అందరికీ శారద కంఠం పాడే పద్యాలు, ద్విపదలు, చెప్పే విధానం అన్నీ ఆకర్షించాయి. సీతాకల్యాణం, రాముని వనవాసం, బంగారు లేడి, రావణుడి సీతాపహరణం, యివన్నీ దృశ్య కావ్యాలుగా చిత్రీకరించి చెప్పింది.

"అమ్మగోరూ! తండ్రి మాటను జవదాటని రాముడూ గొప్పోడే నంటారు, తండ్రిమాటను యినిపించుకోని ప్రహ్లాదుడు గొప్పోడే నంటారు. యిదేటండీ ఈ తిరకాసు..." అడిగాడు, అసిరయ్య. వాడు రామాయణం పొద్దు తిరిగిపోయిన వయస్సులో యెన్నోసార్లు విన్నాడు.

"దశరథ మహారాజు చక్రవర్తి, సౌమ్యుడు. తన ప్రాణాలను కాపాడిన భార్య వరాలు తీర్చడానికి, తన హృదయాన్నీ పూర్తిగా ఆక్రమించుకున్న రామచంద్రుని గూడా అడవులకు పంపిన సౌజన్యమూర్తి. మాట కోసం అంత పుత్రశోకాన్ని గూడా గుండెల్లో దాచుకున్నా మహనీయుడు. కానీ ప్రహ్లాదుడి తండ్రి వేరు. దైవత్వాన్ని అంగీకరించని దురహంకారి. కన్నకొడుకుని యేనుగులతో తొక్కించి, విషమిచ్చి చంపించాలని ప్రయత్నించి విఫలుడయ్యాడు. కన్నకొడుకుమీద యెందుకంత ద్వేషం ప్రబలిందో తెలుసు. శ్రీ మహావిష్ణువు అవతారమూర్తి భగవంతుడు. మంచితనానికి ప్రతిరూపం. అందుకే మనం మంచివాళ్లని 'ఆయన దేవుడులాంటివాడురా' అంటాం. తన స్వార్థం అడుగు జాడల్లో నడవక మంచితనాన్ని ఆరాధించే కొడుకుని భరించలేకపోయాడు. యిక్కడున్నాడా నీ దేవుడు అని స్తంభాన్ని కాలితో తంతే అది చీల్చుకొని ఉగ్రరూపంలో నరసింహావతారం దాల్చి, హిరణ్యకశిపుడ్ని చీల్చి చంపేసాడు. మనిషి స్వార్థంలో నుండి దుర్మార్గం పుడుతుంది. అది వొక దావానలంలా పాకి వొక యింటికి అంటుకొన్న అగ్గి, మిగిలిన యిళ్లని యెలా కాల్చేసిందో అలా మనల్నందరినీ కాల్చేస్తుంది. అందువలన మనం అలాంటి వాళ్ల నొక కంట కనిపెట్టి బుద్ధిచెబుతూ వుండాలి" అంది సవివరంగా బోధపరచి. యిలాటి

సందేహాలకు సోదాహరణలతో సమాధానాలు. వాళ్లకి...అవి కళ్లకు కట్టినట్టుగా కనబడేవి. నుయ్యి తవ్వకం కొద్దిరోజులుగా నిదానంగా సాగుతోంది. మాలపల్లె కూలీలు పక్క గ్రామానికి పనిమీద వెళ్ళినందువల్ల కుదరలేదు.

ఆ రోజు పున్నమి. పండు వెన్నెల్లో స్నానం చేస్తున్నట్టుగా వుంది, ప్రకృతి. ఆ రోజు శారద రామాయణం చెప్పే ధోరణి క్రొత్త బాట తొక్కింది.

"వాలిని వధించాడు రాముడు. సుగ్రీవునికి తారను అప్పజెప్పాడు. తన మాట నిలుపుకున్నాడు. దీనికి కారణం స్నేహం. అది వెలుగుకు చిహ్నం. బ్రతుకు ఈ లాంతరు అని మీరనుకుంటే, అది వెలగటానికి చమురు యెంత అవసరమో, జీవితం జీవించడానికి వెలుగు అంతే అవసరం. స్నేహితులు లేకుండా బ్రతకటం కష్టం. మనిషి వంటరిగా బ్రతకలేడు. మనిషి సంఘజీవి. ఆనందాన్ని పంచుకోవడానికి మిత్రులు యెంత అవసరమో దుఃఖాన్ని పంచుకోవడానికి మిత్రులూ అంతే అవసరం. అందువలన మనం నిష్కారణంగా మనుష్యుల్ని ద్వేషించి, దూరం చేసుకోవడంకన్నా అభిమానించి ఆత్మీయత పెంచుకోవాలి. వాళ్ల కష్టాల్లో పాలు పంచుకోవాలి. అందుకే సుగ్రీవుడు రాముడ్ని కౌగిలించుకుని

"త్వం వయస్యోఽసి మే హృద్యో

హ్యేవం దుఃఖం, సుఖంచనౌ" అంటాడు. అంటే దీనర్థం 'నీవు నాకు మిత్రుడవయినావు. యికనుండి నీ దుఃఖం నా దుఃఖం వొక్కటే. నీ సుఖమూ, నా సుఖమూ వొకటే' అని తన సహచరుల్ని నలుదిక్కులకూ పంపించాడు, సీతమ్మ తల్లి జాడ కనుక్కరమ్మని," అంది అక్కడకు ఆపి, పాఠాలు ప్రారంభిస్తూ.

యీ దృశ్యాలన్నీ మంచంమీద పడుకున్న రవికి జ్ఞాపకం వస్తున్నాయి. అతనికి నిద్రపట్టడంలేదు. రాత్రి పదిగంటలు దాటుతోంది. శారద చక్కని అందం, హుందాతనం, సంస్కారం యివన్నీ అతనిలో అప్రయత్నంగానే, ఆరాధనా భావానికి చోటుచేసుకున్నాయి. కానీ తనెక్కడ, ఆమెక్కడ...మర్రి ఆలోచించలేకపోయాడు. కోటేశు యింకా యింటికి చేరుకోలేదు. యేదో పనిమీద పొరుగూర్లో వున్న చిన్నాన్న యింటికి వెళ్లాడు.

అతని ఆలోచనలకి భంగమే వచ్చింది. తలుపు చప్పుడయింది. గాలేమో ననుకున్నాడు. రెండోసారి చప్పుడయింది. "యెవరూ?" అన్నాడు బిగ్గరంగానే. దానికి సమాధానంగా మళ్లా దబదబ చప్పుడు. రవికి నిజంగా కోపం వచ్చింది.

తలుపు తట్టినవాళ్ళు యెవ్వరో చెప్పవచ్చేకదా. ఆవేశంగా తలుపు తీసాడు. యెదురుగా మూగ కిష్టిగాడు వాడు ఆయాసంతో రొప్పుతున్నాడు.

"యేం జరిగిందిరా?" అడిగాడు ఆశ్చర్యంగా. వాడు యేవో సౌంజ్ఞలు చేసాడు. ఐదు నిముషాలకు గానీ వాడు చెప్పింది అర్థంకాలేదు. అర్థమయిన తర్వాత వొళ్ళు వేడెక్కిపోయింది మూలనున్న బాణాకర్రను తీసుకున్నాడు. అంతే మెరుపులా వాడి వెంట పరిగెట్టటం ప్రారంభించాడు శారద యింటివేపు.

వెన్నెట్లో రవి పరుగు చూసి సాంబడు జడుసుకున్నాడు. వాడు నిరాయుధుడు. పరిగెట్టి పారిపోయాడు. కిష్టిగాడ్ని వొమ్మని తలుపు దగ్గర ఆగిపోయాడు.

లోపల ఘర్షణ జరుగుతోంది. తండ్రి మాటలు బిగ్గరగా వినిపిస్తున్నాయి.

"యింతవరకూ యీ స్కూల్లో యెవ్వరూ నా కడ్డు సెప్పలేదు, నే సెప్పినట్టు నడుసుకున్నారు. ఆ కోమటి బంగారయ్యని పంపించేసినావు. స్కూలు నీ బాబు సొమ్మయినట్టు మా పిడకలు సరవొద్దని సెప్పావుట పనోళ్లతో. అప్పటికేటి యిస్కూలు సుబ్బరమంతా నీ మీద నున్నట్టు. యివన్నీ సాలక రాత్రి బడోటి యెలిగిస్తూన్నావట నీవు, ఆ తలమాసినోడు. రామాయణం కతలు సెప్పటం ప్రారంభించేవట. సినిమాలో యీరోయినయి పోదామనుకుంటున్నావేటి... నా గేమ ప్రెజలు నా మాటినకుండా సేసేద్దావనే. యెదవది నాల్రోజులు అయిదరాబాదెళ్లి వచ్చేసరికి యింత నాటకం ఆడేశావన్నమాట. మరి యిప్పుడేమో పతివ్రత కబుర్లాడుతున్నావ్ రమ్మంటే..." అన్నాడు స్టూలుమీద నుండి లేస్తూ.

"ఒంటరిగా వున్నానని మీరనుకుంటున్నారేమో! జాగ్రత్త. యిష్టం వచ్చినట్టు మాట్లాడకండి. సభ్యతగా ప్రవర్తించటం నేర్చుకోండి..." అంది ధైర్యంగానే.

"కోపంలో గూడా నువ్వు సానా సక్కగా దంతంబొమ్మలా వుంటావు. నాకాలి పోయింది. సానా డబ్బు, బంగారం వుంది. నీ కెవ్వరు లేరటగా. అది నాకెలా తెలిసిందను కుంటావేమో. లచ్చి సాంబడుతో సెప్పిందట. నిన్నందలం మెక్కిస్తాను. సత్తెపమానంగా రా." అన్నాడు వొకడుగు ముందుకు వేసి. తలుపు సందులో నుండి తాగిన విస్కీ వాసన కొడుతోంది.

"ఆగండి. యింకొక్కడుగు ముందుకు వేయకండి..." అంది శారద గంభీరంగా.

యింతలో తలుపులు దడాలున తెరుచుకున్నాయి. రౌద్రమూర్తి రవి. శారద అతని పక్కకు చేరుకుంది, భీతహరిణేక్షణలా. కామినాయుడికి రవిని చూసేసరికి కళ్లనిండా కోపం వచ్చింది.

"ఆఖరి కిక్కడికి గూడా శని నాకొడులా దాపురించావు కదా!" అన్నాడు మీదకు వస్తూ. అంతే! కామినాయుడు గూబ అదిరిపోయినట్లుగా లెంపకాయ కొట్టాడు రవి. కూలిపోయాడు కామినాయుడు.

"ఒరేయ్! సాంబా...సాంబా..." కేకలు గాలిలో కలిసిపోయాయి.

"వాడెప్పుడో పారిపోయాడు. యెంతమంది అమాయక స్త్రీలను నీ దాహానికి బలిచేస్తావ్. యింకెప్పుడూ ఈ ఛాయలకు రాకు..." మెడబట్టి బయటకు గెంటేసాడు. పడి లేచి, తిట్టుకుంటూ, తూలుకుంటూ ఆశక్తుడిలా వెళ్ళిపోయాడు.

శారద కళ్లలో కొంచెం నీరు తిరిగింది. రవి రాకపోతే తనగతి యేమయ్యేదో తలుచుకుంటే భయం వేసింది. శరీరం వొణికింది. రవి ఆమె భుజాలు పట్టుకొని స్టూలుమీద కూర్చోబెట్టి, గ్లాసుడు మంచినీళ్ళు యిచ్చాడు. అప్పటికిగాని భయ భ్రాంతులనుండి తేరుకోలేకపోయింది.

సమాయానికి కిష్టిగాడు వచ్చి సౌంజ్ఞలతో చెప్పాడు. హైద్రబాద్‌నుండి సాయంకాలమే వచ్చాడు మా నాన్న. యేదో కొంత గందరగోళం చేస్తాడని తెలుసు కానీ యింత నీచంగా ప్రవర్తిస్తా డనుకోలేదు. మీరేం భయపడకండి. నేను ఈ రాత్రికి బయట పడుకుంటాను. మీరు నిర్భయంగా గడియ వేసుకుని పడుకోండి. రేపట్నుంచీ యేదో యేర్పాటు చేద్దాం. గుడ్ నైట్..." అని చెప్పి అరుగుమీద పడుకున్నాడు.

తలుపు తీసిన శబ్దమైతే తలెత్తి చూసాడు. యెదురుగా శారద. దిండూ, అంబుఖానా, దుప్పటి యిచ్చింది. తర్వాత ఫ్లాస్కులో పాలు యిచ్చింది.

"యెందుకు మీ కీ శ్రమ అర్ధరాత్రపుడు..." అన్నాడు ఆమె చేతినుండి పాలు తీసుకుంటూనే. శారద గుడ్ నైట్ చెప్పి తలుపు వేగాకుంది.

మిగిలిన రాత్రి కరగడానికి యెంత సేపు పడుతుంది. తెల్లారేసరికి వూరల్లా కార్చిచ్చులా వొక వార్త వ్యాపించింది.

"మాలపల్లెలో యిద్దరు మనుష్యులు వాంతులు, విరోచనాలతో తెల్లవారు ఝామున అరగంట తేడాతో చనిపోయారు బాబూ" అంటూ కోటేశు రవి నిద్ర లేచేసరికి మోసుకువచ్చాడు. రవికి నిద్ర బద్ధకం వదిలిపోయింది. శారద అప్పటికే లేచి తలారా స్నానంచేసి ప్రార్థన చేసుకుంటుంది. ఈ మాట తెలియగానే సగంలో ఆపి బయటకు వచ్చింది.

రవికి ఆలోచన రాలేదు స్తబ్దుడైపోయాడు.

"ముందు మీరు ముఖం కడుక్కోండి. కాఫీ త్రాగి తర్వాత యేం చేయాలో ఆలోచిద్దాం," అంది ఈ హఠాత్పరిణామానికి ఆశ్చర్యపడుతూ.




రవీ, కోటీశు మాలపల్లె చేరుకునేసరికి, మాలపల్లెలో వారందరూ గుమి గూడారు. ఏడుపులూ, పెడబొబ్బలూ వినిపిస్తున్నాయి. చచ్చిపోయినవారు బావి తవ్వుతున్న కూలివాళ్లలో వాకడి తల్లిదండ్రులు. రవి వారి నోదార్చాడు.

"బాబూ! బుద్ధి గడ్డితిని అమ్మోరికపరాధం సేసి, బావి తవ్వడానికి మీ కాడ పనిచేసినందుకు ఉమ్మతల్లి నా కేటి చేసిందో సూడండి," అంటూ దీనంగా విలపించాడు శవాలను తీసుకువెళ్లే యేర్పాట్లు చేస్తున్నారు. రవికి అర్థంకాలేదు. కులపెద్ద అసిరయ్య దగ్గరకు వెళ్లి అడిగాడు.

"యేట్లేదు బాబూ! యీల్లు సచ్చేరని తెలిసి మాక్కబురంపినాడు, పెసిడెంటు. మా వెల్లినాం. అప్పటికే పూజారి గురయ్యమీద అమ్మతల్లి పూనకం పూనింది. 'ఒరేయ్! నా సంబరంలోకి రాకు. ఊరంతా రాకుండా, కొంతమంది మొక్కుబడులు సెల్లించకుండా గోతులు తవ్వుతాంర్రా! సూడండి ఆళ్లందరిని యేటి సేస్తానో. కరకర నవిలి మింగేస్తాను," అని శివాలు యేస్తున్నాడు. చూసార్రా దొంగ యెదవల్లారా! మీరు సేసిన పనికి అమ్మోరు యేటంటుందో యినండి...' అన్నాడు బాబూ! అక్కడున్నళ్లంతా నామీద వుమ్మేసారు. బుద్ధిసేసుకున్నాను బాబూ, తప్పు నాది" అన్నాడు కన్నీళ్ళు పెట్టుకుంటూ అసిరయ్య

ఆ మధ్యాహ్నమే పల్లెనుండి కలరా వ్యాధి మిగిలిన రెండు వీదుల్లోనూ వ్యాపించింది. కోమటి బంగారయ్య తల్లితో ప్రారంభమయ్యింది. ఊరు ఊరంతా గగ్గోలు పుట్టింది. శారద దగ్గర వున్న మందులు కొంతవరకూ యిచ్చింది.

కానీ యేంలాభం. ఉప్పెనలా ముంచుకొస్తోం దా వ్యాధి. గురవయ్య మీద అప్పుడప్పుడు అమ్మోరు వాలుతోంది. "వొరేయ్ యిది మహమ్మారిరా. వూరంతా వొల్లెస్తాను. నాకు శాంతి చేయండిరా" అంటూ వూగిపోతున్నాడు. జనం భక్తితో దండం పెట్టి మొక్కుబడులు మొక్కుకుంటున్నారు, బిక్కు బిక్కు మనే గుండెలతో.

"మీరు పట్నం వెళ్లండి. హెల్తు వాళ్లకి రిపోర్టుచేసి వాళ్లని తీసుకురండి. లేకపోతే ప్రజల్ని యిలా అజ్ఞానంలో పెట్టి చంపేస్తారు మీ నాన్న" అంటూ రవిని పట్నం పంపించింది.

రాత్రి పదిగంటలకల్లా ఆరోగ్యశాఖ సిబ్బందితో గూడిన జీపు వూళ్లోకి వచ్చేసింది. మూడు రోజులు కలరా వ్యాధితో హోరాహోరి పోట్లాడి పరిస్థితిని అదుపులోకి తెచ్చారు.

"ఈ గ్రామం ప్రెసిడెంటుగారి సహాయ నిరాకరణంలో మీ యిద్దరుగానీ లేకపోతే యిదంతా శ్మశాన భూయిష్టమయిపోయి వుండేది మీ యిద్దరూ వీళ్ళందరికీ ప్రాణదానం చేసారు," అంటూ ప్రశంసించారు, ఆరోగ్యశాఖ బృందం. ఈ సంఘటన తర్వాత ప్రజలలో శారద, రవి అంటే మంచి అభిమానం, కృతజ్ఞతా కలిగాయి. కామినాయుడు వొంటికి కారంరాసుకున్నట్లయింది. శారదమీద చాల పగబట్టాడు. అయితే పరిస్థితులు సమంగా కలిసిరావటంలేదు. సమయంచూసి, దెబ్బతీసే రాజకీయం కామినాయుడిది.

మళ్ళా బావి తవ్వకం ప్రారంభమయ్యింది. మాలపల్లిలో కొంత మార్పు వచ్చింది. "ఆ రోజు బావి తవ్వడానికి పంపినందుకు శిక్షించిందన్నావు. వొప్పుకున్నాను. మరి మొక్కుబడులు చెల్లించి భక్తితో కొలిచిన బంగారయ్య తల్లి, వీధుల్లో మరికొందరు యెలా చచ్చిపోయారు?" అన్న రవి ప్రశ్న పల్లి పెద్ద అసిరయ్యలోనూ మరికొందరి మనసులో ఆలోచనల్ని రేపింది.

"తర్వాత తెలిసింది కదా. అది కలరా అంటురోగమని, దీనికిగల కారణాల్లో నీరు సమృద్ధిగా లేకపోవటమే! ఆలోచించండి. ఆ వీధిలో కొందరు వస్తున్నారు మీ యిష్టం" ప్రాధేయపూర్వకంగా అడిగాడు. అసిరయ్య వొప్పుకున్నాడు.

~~కానీ బావి తవ్వే ప్రయత్నం ఆ సాయంకాలంతో ఆగిపోయింది. కోటీశు గాడి~~ గునపానికి రాయి తగిలింది. అందరూ గుమిగూడారు, నిరాశ సంతరించుకున్న ముఖాలతో.

"మందుపెట్టి పేలిస్తే సరి, రాయి సంగతి తేలిపోతుంది," అన్నాడు కోటీశు.

మర్నాడు రవి ఆ యేర్పాటు చేసాడు. రాయి బద్దలయింది కానీ లాభం లేక పోయింది.

"బాబూ' లోపల కొంత వున్నట్టు వుంది," అన్నాడింకొకడు.

ఈసారి రవి నిరాశతో కృంగిపోయాడు. కామినాయుడు పొంగిపోయాడు. రవికి ధైర్యం చెప్పింది, శారద.

"మీరు ప్రభుత్వంకు వొక అప్లికేషను ప్రజలందరిచేత పెట్టించండి. అప్పుడేమయినా కొంత ప్రయోజనం చేకూరుతుంది. అంతేగాని మళ్ళా మరోచోట బావి తవ్వడానికి ప్రయత్నించడం మళ్ళా అక్కడ యిలాగే రాయిపడటం జరిగితే యేం లాభం...అయినా మీ ఈరెండో ప్రయత్నానికి మనవాళ్ళు అంతగా సుముఖంగా వుండకపోవచ్చు," అంది శారద ఆ సాయంకాలం కాఫీ యిస్తూ. రాత్రి బడి కలరా మూలకంగా వారంరోజులు వాయిదావేసారు.

"మీరు చెప్పింది నిజమే. అలాగే చేయాలి..." అని వెళ్ళిపోయాడు.

అర్ధరాత్రయింది. కోటీశు తలుపు తట్టడంతో గాఢనిద్రలో వున్న శారదకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. వాడు భయంతో వణుకుతున్నాడు.

"యేం జరిగింది కోటీశు ?..." అడిగింది ఆశ్చర్యంగా.

"యేంలేదమ్మా! బాబుగోరు సానాసేపటి వరకూ రాలేదు. మాయింటికా డున్నాడేమోనని సూసాను. కానీ లేరు. నాతో సెప్పింది ఆబాబెక్కడికి యెల్లరు. నాకెందుకో అనుమానమొచ్చి నూతిదగ్గర కెళ్ళాను. అక్కడ బాబు గునపంతో రాతిపొరలని కొడతున్నారు. నాను దిగి బాబుతో నచ్చచెప్పాను. కానీ యినకో లేదు. వొంటిమీద సెయ్యేస్తే అగ్గినాగ కాలిపోతోంది వొళ్ళు. మీరోసారి రండమ్మా...మీ మాటంటే ఆ బాబుకు గురి...'' అన్నాడు, కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ. అప్రతిభురాలైంది శారద. కోటీశు వెంట తొందరగా నడిచి వెళ్ళింది.

ఖంగు ఖంగు మని శబ్దాలు వినిపిస్తున్నాయి. రవి శరీరమంతా చెమటతో ముద్దయి తడిసిపోయింది

"యేమండీ రవిగారూ! యేమిటిది..." అంది.

నిరుత్తరుడయ్యాడు రవి. ఆ సమయంలో శారద వెనకాతల కోటీశు.

"యిక్కడ నీరు పడుతుంది తప్పకుండా పడుతుంది. అందుకోసం నేను... నేను వొక్కడ్నీ కంఠంలో చివరి వూపిరి వున్నంతవరకూ ప్రయత్నిస్తాను" అన్నాడు.

"నిజమే. విశ్వాసం వుండటం మంచిదే. అది మరీ మూఢవిశ్వాసం కాకూడదు. అసలే మీ ఆరోగ్యం బాగులేదు. పదండి" అంది, అతనితో అనునయంగా.

"నా బాధ మీకు తెలియదండి శారదగారూ! ఈ రాతిపొరలని చేతితో తాకండి. తెలుస్తుంది..." అన్నాడు. శారద తాకింది. కానీ యేమిటో అర్థం కాలేదు. అయోమయంగా అతనివేపు చూసింది.

"ఈ రాత్రి రాతి పొరలని చేతితో తాకుతుంటే శివగంగ మువ్వల సవ్వడితో గలగల గెంతులేస్తున్నట్లు నాకు అనుభూతి కలుగుతోంది..." అన్నాడు ఆవేశంగా.

"మీ ఆశ నెరవేరే రోజు త్వరలో రావాలని నాకు కోరికవుంది. మీరు పదండి..." అంది అతనిచేయి పట్టుకుంటూ కోటీశు గునపం పట్టుకొని వెనుక నడిచాడు. దారిలో తూలి పడబోతే శారద అతన్ని పట్టుకొని నడిపించి తన యింటివరకూ తీసికొచ్చింది వొంటిమీద తెలివిలేకుండానే అతను మంచంమీద పడిపోయాడు కోటీశుగూడా ఆ రాత్రి అక్కడే పడుకున్నాడు.

రెండు రోజులకుగానీ రవి మనిషి కాలేకపోయాడు. అతని చేతులు పొక్కి బొబ్బలెక్కిపోయాయి. శారద అతనిని కంటికి రెప్పలా కాపాడి సేవచేసింది. గ్రామస్థులు కొంతమంది రాత్రిపూట చూడడానికి వచ్చేవారు పెసిడెంటుకు తెలిస్తే యేం చేస్తాడోనని.

"మీకీ రోజు కొంచం భోజనం చెయాలి. పూర్తిగా జ్వరంతగ్గిపోయింది..." అంది శారద. ఆ రోజు ఆదివారం, రవి గోర్కీ నవల 'అమ్మ' చదువుతున్నాడు.

పుస్తకం ఆపి చూసాడు స్టూలుమీద స్టీలు కంచంలో ఆవిర్లు కక్కుతున్న అన్నం, పప్పు, కూర, చారూ తెచ్చిపెట్టింది.

"మీకు చాలా శ్రమ యిస్తున్నాను..." అంటూ లేచాడు అతనికి బాగా ఆకలి వేస్తోంది చెయ్యి పెట్టబోయాడు. అంతలోనే బాధగా వెనక్కి తీసుకున్నాడు చెయ్యి. నీళ్ళు తీసుకువచ్చిన శారద అతని అవస్థ గమనించింది.

కోటీశూ యెవ్వరూ యింకా రాలేదు.

"మీ కభ్యంతరం లేకపోతే నేను కలిపి పెడతాను అంది అతని కళ్ళల్లోకి చూస్తూ. మరేం మాట్లాడలేకపోయాడు. ఆమె చనువుగా అన్నం కలిపి అతని నోట్లో పెట్టింది. యేదో అనిర్వచనీయమైన అనుభూతి యిద్దరి మనస్సుల్లోనూ చోటుచేసుకుంది.

''త్వ వయస్యో- సిమేహద్యో
హ్యేకం దుఃఖం సుఖంచ... ''శ్లోకం జ్ఞాపకం వచ్చింది. యిద్దరికీ వొకో సారి మనస్సులు మూగబోయాయి. గుండె గొంతుకలో యేవో అనురాగ చిత్రాలు మధురోహలు కొట్లాడుతున్నాయి.

''ఈ సాహచర్యం శాశ్వతమైపోతే బాగుండును'' అనుకున్నాడు మనస్సులో.

''యేమిటాలోచిస్తున్నారు? తినండి,'' అని హెచ్చరించింది. ఆమె తెల్లటివేళ్లు చక్కగా, అందంగా వున్నాయి.

జ్వరంలో రవి చిక్కి సన్నమయిపోయాడు. అతని నల్లని గెడ్డం వొత్తుగా పెరిగింది. ''అన్నదాత సుఖీభవ'' అన్నాడు నవ్వి, శారద కంచం తీసుకుని వెళ్ళిపోయింది తువ్వాలు అందించి.

రవి కొంచెం నీరసంగా కునుకు తీస్తున్నాడు.

''అదేమిటి భోజనం తర్వాత వెంటనే నిద్రపోతారా? వొద్దు" అంటూ చేతులు తుడుచుకుని, స్టూలుదగ్గరకు లాక్కొని కూర్చుంది. రవి నిద్రలేచాడు.

"చెప్పండి కబుర్లు" అన్నాడు నవ్వి.

"మీరే చెప్పండి..."

"యేమున్నాయి.ఈ రోజు మీ అమృత హస్తవాసితో కొత్త చైతన్యం నాలో పుంజుకుంది. కొత్తవెలుగు నా గుండెల్లో నిండింది..." అన్నాడు.

"మరీ పొగడకండి. మీ ధోరణి చూస్తే రోజూ నన్ను అన్నం తినిపించ మనేటట్లు వున్నారు" అంది. అరుణిమ వచ్చిన ముఖంతో.

"నాకంత అదృష్టం లభిస్తుందండీ?" అన్నాడు నిరాశగా నిట్టూరుస్తూ. శారద నిశ్శబ్దంగా లేచి పుస్తకాల్లో దాచిన వుత్తరం తీసియిచ్చింది.

"యిదేమిటి?" ఆశ్చర్యపోతూ.

"చదవండి మీకే తెలుస్తుంది" అంది.

ఉత్తరం తెరిచాడు రవి.

ప్రియమైన శారదకు,

ఆశీస్సులు. నాలాంటి అనాధ దీపాల్ని ఆరిపోకుండా రక్షించండి" అంటూ తొలి నెల జీతంలో నీవు పంపించిన డబ్బు, వుత్తరం అందినవి చాలాసంతోషం.

నీవు నీ జీవితాన్ని నిర్దుష్టంగా సరిదిద్దుకున్నందుకు చాలా సంతోషం. రవి గురించి రాసావు. చాలా సంతోషం. 'ప్రియుడూ, ప్రేయసీ ప్రేమించు కోడంకంటే యిద్దరు మిత్రులుగా వొకే ఆశయంలో తన్మయులై తమ కార్య

క్రమంలో సమ్మిశ్రితులైపోవటంలో యెంతో మాధుర్యం వుందంటాడు, రోమారోలా.

అతని జీవితంలోనూ, అతని జీవితాశయంలోనూ, పాలుపంచుకోవాలని నా అంగీకారంకోసం రాసావు. నేనంటే యెంత అభిమానం తలీ. నీ నిర్ణయంలో యేమాత్రం తప్పు వుండదు. అది నాకు తెలుసు వుత్తరంలోనే అతని వ్యక్తిత్వం అంచనా వేసాను. తప్పకుండా అతన్ని చేసుకో.

నేనే దగ్గరుండి జరిపించేవాడ్ని. నా బాధ్యతలు నీకు తెలుసుగా. చెట్టును పండిన పండులా వున్నాను. కొద్దిగా అనారోగ్యం. మీ దంపతులు నేను రాలి పోయేలోగా వొకసారి కనిపించండి.

—దయానంద.

రవి హృదయం ఆనందంతో పరవళ్ళు తొక్కింది. యేదేవతలు కరుణించారో తనని. శారదవేపు చూసాడు ఆమె సిగ్గుతో తలవంచుకుంది ఆమె నిడుపాటి జడలో ముద్ద మందారం పక్కన ఆమె బుగ్గకేసి తొంగిచూసి నవ్వింది.

"నేను చాలా అదృష్టవంతుడ్ని శారదగారూ!...'' అన్నాడు మరేం మాట్లాడ లో తోచక.

"యింక మీరు గారలు తీసెయ్యాలి" అంది అతని వేపు గోముగా చూస్తూ.

"దేవిగారు యేం చేయమన్నా సిద్ధంగా వున్నాడీ దాసుడు" అన్నాడు నవ్వి. అతని నుదురు చెమటలు పడితే టర్కీ తువ్వాలుతో తుడిచింది. ఒకరి కళ్ళలోకి వొకరు ఆరాధనాపూర్వకంగా చూస్తున్నారు.

"అమ్మగోరు...అమ్మగోరు..." ఆయాసపడి పరిగెత్తుకుంటూ వచ్చిన లచ్చి గుమ్మందగ్గర హఠాత్తుగా ఆగిపోయింది. ఆ ప్రేమికుల ఏకాంతత చెదిరి పోయింది.

"యేమిటే, యేం జరిగిందే?..." అంది సర్దుకొని స్టూలుమీద కూర్చుని.

"యేం లేదమ్మగోరూ! మా అన్న నాకు పొన్నారు మనువు ఖాయంసేసి లగ్గమెట్టేసినాడు. పున్నం పోతే పెళ్ళి..." అంది దిగాలుగా.

"ఆఁ పెదతాడు లగ్గం; వాడికి, ఆపొన్నారోడికి రెండిచ్చుకుంటే తలతిక్క కుదురుద్ది. ఈ కోటిగాడి దెబ్బ మీ అన్నకోసారి రుసి సూపిస్తా..." అన్నాడు కోపంగా. యెప్పుడొచ్చాడో లచ్చి వెనక నిల్చున్నాడు.

"తప్పదా!'' అన్నాడు రవి.

"తప్పదు బాబూ! కిష్ణ పరమాతమ రుక్మిణీదేవిని యెలా మనువాడినాడో

నానూ అలాగే లచ్చిని మనువాడతాను. యెవరేటిసేస్తారో నానూ సూస్తాను.'' అన్నాడు గంభీరంగా వాడి మనస్సులో లచ్చిమీద ప్రేమ గుండెలనిండావుంది.

"యేమే లచ్చి! నీకు కోటేశును చేసుకోవటం యిష్టమేనా?'' అడిగింది లచ్చిని. సిగ్గుతో తల వూపింది.

"అలాక్కాదు. మీ అన్నయ్య మళ్ళా అడ్డొస్తే..."

"ఆడు అడ్డురాదమ్మా! నానంటే యెంతో ప్రేమ అయితే పిచ్చికోపం" అంది హామీయిస్తూ.

"అయితే రేపే మీ పెళ్ళి..." అన్నాడు రవి ఉత్సాహంగా లచ్చి కోటేశులకు మతిపోయింది.

"యెక్కడ బాబూ..." అర్థంకాక అడిగాడు.

''యిక్కడే, ఈ యింట్లోనే, యింకో పెళ్ళికూడా జరుగుతుంది," అన్నాడు శారదవేపు చూస్తూ.

''యింకో పెళ్ళెవరిది బాబూ...'' అన్నాడు అర్థంకాక.

''అప్పుడు చూస్తావుగా'' అన్నాడు నవ్వి.

నిజంగా ఆ మర్నాడు సాయంకాలం యెంతో నిరాడంబరంగా పెళ్ళి జరిగి పోయింది. పురోహితులు లేరు. మంత్రాలు లేవు. బాజాభజంత్రీలు లేవు. పంచ భూతాలే పురోహితులు, మమతానుబంధాలే మంత్రాలుగా బాధ్యతలు పంచుకున్న యెడల సవ్వడి రవళే బాజా భజంత్రీలుగా మారినవేళ ముందు రవి, శారద మెళ్లో పసుపుకొమ్ము తాళి కట్టాడు ఆ తర్వాత కోటేశుచేత లచ్చిమెళ్ళో పసుపు కొమ్ము తాళి కట్టించాడు. యిద్దరు దంపతులూ రవి, శారదల కాళ్ళకు దండం పెట్టారు.

"యేం ఆశీర్వదించమంటారు? మేంగూడా కొత్తదంపతులమేకదా?''అంటూ, పిల్లా, పాపలతో కలకలలాడుతూ నిండుజీవితాన్ని గడపమని ఆశీర్వదించాడు. శారద, రవికెగుడ్డ, పసుపుకుంకుమ యిచ్చింది. నలుగురూ కలిసి, ఆ యింట్లోనే భోజనం చేసారు. సేమ్యా పాయసం త్రాగారు.

"యిప్పుడు మీ యిద్దరు వెళ్ళి మీ అన్నయ్యకు కనబడి, అతని ఆశీర్వాదం తీసికోండి...'' అంది శారద.

''అయ్య బాబోయ్! యింకేటుందా! నన్ను చీల్చేసి కాకులకు, గద్దలకు మేసేస్తాడు...'' అంది భయంగా. కోటేశుకు దగ్గరగా జరుగుతూ.

''మరయితే యేంసేస్తావ్...'' అంది శారద నవ్వి.

''లచ్చి నా పెళ్లాం, అడిందికెందుకు పంపిత్తానమ్మా. నా యింటికొట్టు కెళ్తాను. పదండి బాబు పోదాం'' అన్నాడు రవి కేసిచూస్తూ.

రవి శారదకేసి చూసి నవ్వాడు లేవబోతూ.

"నీ పెళ్ళాన్ని తీసుకుపోతున్నావ్ బాగుంది. కానీ మావార్నిగూడా తీసుకు పోరావా?'' అంది శారద చిరుకోపంతో.

అప్పటికి కానీ కోటీశుకు అర్థంకాలేదు. నాలిక్కరుచుకొని లచ్చిని తీసుకొని బయటకు వెళ్ళిపోయాడు.

రాత్రి ఎనిమిది కావస్తోంది. తెల్లచీరలో శారద దేవతలా మెరిసి పోతోంది. లచ్చి యెక్కడనుండి తెచ్చిందో మల్లెలు ఆమె తలలో చిరునవ్వులు వెదజల్లు తున్నాయి. ఆమె పక్క సర్దుతోంది. తెల్లని దుప్పటి పరిచింది

జీవితంలో తొలి అనుభవం. వొంటరితనం శాశ్వతంగా దూరమైపోయే రోజు. తన జీవితాన్ని యింకొకరు పంచుకోబోతున్న రోజు.

''యేమిటి దేవిగారు నామీద అన్ని అధికారాలు తీసేసు కుంటున్నారు మీతో చెప్పందీ బయటకు వెళ్ళగూడదు కాబోలు'! అన్నాడు రవి నవ్వుతూ,ఊదొత్తులు వెలిగిస్తూ.

"అధికారానికే కాదు, కొంగున కట్టేసుకుంటాను" అంది నవ్వి, దిండు సర్దుతూ వాలుగా అతన్ని చూస్తూ సోగ కనులతో.

"నేను చిత్రకారుడ్నయినా కాదు, ఈ అందాల రాసిని మనసారా గీయ డానికి" అన్నా డామెను కౌగిలిలోకి తీసుకుంటూ. అతని గుండెలమీద శారద వాలిపోయింది.

"నాకుండే ఈ పేదజీవితంలో నిన్ను గొప్పగా సుఖపెట్టలేనేమో శారదా!" అన్నాడు.

"పేదతనం దాంపత్యాని కడ్డురాదండీ. మనసు గొప్పతనమే సుఖజీవితానికి ప్రథమ సోపానం" అంది అతని కౌగిలిలో గువ్వలా యిమిడిపోతూ.

* * *

తెల్లవారింది శారద నెమ్మదిగా రవికి నిద్రాభంగం కాకుండా లేచింది. మల్లెలు ప్రక్కమీద నలిగివున్నాయి. లేచి వెళ్ళబోతే రవిచేతిలో పైట చిక్కుకుని వుంది. అతను యేమీ తెలియనివాడిలా నిద్రపోతున్నాడు.

"వదలండి..." అంది దగ్గరగా వస్తూ

"యెలా వదుల్తాను. కొంగున కట్టుకుంటానని చెప్పావుకదా..." అనేసి కళ్ళు మూసుకున్నాడు.

"అబ్బాయిగారి కింకా తమకం తీరలేదేమిటి ?" అంది చెవిలో. ఆమెను చుంబించి విడిచిపెట్టాడు.

"మరీ కొంచెవాళ్ళయిపోతున్నారు" అంటూ లేచింది.

రవిగూడా ముఖం కడుక్కొని వేడి వేడి కాఫీ తాగుతున్నాడు. ఇంతలో కిష్టిగాడు పరిగెట్టుకుంటూ వచ్చాడు. వాడి చేతిలో పువ్వులు లేవు. వాడేదో సౌంజ్ఞలు చేస్తున్నాడు.

"శారదా ! కోటీశుకు, సాంబడికి ఏదో తగవు జరుగుతోందట. నేను తొందరగా వెళుతున్నాను..." అని చెప్పులు వేసుకొని బయటకు వచ్చాడు.

కోటీశు యింటిదగ్గర జనం గుమిగూడారు. సాంబడు బాణాకర్రతో నిలబడి కేకలు వేస్తున్నాడు. కోటీశు గూడా అంతకు తగ్గలేదు. ఈ వ్యవహారం ప్రెసిడెంటు దగ్గరే పరిష్కారమయ్యేది. కానీ అతను మిషనరీ కొనుగోలుకు పట్నం వెళ్ళాడు రెండోసారి.

"నా సెల్లెల్ని దొంగతనంగా పెళ్ళిసేసుకున్నాడు. సిగ్గులేని యెదవ... ఒసే రాయే పోదాం..." అరుస్తున్నాడు.

భయం గుండెలతో కోటీశు పక్కన నిలబడి వుంది లచ్చి

"ఒరేయ్ సచ్చిపోయిన మీ అయ్య, మీ అమ్మ; మా యయ్య, మా యమ్మ సిన్నప్పట్నుంచీ అది నా పెళ్ళామని సెప్పిపోయినార్రా. నేను దొంగతనంగా పెళ్ళిచేసుకోలేదు. దేవుడిదగ్గరే పెళ్ళిసేసుకున్నాను. కావాలంటే రవిబాబు, శారదమ్మలు గూడా వున్నారు" అన్నాడు నిన్నటిరోజు వెంకటరమణమూర్తి ఫోటో దగ్గరే తాళి కట్టినట్టు గుర్తుంది. జనం అంతా యిద్దరి వాదనలు వింటున్నారు. కొంతమంది సినిమా చూస్తున్నంత వినోదంగా చూస్తున్నారు.

"నా కవేం తెలువవు, నా సెల్లెల్ని మరేదగా నా కొప్పగిస్తే సరేసరి. లేకపోతే యేటి జరగాలో అదే జరుగుద్ది" అని భయపెట్టాడు సాంబడు.

"అదేటో నానూ సూస్తాను" అన్నాడు.

"ఏటి సూస్తావురా ! నంజ..." సాంబడు మాట పూర్తికాలేదు కోటీశు కర్ర ఎత్తాడు.

హఠాత్తుగా రెండు కర్రలమధ్యా రవి నిలబడి ఆపాడు. ప్రజలంతా ఆశ్చర్యపోయారు.

"యెందుకు ఈ తగవులు? జరిగిపోయిందేదో జరిగిపోయిందిగా..." అన్నాడు.

"దీని కంతటికి కారణం నువ్వే బాబూ! నన్ను, నా సెల్లెల్ని యిడదీసేసావు" అన్నాడు రోషంగా సాంబడు.

"ఒరే ఆ బాబు నన్ని మాటలనీకు. కళ్ళు పోతాయి..." అన్నాడు.

"ఒరేయ్ సాంబా! నువ్వేన్నయినా అను. నేను పడతాను. కానీ వాళ్ళను విడదీయకు. అది మంచిది కాదు" అన్నాడు.

"అవును సాంబా నా మాట విను..." అంది శారద, ఈ సంగతి విని త్వరత్వరగా తయారయి వచ్చింది. ప్రజలంతా ఆ మాటకు వత్తాసు పలికారు. వొక్కడయిపోయాడు సాంబడు. మీ కేటండీ యెన్నైనా సెబుతారు మీ కో సెల్లెలుండి, ఆది మీ కిష్టంలేని పెల్లి సేసుకుంటే తెలుద్ది ఆ గుండెల్లో బాధ..." అన్నాడు గాద్గదికంగా.

శారద సాంబడి దగ్గరికి వెళ్ళింది.

"చూడు సాంబా! నీ చెల్లెలు లచ్చి కానిపనేమీ చేయలేదు. తన మనసుకు నచ్చినవాడిని పెళ్ళిచేసుకుంది. పెళ్ళిచేసుకున్నవాడు గూడా యువకుడు, అందగాడే కాకుండా ప్రయోజకుడు నీలాగే. అతనిని కాదని నువ్వు బహాశా యింకొకరితో నీ చెల్లెలి పెళ్ళి జరిపించినా, ఆమె జీవితం ఏమయ్యేదో ఆలోచించు" అంది అనునయిస్తూ.

"మీకేటి తెలుసు పంతులమ్మగోరు, నా కడుపు మంట. దానికి రెండోయేట అయ్యా, అమ్మా నాలుగునెల్ల తేడాతో సచ్చిపోతే నేనే దానికి అయ్యా, అమ్మా అయి భుజాలమీ దెక్కించుకుని పెంచినాను కానీ అదో యీ పొద్దు ఋసవాస ఘాతకురాలై, నాతో మాటైనా సెప్పకుండా ఆ తలమాసినోణ్ణి పెళ్లాడింది. నేనేటి దానికి తక్కువ సంబంధం తెచ్చినాను. పొన్నూరు పెంచలయ్య కొడుకు పదెకరాల మెట్ట, రైతోడ్ని కుదిర్చినాను. యిప్పుడు నా పరువేటిగాను. నా మాటేటిగాను..." అన్నాడు కళ్ళ నీళ్ళుపెట్టుకుంటూ, వెనక్కి తిరిగి.

"ఓరన్న! నన్ను చమించు..." అంటూ కాళ్ళు పట్టుకుంది లచ్చి ఏడుస్తూ. వాళ్ళిద్దరి మధ్యా అనుబంధంలాంటిది తన మనసు ఏమాత్రం నొవ్వకుండా, తనకెంతో స్వేచ్ఛనిచ్చి, కంటికి రెప్పలా కాపాడి పెంచిన అన్న. వాడి మనస్సు మరి మారదు. ఆ సంగతి తనకి తెలుసు.

"నీ కిష్టమయినది నీవు సేసినావు. మన కియ్యాలనుండీ యే సంబంధం లేదు..." అని కళ్లు తుడుచుకుంటూ, కాళ్ళు తప్పించుకుని వెళ్ళిపోయాడు.




పరిష్కారం అయిన తర్వాత యెక్కడి జనం అక్కడికి వెళ్ళిపోయారు. రవి శారదలు, కొత్త దంపతులకు ధైర్యం చెప్పి వెళ్ళిపోయారు. కోటీశుకు రెండెకరాల మెట్ట వుంది. దాంట్లో వేరుశెనగ మొదలైన అపరాలు పండిస్తాడు. ఒక చిన్న యిల్లు. అదే ఆస్తి. అప్పుడప్పుడూ కూలీ నాలికి వెళుతూ వుంటాడు.

ఒక ఆలోచనకు రెండో ఆలోచన తోడైనపుడు అది చాలా బలంగా అల్లుకుంటుంది. రవి గ్రామాన్ని యెలా చైతన్యవంతం చేయాలో ఒక ప్లాను శారద సహాయంతో వేసుకున్నాడు. వాళ్ళిద్దరి ఆలోచనలు, ఆశలు, తలంపులు అన్నీ జీవితంలో క్షీరనీర న్యాయంలా కలిసిపోయాయి. ముందు యువచైతన్యం సమీకరింపబడాలనుకున్నాడు. అందుకని యువజన సంఘం ఒకటి స్థాపించాడు. చిన్న సాంస్కృతిక కార్యక్రమాలు, తోలుబొమ్మలాటలూ, బుర్రకథలు, ప్రభుత్వ క్షేత్ర సమాచారశాఖ వేసే చిన్న చిన్న సినిమాలు యివన్నీ ఏర్పాటుచేయటం ప్రారంభించాడు.

ఆ సంవత్సరం వర్షాలు లేవు. గ్రామంలో కరువు విలయతాండవం చేస్తోంది. నూతిలో నీరు అంతంతమాత్రం అవసరాలు తీరుస్తోంది. కాని భుక్తి యెలాగ. అందరూ తిండి గింజలకు కామినాయుడి దగ్గరకు బంగారయ్య దగ్గరకు పరిగెట్టారు. గ్రామంలో సమీకరింపబడిన శక్తులు, బ్రతుకుకోసం విడిపోక తప్పలేదు. శారద దగ్గర, రవి దగ్గర యేముంది, మంచితనం తప్ప. అవి జీవితాన్ని నిలబెడతాయా ?

కామినాయుడు తనద్వారా, బట్వాడా చేయవలసిన చౌక డిపోల బియ్యం, పంచదార, గోధుమలు, కోటాలు, కొన్ని పట్నంలో అమ్మి, కొన్ని

బంగారయ్యకు అమ్మి సొమ్ము చేసుకునేవాడు. బంగారయ్య అదే సరుకుని రెట్టింపు ధరకు ప్రజల కమ్మేవాడు.

ఒకనాడు జీపు వచ్చి ఆగింది. అందులో ఆఫీసర్లు దిగారు, రవి పెట్టిన పిటిషనుమీద. కామినాయుడిమీద ఎంక్వయిరీ జరిగింది. తగిన సాక్ష్యాధారాలతో కామినాయుడి దొంగతనం బయటపడిపోయింది. వాళ్ళు రికార్డుచేసుకుని వెళ్ళిపోయారు. పండినపండు దీనబంధు జీవితం నేలరాలిపోయింది. శారద యెంతగానో దుఃఖించింది రవి ఓదార్చాడు.

"ఆ దీనబంధే నీ కడుపులో పడ్డాడేమో" అన్నాడు రవి. ఆ రోజు శారద నెల తప్పింది ఆమె మరీ అందంగా వుంది. బరువుపను లేపీ చేయనీయటం లేదు. లచ్చి గూడా కడుపుతో వుంది. అయినా పనికి శారద దగ్గరకు వస్తూనే వుంది.

"దానికేటి తినాలనుంటే సెప్పమనండమ్మగోరు. నేను పట్నం యెళ్ళి తీసుకొత్తాను" అన్నాడు కోటీశు శారదతో.

"చెప్పవే" అంది శారద, నవ్వి లచ్చి కాఫీ పెడుతోంది.

"నా కే టక్కర్లేదండి..." అంది కోటీశువంక కోరగా చూసి.

"రేత్రి గూడా అడిగానండి. కాని అది సెప్పటంలేదు. కాని దాని మనసులో యేటో వుందండి. నా కనుమానమే" అన్నాడు కొంచెం నిష్ఠూరంగా.

"ఉట్టి మనిషివి కూడా కాదు. తప్పకుండా చెప్పు" అంది శారద మరోసారి హెచ్చరిస్తూ.

"నే సెప్పినా ఆడు తీరసలేదండి..." అంది నీరసంగా కాఫీలో పంచదార కలుపుతూ.

"అద్దదీ సుశారా అమ్మగోరూ! దారికొచ్చింది" అన్నాడు సంతోషంగా. లచ్చి కోసం యేం కావాలన్నా తేవడానికి సిద్ధంగా వున్నాడు.

"మరయితే చెప్పు..." అన్నాడు తలస్నానానికి వెళ్ళబోతూ.

"మరయితే నాకు...నాకు..." కొంచెం బెంగగానే చూసింది కోటీశువేపు

"ఊ...చెప్పు..." అంది శారద.

"నాకండి...మరి...మరి మా యన్నను సూడాలనుందండి" అంది కొంచెం భయంగానే

శ్రోత లిద్దరూ నిరుత్తరు లయ్యారు. కోటీశుకు కొంచెం కోపం ఎక్కువ. కానీ గర్భిణీ భార్యను యేమనలేకపోయాడు.

"అంతగా సూడాలనుకుంటే ఆడింటి కెళ్ళు. ఆడు నరికి పోగులెడితే నేను కాళ్లమీద బుర్రమోపి యేడుత్తూ కూకుంటాను" అన్నాడ .

"ఛీ! మీ అన్నయ్య కోపం చాలాకాలం వుండదు. నీ కడుపు నో నఖను పుడితే వాడంతా మరిచిపోయి చెల్లెలన్న ఆప్యాయతతో దగ్గరవుతాడు. అయినా నేను పిలిపించి చెబుతాను" అంది అనునయంగా.

"మీ రలాంటి ఆశలేపీ పెట్టుకోకండమ్మా. వాడి కోపం, పట్టుదల నాకు బాగా తెలుసు ఆడు పెసిడెంటు కాలవొగ్గేస్తే కానీ బాగుపడడు" అన్నాడు కోపంగా

యింతలో బయట శారదను యెవరో పిలిచినట్లయితే కోటీశు బయటకు వెళ్ళాడు. వెంటనే తిరిగి వచ్చి "అమ్మా మీకోసం స్కూళ్ళ యినస్పెక్టరు వచ్చారు" అన్నాడు. శారద బయట అరుగుమీద కుర్చీ వేయించింది. యినస్పెక్టరు కొంచెం వయస్సు మళ్ళిన వ్యక్తి. ఆయనకు కాఫీ యిచ్చింది.

"చూడమ్మాయ్! స్కూలు టీచరు అంటే ఒక పవిత్రమైన ప్రజా శ్రేయస్సును కాంక్షిస్తూ పిల్లలను భావి భారత పౌరులుగాను, నీతిమంతులుగాను, క్రమశిక్షణాయుతంగాను చదువు నేర్పే గొప్ప బాధ్యత గల వుద్యోగం. అలాంటి బాధ్యతలు తీసుకొన్న మనం...అవినీతికరంగాను, అసహ్యకరం గానూ, విశృంఖలంగానూ ప్రవర్తిస్తే మనం చేసే ఉద్యోగపు పవిత్రత చెడుతుంది" అన్నాడు ఉపోద్ఘాతంగా కాఫీ సిప్ చేస్తూ.

''మీరు యేం చెబుతున్నారో నా కర్థం కాలేదు'' అంది శారద.

"నేను నీకు తండ్రిలాంటివాడిని. డైరెక్టుగా స్కూలుకే వెళ్ళివుండేవాడిని. నా అఫీషియల్ హోదాలో. కానీ అసలు ముందుగానే నిన్ను వయస్సుమళ్ళిన వాడిగా మందలించి సలహా యిద్దామని వచ్చాను..." అన్నాడు కాఫీ త్రాగటం పూర్తిచేసి

''యింతకీ సంగతేమిటో చెప్పండి" అంది శారద కొంచెం అసహనంగానే.

''యిప్పటికాలం యువతీ యువకులకు ఉద్రేకం యెక్కువ. జీవితాన్ని సమంగా అర్థంచేసుకోరు. నీవు అవినీతిగా ప్రవర్తిస్తున్నావని, ప్రెసిడెంటు కామినాయుడు నీ మీద రిపోర్టు పంపాడు. అతని వాదన యెంతవరకూ సమంజసమో తర్వాత ఆలోచిద్దాం...యిలాగయితే త్వరలో నీవు...'' సగం లోనే ఆగిపోయాడు. రవి అప్పుడే స్నానంచేసి తల తుడుచుకుంటూ బయటకు వచ్చాడు.

"వీరు నా భర్తగారు. పేరు రవి. కామినాయుడిగారి అబ్బాయి..." అని పరిచయంచేసింది యినస్పెక్టరుగారికి.

ఆ ఎంక్వయిరీ ఆఫీసరు స్తబ్దుడైపోయాడు. రవి నమస్కారం అందుకుంటూనే, అతనికి నోట మాట రాలేదు.

"మేం యిద్దరం ప్రేమించి పెళ్ళిచేసుకున్నాం. యిది కిట్టనివాళ్ళు, వాళ్ళ కోరికలు కొనసాగనివాళ్ళు యెలాంటి అభాండాలయినా వేయడానికి వెనుదీయరు" అంది.

"సారీ! శారదా! నేను పొరబడ్డాను" అంటూ కామినాయుడి రిపోర్టు అక్కడే చింపేసి శలవుతీసుకొని వెళ్ళిపోయాడు.

యెదురుగా పోస్టు బంట్రోతు వచ్చి ఒక కవరు యిచ్చాడు. రవికి ఆశ్చర్యం వేసింది, తనకెవరు రాసి వుంటారని. ఆతృతగానే విప్పాడు. అది చదివి అతని ముఖం వికసించింది. గవర్నమెంటువారు రవిని చౌకడిపో నడపమని యిచ్చిన వుత్తరం.

ఊళ్లో అందరికీ అది కర్ణపేయమైన వార్త. అయితే, కామినాయుడికి విద్యుద్ఘాతమే అయింది. తన నెవరో కొల్లగొట్టుకొని పోతున్నంతగా బాధపడి పోయాడు. కోమటి బంగారయ్య యింట్లో శవం పోయినంతగా గగ్గోలు పెట్టేసాడు, కామినాయుడి దగ్గర.

"నా సెల్లెల్ను నానుండి యిడదీసారు. యీ పొద్దు మీ పరువునే బజార్లో పెట్టేసారు. నన్నేటి సెయ్యమంటారో సెప్పండి. తాడో పేడో తేలిసేస్తాను" అని రంకెలు వేసాడు సాంబడు. కాని కామినాయుడు తొందరపడలేదు. అతని గుండెలోపల సెగలు పొగలు కక్కుతున్నా తమాయించుకున్నాడు.

"పెజల్ని బాగుసేస్తామంటున్నాడు. బాగుసెయ్యనీరా! యేటి సేస్తాడో మనం సూద్దాం" అన్నాడు నిదానంగా చుట్ట వెలిగించుకుని, అవకాశంకోసం యెదురుచూస్తూ.

శ్రావణ భాద్రపద మాసాలు వెళ్ళిపోయాయి చిటుక్కున చినుకు చుక్క లేదు. తర్వాత మాసాలు వచ్చాయి. తక్కిన ఋతుధర్మాలలో మార్పు లేదు. అపరాల గింజలు విత్తనాలు జల్లడానికి యేమాత్రం పదునులేదు భూమికి. పశువులు ఎండిపోతున్నాయి.

అసిరయ్య తన కొంద్రముక్కమీద కూర్చుని ఆకాశంవేపు ఆశగా చూసేవాడు. అక్కడో తెల్లని మేఘం ముక్క, యిక్కడో నల్లని మబ్బుతునక,

అలా...అలా...అల్లుకునే, ఆకాశాన్ని నలుపుచేసేది. వాడి మనస్సు ఆనందంతో గెంతేది. "పొదాలమ్మా తల్లీ వొరసం సుక్క పడించు తల్లీ. నీకు కోడిపెట్ట బలేస్తాను..." అని మొక్కుకునేవాడు.

కాని మేఘాలు అతని ఆశ నిరాశ చేసేవి మరుభూమిలా వున్న కొంౘ ముక్కను చూసేవాడు. యింట్లో అంబలి కాచుకోవడానికి చోడిగింజలు లేవు. మరి వరి కూడు సరేసరి. తనలాంటి వాళ్ళెందరో ఆ వూళ్లో.

"ఏటి ఈ కొంౘమీద కూకుంటే కాలం తీరిపోద్దా. వొరసం పడిపోద్దా. గుడిసెకు రా అయ్యా" అంది ఆ రోజు అంబలి తెచ్చిన మంగ. తండ్రిని కోప్పడింది.

అసిరయ్య సమాధానం చెప్పలేదు. ఎండలో వాడు నల్లగా మాడిపోయి వున్నాడు. నుదుటమీద నుండి చెమట కారుతోంది. ఎముకల గూడుమీద నల్లని చర్మం కప్పి తయారుచేసిన బొమ్మలా వున్నాడు, ఆ ఎండలో.

"యింతకీ పైస లెక్కడివే..." అడిగాడు మంగను తేరిపార చూస్తూ. గతరాత్రి నుండి వాడి దగ్గర చిల్లిగవ్వ లేదు. అంతకాలం ఆదుకుంటున్న రవిని అడగడానికి మనసు పోలేదు. బంగారయ్య చెంబో గిన్నో తాకట్టు పెడితే గానీ యివ్వడు. కామినాయుడి దగ్గరకు వెడితే ఆ ఆలోచనే విరమించు కున్నాడు. అతను తన కొంౘ గురించి తప్ప యింకోటి మాట్లాడడు. ఎటు పోయి ఎలా వస్తుందో అని వెళ్లలేదు. అసిరయ్య ప్రశ్నకు మంగ సమాధానం చెప్పలేదు.

"ఏటే గుంౘాయిలా మాట్లాడవు. పైసా లెక్కడివే..." గదిమాడు కోపంతో.

"పెసిడెంటుగోరి సాల్లో నేనూ, మన పొరుగింటి పుల్లమ్మ పిడకలు సరిసాం. కూలికి సోళ్ళు కొలిసారు..." అంది భయంగా. తండ్రి అంటే చాలా భయం.

"యెత్తే యెల్లావుగానీ, వొక్కత్తివీ యెల్లకు. అసలే ఆయన మంచోడు కాదు..." అన్నాడు తేలికయిన గుండెలతో. వాడి భయం వాడిది గుండెలమీద కుంపటిలా యెదిగి కూర్చుంది. తల్లిలేని పిల్ల. దాన్నో అయ్య సేతిలో పెట్టాలి, తను మట్టిలో కలిసిపోయేలోగా.

సత్యవరం గ్రామం, అభివృద్ధిపథంలో పురోగమించడానికి ప్రయత్ని స్తోంది. రవి శారదలు తమ తమ శక్తినంతా ధారపోసి కృషిచేస్తున్నారు. గ్రామ ప్రజల్లో స్తబ్దత వదిలింది. ప్రతి విషయాన్ని ఆలోచించటం నేర్చుకుం టున్నారు.

వయోజన పాఠశాలలో రామాయణం, భారతం, భాగవతం యివన్నీ పూర్తి అయినాయి. ఒకటో క్లాసు పుస్తకాలు చదవటం, అంకెలు కూడటం, హెచ్చువేయటం, దశలను చాలామంది యువజనులు దాటిపోయారు. ఊళ్లో పంచాయితీ రేడియో వున్నా పలకదు. ప్రెసిడెంటుగారింట్లో దీర్ఘనిద్ర పోతూంది. మరి లేవదు. భారతదేశ స్వాతంత్ర్య చరిత్ర విడమరిచి సోదాహరణాలతో చెప్పారు ప్రజలకు.

దేశంలో జరుగుతున్న అనేక అభివృద్ధి కార్యక్రమాలు వినిపించేవారు వార్తాపత్రిక తెప్పించి చదివి వినిపించేవారు. కల్లు తాగటం, బానిసలుగా బ్రతకటం, వ్యక్తిత్వం కోల్పోవటం, రేపటి రోజుకోసం ఆలోచించకుండా వున్నదంతా ఆ రోజుకే తిని తాగి ఖర్చుచేయటం, తన మానసిక ఆనందంకోసమే బ్రతకటం కాకుండా పొరుగువాడి శ్రేయస్సుకోసం, సమాజంకోసం, దేశంకోసం మనం బ్రతకాలి, అన్న ఆలోచనల విత్తనాల్ని వాళ్ళ ప్రజల మనస్సుల్లో నాటారు. త్రాగుడు గూడా చాలామంది అసహ్యించుకుని మానేసారు. సారా బేరాలు పడిపోయాయి. యిది కంట్రాక్టు పాడిన కామినాయుడికి గోరుచుట్టుమీద రోకలిపోటు. తగిన అదనుకోసం పొంచివున్నాడు, గండుపిల్లిలా.

యెన్ని అభ్యుదయ కార్యక్రమాలు చేస్తున్నా రవి మనస్సు వూళ్ళో ప్రాథమిక అవసరం చుట్టూ పరిభ్రమిస్తూనే వుంది. నిపుణులచేత సగంలో ఆగిపోయిన నుయ్యి విషయంలో అభిప్రాయం కనుగొన్నాడు. అతనికి నిరాశే యెదురయింది. నీటి ఇబ్బంది ప్రజలపరంగా ప్రభుత్వానికి యిదివరలోనే తెలియజేశాడు. రెండోసారి రాస్తే తగుచర్యలు త్వరలో తీసుకోగలమని హామీ పత్రం వచ్చింది. హరిజనులకు త్వరలో మిగులుభూముల్ని వెంటనే పంచాలని గూడా ప్రభుత్వంకు మహజరు పెట్టాడు.

చైత్రం వచ్చింది. శారదకు తొమ్మిదినెలలు నిండబోతున్నాయి.

"నాకు బాబు కావాలి"

"నాకు పాప కావాలి."

ఆ యిద్దరి దంపతుల మధ్య చిన్న చిన్న వాగ్వివాదాలు.

"పోనీ యిద్దర్నీ కనీ..."

"అబ్బా యెంతాశ..."

ఆ దంపతుల నవ్వులు, ఆమని కోయిలకూజితాలలో స్నేహంచేసి, అలాగే కోటీశు, లచ్చి చిరుకలహాలు. లచ్చి కానాటినుండి అన్న కనబడలేదు. సాంబడు

ఆ నోటా ఆ నోటా చెల్లి కడుపుతో వుందని విన్నాడు. కాని వాడి గుండె బండరాయి అయిపోయింది.

* * *

చైత్రం తెచ్చిన చైతన్యంలో

చైత్ర ధూళి రేగుతోంది. చైత్ర ధూళిలోనే ప్రజలకు, త్వరలో పంచాయతీ యెన్నికలు జరుగుతాయని ప్రభుత్వం ప్రకటించింది.

కామినాయుడిలో భయం, దుమారం రేగడం ప్రారంభమైంది. బంగారయ్య, సాంబడు ప్రజానాడిని తెలుసుకున్నారు. యెంతకాలం పరిపాలించగలరు నియంతలు ప్రజల్ని బానిసలుగా.

చైత్రంలో చైతన్యం పుంజుకుంది. ప్రజ యెవడు భక్షకుడో, యెవడు రాక్షసుడో, యెవడు స్నేహితుడో తెలుసుకోగల ఆలోచనా పరిధిని పెంచుకుంది. ఆ పరిధిలో రవి తప్ప మరెవ్వరూ లేరు.

"ఒకే మాట...ఒకే బాట...ఒకే బాణం..." శారద చెప్పిన దివ్య మంగళ స్వరూపమైన రఘురాముని చరిత్ర వారి హృదయాల్లో జ్ఞానదీపి కళికల్ని వెలిగించింది.

ఆ గ్రామానికి రవే ప్రెసిడెంటు కావాలని, రవి అభిప్రాయంతో సంబంధం లేకుండానే నిర్ణయించింది.

నీటి యెద్దడి మరి కొంచెం యెక్కువయింది. బంగారయ్య అప్పులివ్వటంలో కొంచెం నిబంధనలు సడలించాడు. కామినాయుడు తన దగ్గరకు వచ్చినవాళ్ల కష్టసుఖాలు విని యేదో సహాయం చేస్తాను. అన్నట్లుగా తియ్యని మాటలు చెప్పి పంపిస్తున్నాడు. సాంబడు సరేసరి. యిదివరకు వాడికి కళ్ళు నెత్తిమీద ఉండేవి. యెవరు పిల్చినా పొగరుతో, సమాధానం చెప్పేవాడు కాదు. ఇప్పుడు వూళ్ళో ప్రతివాడినీ ఏదో వరసపెట్టి పలకరిస్తున్నాడు.

వాళ్లలో మార్పు ప్రజలలో ఆశ్చర్యం కలిగించలేదు. యిదివరకు ఎలక్షన్లలో ఏకగ్రీవంగా గ్రామ ప్రజలంతా కామినాయుడికి జై కొట్టేవారు. అతను ఏనాడూ కనీసం ప్రజలకు కృతజ్ఞతలు చెప్పలేదు. సరికదా ప్రజారక్తాన్ని, శ్రామిక జీవితాన్ని జలగలా పీల్చేవాడు. ప్రజల నాడి కామినాయుడికి దొరకలేదు.

రవి మనసు అస్తవ్యస్తంగా వుంది. ఆ రాత్రి శారద నీరసంతో పడుకుంది. ఊరంతా ఎనిమిదిగంటలకే మాటుమణిగి పోయింది. వెన్నెల పిండారబోసినట్లు

వుంది. సగంవరకూ తవ్వి, రాతి పొరల మధ్య నిలచిన బావే అతని కళ్ళకు కనబడుతోంది. ఆడంగులు నీటి దగ్గర చిన్న చిన్న తగవులు అతనికి బాగా తెలుసు. యేం చేయాలో తోచలేదు. ప్రభుత్వం సహాయం అందేటప్పటికి వేసవి దాటిపోతుందేమో. ప్రెసిడెంటుకు ప్రజల నీటి యిక్కట్లు అవసరంలేదు. అతనా బాధ అనుభవించనక్కర్లేదు. అతనింట్లో చిన్న నంద నుయ్యి వుంది. అది అతని అవసరాలకు సరిపోతుంది. రవికి నిద్రపట్టలేదు. అతని మస్తిష్కంలో రాతి పొరల అడుగున అంతర్వాహినిలా జలజల పారే గంగ గలగలలు వినిపిస్తున్నాయి.

ఆవేదనావృతమైన మనస్సుతోనే లేచాడు. పల్లెమీదుగానే వెళ్ళాలి తవ్విన నూతి దగ్గరకు. పల్లె వెన్నెట్లో నిద్రలో జోగుతోంది. అక్కడక్కడా కుక్కల అరుపులు వినిపిస్తున్నాయి అతని కాళ్ళు ఒక గుడిసె దగ్గర అప్రయత్నంగానే ఆగిపోయాయి. ఆ ముంగిటిలో వొక చిన్న దీపం అటూ, ఇటూ వూగుతూ వెలుగుతోంది.

దాని ముందు బాసింపట్టువేసుకుని శ్రద్ధగా కిష్టిగాడు పుస్తకం చూసి, పేర్లు రాస్తున్నాడు. కాస్సేపలా నిల్చున్నాడు రవి. ముగ్ధుడైపోయాడు, వాడి దీక్షకు. జాతిని బట్టి విద్య అబ్బుతుందంటారు. కానీ ఏ సంస్కారం, ఏ జాతి వాడిని చదువుకోమని వెన్ను తట్టింది. జన్మతహః పుట్టిన బుద్ధి. ముంగాళ్ళ మీద వంగుని ఏమిటి రాస్తున్నావని సౌంజ్ఞ చేసాడు. వాడు రవిని చూసి లేచి దండం పెట్టాడు. ఆ వెలుగులోనే రవి స్కీతో నిండిన మలక కనిపించింది. అందులో ముద్ద మందారం మొగ్గలు కనిపించాయి రవికి.

కిష్టయ్య పలక చూపించాడు. పేర్లు రాసి వున్నాయి. గుండ్రంగా "బావి, బడి, బలపము, బంగము" అనే పేర్లు.

"బాగా చదువుకో..." అని వెన్ను తట్టి ముందుకు సాగిపోయాడు. వాడు వెడుతున్న రవిని ఆశ్చర్యంగా చూసాడు. అతను ఫర్లాంగు దూరంలో గల సగం తవ్విన బావి దగ్గర ఆగిపోవటం గమనించాడు.

కిష్టిగాడి ఏకాగ్రతకు భంగమే కలిగింది. రెండు గుడిసెలవతలే అసిరయ్య గుడిసె. అందులోనుండి గాజుల గలగలలు, నవ్వులూ వినిపించుతున్నాయి వాడికి ఏమిటో బోధపడలేదు. ఇలా వినడం వాడి కది మొదటిసారి. దూరంగా ముళ్ళజెముడు డొంకల మధ్య చిన్న యెరుపుదనం వెలుగుతూ కనిపించింది. కిష్టిగాడికి భయంవేసింది. తండ్రి పొరుగూర్లో కూలి పనికి వెళ్ళి యింకా రాలేదు.

"హరహర నారాయో..." అన్న పదం ముద్ద ముద్ద మాటలతో వినిపించింది. ఆసిరయ్య పదం పాడుకుంటూ వెన్నెల్లో కర్ర నూతగా తీసికొని నడుస్తూ గుడిసె తలుపుల్ని చేతితో తొయ్యటం కన్పించింది. తడిక తలుపులు వేసి ముసుగు తన్ని పడుకున్నాడు.

అంతే !

అసిరయ్య కేకలు విన్పించాయి. తడిక తలుపులు వేసి వున్నాయి. పంచె సర్దుకుంటున్న కామినాయుడ్ని పెద్దగా అరుస్తూ కర్రతో కొట్టబోయాడు. వివస్త్రిగా వున్న మంగ చటుక్కున చీర లుంగలుగా చుట్టుకుంది కామినాయుడు ఆ కర్ర పట్టుకొని మూలకు విసిరేసాడు. అసిరయ్యకు మత్తు దిగిపోయింది. పెళ్ళి కావాల్సిన తన కూతురు, కామినాయుడి కౌగిలిలో...వూహించలేకపోయాడు. ఆ రోజు ఉదయమే కూతురు మనువుకోసం పొరుగూరు వెళ్ళాడు, మర్నాడు, ఉదయంకు కానీ రానని చెప్పి. కానీ మనువు కుదర్లేదు. నెమ్మదిగా యింటికి చేరుకున్నాడు కాళ్ళీడ్చుకుంటూ.

మంగ గూడా ఈ పరిణామం వూహించలేదు. దాని ప్రాణాలు భయంతో కొట్టుకుంటున్నాయి. యెప్పుడో కామినాయుడి కామాగ్నికి బలైపోయింది. పట్టపగలు అంటరాని మనిషి. పిడకలు చరవడానికన్నా అర్హతలేని మనిషి. రాత్రి అనుభవాలకు మాత్రం పనికివస్తుంది, కామినాయుడికి. కానీ ఎంతకాలం దాగుతుందీ దొంగవ్యవహారం.

"సీ కులానికి తగ్గ బుద్ధికాదు పెసిడెంటూ. నేనా కూటికీ పేదోడ్ని, కులానికీ పేదోడ్ని – కాని నా కూతురు యింకో దగుల్బాజీ యెదవతో పోతూంటే సూస్తూ వూరుకుండే గుడ్డోడ్ని మాత్రం కాదు. నీ రగతం సూస్తా నివ్వాళ..." అరుస్తున్నాడు.

"పోరా ముసలి నాకొడకా! నువ్వేటి సేస్తావ్" అన్నాడు.

"మీరెల్లిపోండి బాబూ యీడనుండి—" అంటోంది భయంగా.

"ఏడ కెల్తాడే. ఈడి శవమే యీడనుండి యెల్తుంది కాట్లోకి..." అని విశ్వతక్షలిలా లంఘించాడు.

కామినాయుడు వాడి పెదరెక్కలు పట్టుకున్నాడు. రెక్కలు నొప్పెట్టిన పక్షిలా కిరికిరలాడాడు అసిరయ్య

"ఒరేయ్ నాయాలా ! నీరుండి దాన్ని నువ్వు సొంతం సేసుకొని దాసుకో గలవా; గాలుండి అంతా కూడబెట్టి దాసేసుకోగలవా! ఒరేయ్ అగ్గుండి అదీ

గూడా దాసుకోగలవా ! ఒరేయ్ ఎలుగుంది దాన్నరికట్టీగలవా ! యింకేటి భూముంది. అది మాతరం, నీ సొంతం సేసుకోగలవనుకుంటున్నావ్. దాని కోసం నా కన్నకూతుర్ని సెరిసేసి, మా బతుకులకు అగ్గెట్టేసి, అది నీ సొంతం సేసుకోవాలనకుంటున్నావ్...

"ఒరేయ్! నీ కల్లు మూ త లు ప డి తే, ఏదయితే నీదనుకుంటున్నావో అదేటీ నీ యెంట రాదురా! మడిసి మి గ ల క పో యి నా మట్టి మీద మంచీ, చెడే మిగుల్తుందిరా. యెదవ నాయాలా తెలుసుకో..." అసిరయ్య మరి మాట్లాడలేకపోయాడు. కామినాయుడి కబంద హస్తాలు వాడి సన్నటి పీక నులిమేసాయి. వాటి ప్రాణంలేని కట్టె భూమిమీద మిగిలింది.

యిదంతా సాంబడు చూస్తున్నాడు తలుపుకంతలోని చిరువెలుగులో. తండ్రి శవాన్ని చూచి మంగ ఏడ్వబోయింది. హఠాత్తుగా నాయుడు నోరు నొక్కేసాడు.

"ఉష్ గట్టిగా అరవకు. ముసలాడికి ప్రాణం పోతుందనుకోలేదు. నువ్వరిస్తే పల్లె అంతా లేస్తుంది. ముందు నా యింటికి పద. నీ కేం భయంలేదు. నేను నిన్ను పెళ్ళిచేసుకుంటాను..." కామినాయుడికి తెలుసు. ఆడదాని బలహీనత. దాన్నిక్కడ వుంచితే యెంత గొడవ జరగాలో అంత గొడవా జరుగుతుంది. ఊళ్లో జనం విషయం తనకి తెలుసు. నమ్మలేనట్లుగా చూసింది మంగ.

"సచ్చినోడుతో పాటు నువ్వు యేడుస్తూ కూర్చుంటే నీ బతుకు బాగుపడుద్దా. ఆడెందుకు సచ్చేడని ఆరాలు తీస్తే నిన్నక్కడుంచుతారా! నా మాట యిను. నీ మంచికే సెబుతున్నా...పద" అని తండ్రి గుండెలమీదనుండి బలవంతంగా లేవదీసాడు.

"బాబూ! మనం బేగే యీడనుండి కదలాల. మీ కుర్రోడు బావినుండి తిరిగొస్తున్నాడు. అలికిడయితే పసిగట్టేస్తాడు..." అన్నాడు తలుపు తోసుకుంటూ. తిరిగి బయటకు చూచి "బాబూ దగ్గిరపడిపోయాడు" అంటూ తలుపు లాగి లైటార్పేసాడు.

రవి అడుగుల చప్పుడు అసిరయ్య గుడిసె దగ్గిర ఆగిపోయింది. బ్రతికున్నవారి ముగ్గురి గుండెల్లో రాయి పడిపోయింది. చెమటలే పోసాయి. అంత కటికచీకటిలోనూ.

"అసిరయ్యా ! అసిరయ్యా !..." రవి పిలుపు. రెండు క్షణాలు నిశ్శబ్దం.

"అసిరయ్యా ! అసిరయ్యా !..." రవి గట్టిగా పిలిచాడు.




కామినాయుడు మంగ చెవిలో ఏదో చెప్పాడు.

"యెవరూ—" అడిగింది మంగ.

"నేనురా రవిని. ఆసిరయ్య వున్నాడా ?"

"వున్నాడు బాబూ ! నిసాలో తొంగున్నాడు" అంది జీరబోయిన గొంతుకతో.

"సరేలే అయితే. లేపకు. రేపు ఉదయం నన్ను ఒకసారి కలవమను" అని నడిచి వెళ్ళిపోయాడు.

కొన్ని నిముషాల తర్వాత తడిక తలుపు కిర్రుమంది. సాంబడు బయటకు చూసాడు. యెవ్వరూ కనిపించలేదు. ముగ్గురూ దొడ్డి త్రోవన కామినాయుడి మేడకు చేరుకున్నారు.

లైటు వెలుతుర్లో కామినాయుడు కంపెనీ చుట్ట ముట్టించుకున్నాడు. అటూ యిటూ గడియారంలో పెండ్యులంలా పచార్లు చేస్తున్నాడు. సాంబడు, కామయ కదలికల్ని చూస్తూ నిల్చున్నాడు. సాలలో గొడ్లు అటూ యిటూ కదుల్తున్న శబ్దం, దూరంగా తీతువపిట్ట అరుస్తున్న అరుపు వినిపిస్తున్నాయి వాడికి. మంగ అవతలి గదిలో యేడుస్తూ కూర్చుంది. తండ్రి మరణానికి అంతకన్నా ఏమీ చేయలేని దుస్థితిలో వుంది.

మెరుపులాంటి ఆలోచన తట్టింది. వెంటనే తెల్లకాగితాలు తీసాడు. మంగ గదిలోకి వెళ్ళాడు.

తెల్లవారింది. శారద లేచి తలారా స్నానంచేసి, దేవుని ముందు దీపం పెట్టింది. కడిగిన స్ఫటికంలా వుంది శారద. రవి యింకా నిద్రలేచి ముఖం

కడుక్కుంటున్నాడు. తలుపు తట్టిన చప్పుడు వినిపించింది. కిష్టిగాడు పువ్వులు తెచ్చి వుంటాడనుకొని తలుపు తీసింది. కాని వచ్చింది వాడు కాదు ఆశ్చర్య పోయింది! యెదురుగా పోలీసు సబ్ ఇనస్పెక్టర్, యిద్దరు కానిస్టేబుల్సు.

"యెవరు కావాలండీ."

"యిది రవిగారి యిల్లేనా ?—"

"అవునండీ. రండి కూర్చోండి." కుర్చీ చూపించి చెప్పడానికి లోపలికి వెళ్ళింది. రవి ఆశ్చర్యపోతూనే సబ్ యినస్పెక్టర్ దగ్గరికి వచ్చాడు. గుమ్మం అవతల జనం మూగివున్నారు. పోలీసు కానిస్టేబుల్సు యిద్దరూ, వాళ్ళని గుమి గూడవద్దని హెచ్చరికలు చేస్తున్నారు.

"క్షమించండి. మీరు నిన్న రాత్రిగాని మాలపల్లెలో అసిరయ్య గుడిసె దగ్గరకు వెళ్ళారా ?" అడిగాడు, సబ్ యినస్పెక్టరు.

"ఆ, వెళ్లానండీ..." అన్నాడు ఆశ్చర్యంతో.

"వెళ్ళి ఏంచేశారో చెప్పగలరా ?"

"మేం ఒక బావి తవ్వాం. అందులో నీరు పడలేదు. రాయి పడింది. నిన్న రాత్రి మళ్ళా బావి దగ్గరకు వెళ్ళాను. యిప్పటికే విపరీతమైన నీటియెద్దడి అనుభవిస్తున్నాం. యీ నుయ్యి కాస్త ఎండిపోతే రెండుమైళ్ళ దూరంలో కాని నీరు లభించే సూచనలేదు. వున్నా అక్కడ వాళ్లు యిస్తారో, యివ్వరో ? అందుకని బావి యెలాగయినా తవ్వాలని కూలీకోసం అసిరయ్య దగ్గరకు వచ్చాను" అన్నాడు

"రాయిపడిన బావి తవ్వగలరా యెవరయినా ?" యెదురు ప్రశ్న.

"నిజమే ననుకోండి ఏదో ఒక గుడ్డి విశ్వాసం. నలుగురం కలిస్తే ఏదైనా మార్గం దొరకదా ?"

"మీరు చెబుతున్నది నిజమని నేను నమ్మవచ్చా ?" అనడిగాడు సబ్ యినస్పెక్టరు. చదువు, సంస్కారంగలవ్యక్తి లాకనిపిస్తున్నాడు, కాబట్టి పోలీసు జులుం వుపయోగించలేదు.

"నిజమేనండి. యింతకీ యివన్నీ యెందుకు అడుగుతున్నారో తెలుసుకో వచ్చా" అనడిగాడు.

"యేంలేదు. మీ మీద నేరం మోపబడ్డది," అన్నాడు దృఢంగా లేస్తూ.

"మీరనేదేదో నా కర్థంకాలేదు" అన్నాడు రవి.

"అవునండీ, నిన్నరాత్రి మీరు అసిరయ్య గుడిసెకు వెళ్ళారు. మంగను

బలాత్కారించారు. ఆమె కేకలు వేసింది. యింతలో ఆమె తండ్రి లేచాడు. మీ యిద్దరికీ ఘర్షణ జరిగింది. యెక్కడ గొడవ జరుగుతుందోనని అతనిని పీక పిసికి చంపేసారు మీరు..." అన్నాడు.

"యిది అబద్ధం..." గట్టిగా అరిచింది శారద, వణికిపోతూ.

"అలాగని ఆసిరయ్య కూతురు మంగ రిపోర్టు యిచ్చింది ప్రెసిడెంటుగారు రాత్రికి రాత్రి మాకు రిపోర్టిచ్చి పంపారు."

"యేది యెలాగవున్నా మిమ్మల్ని కస్టడీలోకి తీసుకోక తప్పదు" అన్నాడు.

రవి అధైర్యపడలేదు. యేదో ఒక ప్రమాదం తండ్రినుండి యీ ఎలక్షన్లు అయిపోయేలోగా యెదుర్కోవాలని అనుకున్నాడు. కాని ఏ రూపంలో వుంటుందో తెలియదు కాని యిప్పుడు తెలుసుకున్నాడు.

ధైర్యంగా వుండు శారదా! అంతా మన మంచికే జరుగుతుంది అనుకో. కన్నీళ్ళు పెట్టకు. పట్నంలో నాకో లాయరు స్నేహితుడు వున్నాడు. అన్నీ నేను చక్కదిద్దుకొని వస్తాను .." అన్నాడు. పోలీసుల మధ్య నడుస్తూ.

ఉదయ కిరణాలు వెలుగును నింపేసాయి. ఆ వెలుగులో, రవికి సంకెళ్ళు వేయబడ్డాయి. ప్రజలమధ్య పోలీసులు వెంట రాగా నడుస్తున్నాడు.

యెవరి జ్ఞానపు శృంఖలాలు తెంచి మానవులుగా తయారుచేసాడో, ఆ మానవుల మధ్యనే, అన్యాయపు సంకెళ్ళు అతనికి వేయబడ్డాయి. హత్యానేరం గూడా మోపబడింది. కనుపించని న్యాయం 'అతనాపని చేయలేదు. యిదంతా ప్రెసిడెంటు కామినాయుడి కుట్ర' అని ప్రజలలో వున్న నమ్మకం రెండే అతని వెంట వున్నాయి. మూగగా వాళ్ళకి శారద చెప్పిన జీసస్ క్రీస్తు, లింకన్, మహాత్మాగాంధీ మొదలైనవారి దివ్యచరిత్రలు జ్ఞాపకం వచ్చాయి.

కోటీశు సరేసరి. కళ్ళమ్మట నీళ్ళు పెట్టుకుంటున్నాడు. యెవరు చేసారో అందరికీ తెలుసు కాని దానికి తగిన సాక్ష్యం లేదు. యువజన సంఘంలో వ్యక్తులు గూడా యెవ్వరూ యేమీ మాటాడలేకపోయారు కామినాయుడు తీవు దగ్గరవుండి మిగిలిన పోలీసులకు కాఫీ తెప్పించాడు. తనూ ఒక కాఫీ తాగుతున్నాడు. అతని మనస్సు యెంతో ఆనందంతో గెంతులు వేస్తోంది. ఒక దెబ్బకు రెండు పిట్టలు. వొకటి రవి, రెండోది ఆసిరయ్య భూమి.

"నానెంతకాలం పెసిడెంటుగిరి సేస్తున్నానంటే కారణమేమిటండీ ఖచ్చితంగా వుంటాను పెజల కష్టమే నా కష్టము. ఆళ్ళ సుకమే నా సుకం. ఆళ్ళని కంటికి రెప్పలా కాపాడుతుంటాను. ఆడు నా కన్నకొడుకే కదుపుతీవి నేదంటారా?

వుంది. కాని నేయవో నా పెజ లేటనుకుంటారు. ఈడికయితే వొక నేయ యింకోడికయితే యింకో నేయవూ. దుమ్మెత్తి పోసేస్తారు..." అని లెక్చర్ కొడుతున్నాడు ఒక పోలీసు 'హంతకుడు మీ అబ్బాయని తెల్సింది' అన్న మాటకు

యినస్పెక్టరు రవి రాగానే, ఆ వాగ్ధోరణి కట్టిపోయింది రవి కోటీశుని దగ్గరగా పిలిచి "శారదకు ధైర్యంచెప్పు కోటీశూ. నాకేం భయంలేదు. న్యాయం నా వైపు వుంది" అన్నాడు. కోటీశు పసివాడిలా వలవలా యేడ్చేసాడు. రవి గూడా కన్నీళ్ళు తిరిగినాయి.

"మీరు అవసరమయితే స్టేషనుకు రావల్సి వుంటుంది, ప్రెసిడెంట గారూ..." అని చెప్పి జీపు యెక్కిపోయాడు. జీపు కదిలింది, రవిని తీసికొ ప్రజలందరికన్నీటి వీడ్కోలు మధ్య. సాంబడు బాణాకర్రతో నిలబడి గర్వంగ ప్రజలవేపు చూసాడు. వాళ్ళంతా వెనక్కి తిరిగిపోయారు.

"ఒరేయ్ సాంబా! యింకెయ్యమన్నా యెవరితోను యెవవ వేసా యేస్తాదో యెయ్యమను ..నాను సూస్తాను," అన్నాడు కోపంగా. యెవ్వరు మాట్లాడలేదు.

"ఒరేయ్ సాంబా! యింక మనం ఈ నా కొడుకుల్నందర్నీ ఒక కం సూడాలి. ఎలచ్చన్లు దగ్గర కొచ్చేతున్నాయి," అన్నాడు కసిగా.

"యింక మీ కడ్డేది బాబూ ఈ పెజం కందరికీ తవరే దిక్కు తవరే ఈ వూరి పెసిడెంటు..." అన్నాడు గర్వంగా.

కామినాయుడు సంబరపడిపోయాడు.

అక్కడ యువజనసంఘం మరికొంతమంది శారద దగ్గర వున్నారు శారద మరీ నీరసంగా వుంది. అయితే ముందు కొంతమంది అధైర్యంగా వున్నా తర్వాత దీనబంధు చెప్పిన సూక్తుల వలన కొంచెం ధైర్యం తెచ్చుకుంది.

"అమ్మా లచ్చి మీ కాడుంటుంది. నాను,మరో యిద్దరం పట్నం యెల్తొత్తాం బాబుగోర్ని యిడిపించుకుని తీసుకొత్తాం." అన్నాడు కోటీశు వాడు రవితో ఒకటి, రెండుసార్లు పట్నం వెళ్ళినపుడు లాయరుగారింటికి వెళ్ళాడు. శారద తల వూపింది.

"లచ్చి మీ కాడ సాయం వుంటుంది." అని లచ్చికిచెప్పి వెంటనే బయల్దే పోయాడు కోటీశు.

యెవరయితే తన కడ్డమనుకున్నాడో వాడ్ని తొలగిస్తే ప్రజలందరూ తన

వేపు మొగ్గుతారు. తన కాళ్ళు పట్టుకుంటారన్న ఆశ, కామినాయుడి విషయంతో తలక్రిందులయింది. ప్రజలందరూ కుతకుత వుడికిపోతున్న అగ్నిపర్వతాల్లా గంభీరంగా వున్నారు.

వారికి ఆ రోజు సంకెళ్ళతో బేడీలు వేసి తీసికెళ్ళబడిన రవే మనస్సులో మెదుల్తున్నాడు. వాళ్ళ మనస్సులో కామినాయుడిమీద చెదపురుగును, చీడ పురుగును చూసేటంత అసహ్యం పేరుకుపోయింది. ప్రజల నాడి కనిపెట్ట లేనంత మూర్ఖుడు కాడు. ఆ గ్రామంలో తన్ని యెదిరించగలిగేవాడు రవితప్ప మరెవ్వరూలేరు.

సాంబడు చెప్పాడు. కోటీశు మరికొందరు కలిసి రవిని బెయిలుమీదవిడిపించుకు రావడానికి వెళ్లినట్లు; అందుకని కామినాయుడు పట్నం వెళ్ళాడు. పబ్లిక్ ప్రాసిక్యూటర్ని కలిసి, లేనిపోని నేరాలు చెప్పి, రవిని విడిపిస్తే యింక పిచ్చి కుక్కయి గ్రామాన్ని కాల్చేసి హరిజనవాడని తగలబెట్టి, బంహీనవర్గాల్నే కాక, దొరికినంతమందిని కసితో యేమయినా చేస్తాడని, అందువలన బెయిలు యివ్వ కుండా వుండేటట్లు యేర్పాటు చేయమని, మరీ మరీ చెప్పాడు.

అలాగే రవికి యెంత ప్రయత్నించినా బెయిలు యివ్వలేదు. రవి మిత్రుడు పై కోర్టులో ప్రయత్నించి ఒక పదిహేను రోజుల్లోగా బెయిలుమీద రవిని విడుదల చేయిస్తానని చెప్పి కోటీశును పంపించేసాడు.

శారద ఆ విషయం విని సంతోషించింది. మంగకోసం ఒకటి రెండుసార్లు ప్రయత్నిస్తే, మంగ మాలపల్లెలో లేదని తెలిసింది అసలు సంగతేమిటో మంగద్వారా రాబట్టవచ్చని శారద తీవ్రంగా ఆలోచించింది కాని కామినాయుడు మంగను యేంచేసాడో తెలియలేదు. కోటీశు ప్రయత్నించాడు కానీ జాడ కనుక్కోలేకపోయాడు.

శారద రవి రాక కోసం ప్రతిరోజూ యెదురు చూస్తూవుంది. ఎలక్షన్లు దగ్గర పడబోతున్నాయి గ్రామ గ్రామాల్లో సంరంభం అంతో యింతో కనుపిస్తుంది. రవే గ్రామ ప్రజలందరికీ ఆమోదకరమైన వ్యక్తిగా వాళ్ల హృదయాల్లో మెదుల్తున్నాడు.

ఆ రోజు పదకొండు గంటలయింది. శారద బడి వదిలేసింది. కిష్టయ్య బల్లలు సర్దేసి, చిన్నగా బడి పెరటి తలుపులు వేస్తున్నాడు. శారద రికార్డు లన్నిటినీ భద్రంగా టేబిలు సొరుగులో పెడుతోంది. అడుగుల చప్పుడు వినబడితే తలయెత్తి చూసింది. కామినాయుడు! శారద నాగుపామును చూసి నంతగా భయపడింది. అతను ద్వారం దగ్గర నిలబడ్డాడు.

శారద కోపం పట్టలేకపోయింది.

"యింకా యేం చేయాలని వచ్చారు...?" అడిగింది తీవ్రంగా. నవ్వేసాడు కామినాయుడు.

"యెలా వున్నావో నిన్ను చూద్దామని వచ్చాను, కోడలు పిల్లా..." అన్నాడు. హాస్యంగా

"నీ మొఖానికి పరసలు వొ⁄టా" అని మనసులో తిట్టుకుని "మాసారుగా యింక వెళ్లండి..." అంది నడవబోతూ. అతను చెయ్యి అడ్డంగా పెట్టాడు.

"మీ ప్రవర్తన చాలా అసహ్యకరంగా వుంది." అంది యీసడిస్తూ.

"నువ్వేటన్నా ఫర్వాలేదు కొడుకు లేనపుడు కోడలి బాధ్యత మావే సూడాలి నీ కే లోటూ లేకుండా చూడాలి. అసలే ఉత్తమనిషివి కావు." యేదో తెలివి తేటలతో మాట్లాడినట్లు నవ్వుతూ అన్నాడు.

"పిచ్చి పిచ్చిగా వాగకు..." అంది కోపంతో వణికిపోతూ.

"కామాతు రాణాం న భయం నలజ్జా" అన్న సంస్కృత శ్లోకం జ్ఞాపకం వచ్చింది శారదకు.

పశువుకైనా కొన్ని నియమాలు వున్నాయి కానీ, కామినాయుడు పశువుకన్నా అధమాధముడు. గర్భిణీస్త్రీని కామించడం; అయితే కామినాయుడు ప్లాను వేరు. కసి వేరు. అయితే అది బయటకు వెల్లడించలేదు.

"పిచ్చిగా వాగలేదు. ప్రేమగానే వాగుతున్నా. ఈ వూరు వచ్చినపుడు నిన్ను సేసుకుంటానని సెప్పాను తొందరపడిపోయావు. కష్టాలు తెచ్చుకున్నావు. నా కోరిక తీరుసు. నీ మొగుడు ఖూనీకోరు. సిచ్చ తప్పదు. అయినా నీ కోసం యేటేనా సేస్తాను. ఉరిసిచ్చ లేకుండా సూస్తాను. అప్పుడునీవు విధవ్వి కావు నీకే విధమైన లోటూ రాకుండా సూస్తాను రా రా" మీదకు వస్తున్నాడు. కొడుకు మీద విపరీతమైన పగ. అది తీర్చుకోవాలి అతని పెళ్ళాన్ని పతితను చేయటం. వొకప్పుడు రవి విడుదలై వచ్చినాక ఆ సంగతి అతనికి తెలవడం, దీని తర్వాత పరిణామాల్లో, ఆ యిద్దరూ, స పార్సుల్లో నిప్పులు చెలరేగటం, తర్వాత విపరీత పరిణామాలు రావటం, అలా తనకు ఊళ్లోవున్న ఒక అడ్డూ తెగిపోతుంది తన ఆస్తికి మరింకో వారసుడూ వుండడు.

శారద దగ్గరకు చేరుకున్నాడు. మరో మాట మాట్లాడ్డానికి అవకాశంలేదు. శారద కాలికి పలక తగిలింది. అది కిష్టిగాడి పలక. వంగుని అది చేతిలోకి తీసుకుంది.

"జాగ్రత్త, ముందుకు వచ్చావంటే. నీచుడా..." అంతకన్న మరి మాట్లాడలేకపోయింది.

ఆ వూళ్లో అతని కామలీలలకు అడ్డులేదు. యెవరిమీద కన్ను పడితే, దాన్ని యెలాగయినా అనుభవించేవాడు, సామ దాన భేద దండోపాయాలతో లొంగదీసుకొని. కాని శారద విషయంలో అవేవీ పనిచేయలేదు. అప్పటికే రవి, అతనికి యెదురుచుక్కయినాడు.

విసరబోతున్న పలకను, ఆమె చేతిని పట్టుకున్నాడు. శారద భయంతో కేకలు పెడుతూ, అతన్ని విడిపించుకురావాలని ప్రయత్నిస్తోంది.

యింతలో ఆమె ప్రయత్నానికి వూపిరి వచ్చింది. బయట మనుషుల కలకలం వినిపించింది గడియవేసిన స్కూలు తలుపులు దబదబ బాదటం వినిపించింది. కోటీశు కేకలు వినిపించినయి.

ఈ హఠాత్పరిణామానికి, కామినాయుడుకి మతిపోయింది. యేం చేయాలో తోచలేదు. తలుపు తీసుకొని బయటకు వెడితే యేం జరుగుతుందో నని భయం వేసింది. అర్థాంతరంగా సాంబడ్ని పట్నం పంపాల్సివచ్చింది, బ్రాందీ, విస్కీల కోసం

తలుపు చప్పుడుతో వూగిపోతోంది యే క్షణాన్నయినా వూడి రావొచ్చు "నిన్ను విడిసి పెట్టాననుకోకు నిన్ను యేటి...యేటి చేస్తానో సూడు" అంటూనే చెమటలు పట్టిన కామినాయుడు పెరటి దోవన పలాయనమంత్రం చిత్తగించాడు.

మెరుపులా వెళ్లి శారద తలుపు తీసింది. బయట జనం. కోటీశు ఆతృతగా చూస్తున్నాడు. వాడి ముందు, కిష్టయ్య నిలబడ్డాడు. వాడి కళ్లమ్మట నీరు కారుతోంది. అందరూ లోపలికి వచ్చారు. నిస్త్రాణగా కూలబడిపోయింది శారద.

అంతటా నిశ్శబ్దమైపోయింది. కిష్టిగాడ్ని పిలిచింది. వాడు దగ్గిరకు వస్తే కౌగలించుకుని యేడ్చింది. వెక్కి వెక్కి వాడూ యేడ్చేసాడు. వొక్క క్షణం ఆలస్యమైతే తన నింక జీవితం యేమయ్యేదో తలుచుకుంటే వొళ్ళు గగుర్పొడిచింది. యిది రెండోసారి వాడు తనని రక్షించటం. జనంలోవున్న స్త్రీలు శారద దగ్గరికి చేరారు, వోదార్చడానికి లబ్బితో బాటు.

"యెదవ నాయాల! దొడ్డిదోవన పారిపోయాడు. ఈ రోజుతో ఆడికి భూమ్మీద నూకలు చెల్లిపోనాయి. ఆడంతు చూస్తాను. ఆడు పశువా? మనిసా..." అంటూ రంకెలు వేసి కోటీశు అడుగు ముందుకు వేసాడు, గుంపును చీల్చుకొని. వాడి రక్తం కుతకుత వుడి పోతూంది.

"కోటీశూ..." నెమ్మదిగా పిలిచింది. ఆమె చెప్పేదేమిటో అతనికి తెలుసు.

"నన్నాపకండమ్మా. యింతకాలం ఆడి ఆటలు సెల్లినాయి. సేతకాని యెదవలయిపోనాం" అన్నాడు. వాడి కళ్లలో ఆవేశంలో నీళ్లు వుబుకుతున్నాయి.

"నా మాట విను కౌటిశూ. అతని పాపానికి ప్రాయశ్చిత్తం త్వరలో అనుభవి స్తాడు. మనం యేమీ తొందరపడవద్దు," అంది నీరసంగా లేస్తూ. అందరి సాయంతో నెమ్మదిగా యిల్లు చేరుకుంది.

శారదకు అన్నం సహించలేదు. తను జీవితంలో యెవ్వరికి అపకారం చేయలేదు. సజావుగా సాగుతున్న అన్యోన్య దాంపత్య నావ పెనుతుఫానులో చిక్కుకుపోయింది, చేయని నేరానికి. ఆమెకు వొక్కక్షణం. భవిష్యత్తు అందకారంలానే కన్పించింది. ఉద్యోగానికి రాజీనామా యిచ్చి, అనాధ శరణాలయమే చేరుకుని, తన భర్త విడుదలయిన తర్వాత కల్మష వాతావరణం నుండి తప్పిస్తే తమ జీవితాలు బాగుపడతాయి కదా యెందుకీ మానసిక వ్యధ చిత్రహింస అనుభవికచడం. ఉదయం సంఘటనతో శారద మస్తిష్కంలో ఆలోచనలు రంపపుపోట్లు రాలుస్తున్నాయి.

నిజానికి జీవితం ఒక కురుక్షేత్రం. మానవుని భౌతికాధ్యాత్మిక శక్తులకు నిత్యం సమరం జరుగుతూనే వుంటుంది. మానవుడు భౌతికానికి లొంగిపోతాడు. ఆ ప్రమాదంనుండి తప్పించుకోవాలంటే జాగరూకుడై వుండాలి. మహత్తర సత్యాలను మనం మననం చేసుకుంటూ వుండాలి.

కర్తవ్య నిర్వహణలో మాధుర్యం వుంది. ఆత్మ మరొక ఆత్మతో కలియడం యెంత మంచిదో, మంచి ఆశయం మరొక మంచి ఆశయంతో కలవటం ఇంకెంతో మంచిది.

ఈ కలయికను ప్రపంచంలో యే శక్తీ అడ్డగించలేదు. విడదీయలేదు. ఏకాగ్రత వలనే విజయం సాధింపబడుతుంది. ప్రపంచం యేమనినీ నీకు ఉచితమైన మంచిపని చెయ్యి. నీదాత్మలో మహోన్నత ఆశయాలకు తావుండదు

నిప్పురవ్వలు పైకి చిమ్మినట్లుగా మనిషి కష్టాల్లో పైకి వస్తాడు అవినీతి వొక వృక్షం లాంటిది. దాని కొమ్మల్ని వెయ్యిమంది నరకవచ్చు. కాని వారికంటే, వేళ్లవద్ద నరికేవాళ్లే గొప్పవాళ్లు. ఆశను విడవకూడదు. నీవు శిధిలమైపోవచ్చు ఆ శిధిల శకలాలతోనే తాను సాధించవలసిన గమ్యాన్ని చేరుకునే దాకా ఆశ మానవ శ్వాస.

తను అనాధశరణాలయంలో వుండేటపుడు దీనబంధుగారు చేసిన సోదాహరణ ప్రసంగాల ప్రవచనల సమూహం, ఆమె ఆలోచనలతో సంఘర్షణ పడుతున్నాయి. చివరకు ఆమె ఆలోచనలు బలహీనమైపోయాయి.

  

ఆ వూళ్లో ఆ రోజు మామూలుగా తెల్లవారలేదు. ఆ వూరుకు నిప్పంటుకుంది. యిళ్లకి కాదు ప్రజల గుండెలకు. భయంతో విలవిల లాడిపోతున్నారు

సూర్యుడు కూడా నేనేం తక్కువవాడినా అంటూ మీదకు చరచరా వచ్చేస్తున్నాడు. యెవరి ముఖాల్లోనూ జీవకళ లేదు.

సత్యవరానికి జీవాధారమైన బావిలో యెండ్రిన్, డీసెల్ ఆయిలు కలపబడింది. గంగాజలంలాటి నీరు విషమయమైపోయింది. రాత్రే కలపబడివుండాలి. నూతి గట్టు పక్కనే ఆరు ఎండ్రిన్ డబ్బాలు, రెండు పెద్ద ఆయిలు టిన్నులు, యేమీ యెరుగని అమాయకుల్లా పడివున్నాయి, చైతన్య రహితంగా.

ఊరికి రెండుమైళ్లు వెడితే గాని, యింకో వూళ్లోనూతిలో నీరు దొరకదు. అదీ ఆ గ్రామంవాళ్లు యెంతమంది జనానికి యిస్తారో, యివ్వరో! సంశయం వాళ్లలో కలిగింది.

అందరి ముఖాలలోనూ ఆందోళన తాండవిస్తోంది. యేది లేకపోయినా మనిషి బ్రతకగలడు కానీ, నీరూ లేకపోతే మనిషి బ్రతకగలడా? యెవరు చేయగలరో యిలాంటి దౌర్భాగ్యపు పని వారికి తెలుసు యెవరు చేసారో వూహించలేనంత అసమర్థులుకారు. ఆలోచనారహితులు కారు ప్రజలు.

కోటీశు రక్తం క్రోధాగ్నితో కుతకుత లాడిపోతోంది. అప్పుడే అతనితో బావిదగ్గరకు రావల్సిందే. కాని రాత్రినుండి దాని వొంట్లో బాగులేదు.

కోటీశు వెంటరాగా జనం యేం చేయాలో పాలుపోని స్థితిలో శారద వద్దకు బయల్దేరారు. అక్కడక్కడ చెట్టుమీద కాకులు అరవడానికి ఓపికలేక ఎండకేసి కోపంతో నిస్సహాయంగా చూస్తూ వుండిపోయాయి అప్పుడే శారద ప్రార్థన ముగించి లేచింది. ఊరు ఊరంతా తనదగ్గరకే వచ్చింది. కారణం యేమిటో తెలియదు.

"పొద్దుటేల నాను నీలుతోడితే వాసనేసాయమ్మా...నూతిగట్టుకాడ డబ్బాలు కనుపించినాయి. తెగెత్తుకొచ్చి మా యజమానికి సెప్పినానండి..." అందొక ఆడమనిషి ఆ గుంపులో.

"యిది పెసిడెంటుగోడి పనే" అన్నాడింకొకడు గుంపులో.

"నిన్న నన్నాపేశారమ్మగోరూ. ఆడిసంగతి తేలిపోయిందేది. ఏటి సేసాడో సూశారా" అని అరిచాడు, కోటీశు బాణాకర్ర నేలమీద రాస్తూ. శారద వాడికేసి చూసింది. వాడి చేతిలో బాణాకర్ర నిస్సహాయంగా నలిగిపోతోంది.

"ఎలకసనులు వొస్తున్నాయి గందా అంచేత పెట్టిందర్ని ఆడియేష్ణ తిప్పుకోడానికి యిసమయం సేసిండు" అన్నాడింకొకడు గుంపులో.

"అద్గదీ సంగతి. ఆయనగోరింట్లో బావుందికదా. ఆయనగోరేప్పు తిరిగితే మన కందరికీ నేళ్ళిస్తారు" అన్నాడింకొకడు. వాడు కొంచెం చదువుకున్నాడు.

"ఆ సిన్న బావిలో యేమాతరం నీళ్ళుంటాయిరా. యీ యేసవుల్లో ఆరిగోరికి సరిపోగా మరో పాతికడవలకన్నా యెక్కువ మిగలవురా..." అన్నాడింకొకడు. వాడు కొంతకాలం కామినాయుడింట్లో పాలేరుగా పనిచేసి మానేసాడు.

"ఈ పొద్దాడి సంగతి తేల్చేస్తాను..." అని వెనుదిరిగాడు.

"కోటిగా! యేమిటా ఆవేశం. తొందరపడకు. అందరం కలిసి అతన్ని అడుగుదాం. యెందుకిలాంటి పనిచేసావని. నీ వొక్కడివల్లా పరిష్కరింపబడే సమస్యకాదు. సామూహిక బలం సమాజ చైతన్యమే యిలాంటి నిజాల్ని తవ్వి బయటకు తీస్తాయి. పద నేనూ వస్తాను ఆమె ముందడుగువేసింది.

ఆమె వెనుక జనం దావాగ్నిలా కదిలారు కాలకూటం మింగిన బావిమాత్రం వారితోనే కదలలేకపోయింది.

కామినాయుడు యింటిచుట్టూ నాలుగడుగుల ఎత్తున రాతితో సున్నపుకట్టు ప్రహారీ, వాటిమీద తాపడం చేయబడ్డ గాజుపెంకులు రాక్షసత్వపు కోరల్లా, కాటువేయమాసే విషనాగుల కోరల్లా యెండలో నిర్భయంగా మెరుస్తున్నాయి.

అంగుళంన్నర మందం. ఉక్కు కడ్డీలతో ముందు పెద్దగేటు. అక్కడినుండి పదహారడుగుల దూరంలో రంగుల డాబా యిల్లు వొకప్రక్కగా నిలువెత్తు గడ్డిమేటు. తర్వాత పశువులసాల. దానికి కొంచెందూరంలో గడ్డిమేటు ప్రక్కగా కొత్తగా యిల్లు కట్టాలని బండ్లతో పెరిగించిన నల్లరాయి కొండలావుంది. పాలేళ్ళు పశువులకు కుడితి పెడుతున్నారు వొకరిద్దరు బావిలోనుండి నీరుతోడి యింటికి తీసుకువెడుతున్నారు

కామినాయుడు కుర్చీలో నుండి లేచి, కాస్సేపు అటూ, యిటూ పచార్లు చేసి, మళ్ళా కుర్చీలో కూర్చుని బారెడు కంపెనీ చుట్ట వెలిగించుకున్నాడు.

సాంబడు నాపరాయి దగ్గరగా కూర్చుని గండ్రగొడ్డలి నూరుతున్నాడు. ~~వాటికి పదిమిద్దరడుగుల దూరంలో బాగా బలిసిన పొట్టేలు కయ్యానికి కాలు~~ దువ్వుతున్నదానిలా గుర్రు పెడుతోంది. నల్లగా బలమైన కండరాలతో మూస పోసిన మనిషిలా వున్నాడు సాంబడు.

నూరుతున్న గండ్రగొడ్డలి అరుగు అంచున పెట్టి నాయుడు దగ్గర కూర్చున్నాడు. కామందు కామినాయుడు చుట్టపొగ గాలిలో అంచెలంచెలుగా ప్రయాణిస్తోంది, అతని మనస్సులో ఆ వూరి ప్రజలపైనున్న కక్షలా.




"యేట్రా... యిసేసాలు!" నాయుడు నవ్వుతూనే అడిగాడు.

"యేటున్నాయి బాబూ! ఊరు ఊరంతా ఉడుకెత్తిపోతన్నాది. అల్లంతా పంతులమ్మ యింటికి లగెత్తినారు." అన్నాడు నవ్వుతూ సాంబడు. కామినాయుడు పెద్దగా నవ్వాడు.

"యిప్పుడు తెలుస్తుంది. పెసిడెంటంటే పెజలకి" అన్నాడు కార్పణ్యంతో తుపుక్కున ఉమ్మి కసిగా

"నిజమే బాబు! యీ దెబ్బతో పెజలందరూ నీళ్ళకోసం మన కాళ్లట్టుకుంటారు. మన కోటేసినవాళ్ళకే నీళ్లిత్తాం..." అన్నాడు.

"నువ్వు సెప్పింది నిజవేరా!..." అన్నాడు, ఈ దెబ్బతో చాలా సంవత్సరాలుగా వస్తూన్న ప్రెసిడెంటు పదవి తనకి రాక తప్పదు.

ప్రజల దీనత్వం, నిస్సహాయత్వం, నీళ్ళకోసం పడే ఆరాటం అతని గుండెల్లో ఆనందం కలిగిస్తోంది.

అయితే ఆ ఆనందం యెంతోసేపు నిలవలేదు.

గేటుకు తాళం యెయ్యిరా అన్నాడు గట్టిగా, అరుస్తూ, నాయుడు లేచి.

సాంబడు యెదురుగా చూసాడు. శారదతో ప్రవాహంలా పెల్లుబుకుతు వస్తున్నారు జనం. గేటుకు తాళాలు పడ్డాయి. నిమ్మకు నీరెత్తినట్లుగా కూర్చున్నాడు.

"కామినాయుడుగారూ! మీకిది న్యాయంకాదు. గత సంవత్సరం వర్షాలులేవు.

ముందు ఎండాకాలం తరించాం. అదీ దాటిపోవస్తోంది. యింకా వర్షాలు లేవు వున్న వొక్క చెరువు నీరు గత సంవత్సరం మీ పంట పొలాలకు కదిలించు కున్నారు. ఈ వూళ్ళో వున్న వొక్క బావి నీళ్లే మా కందరికీ ఆధారం. అలాంటి జీవనగంగలో అన్యాయంగా విషం కలిపావు" అంది మనసులో ఆవేదనని అణచుకొని.

ఆమె వెనకాతల మండుతున్న గుండెలు కేకలు పెట్టాయి. సహనానికిగూడా ఒక సరిహద్దు వుండికదా. శారద వారించింది.

"యిసమా! నాను కలిపానా! నాకేటి తెలియదే" అన్నాడు, తాపీగా మరో చుట్ట వెలిగించుకుంటూ.

"ఊరికి పెద్ద. యిలా అబద్ధాలు ఆడి యేం సాధించదల్చుకున్నారు. ప్రజల మీద, మా వారిమీద, నామీద కోపంవుంటే సాధించడానికి యిది సవ్యమైన మార్గంకాదు..." అంది రోషంగా.

"యేటిట్టమొచ్చినట్లు మాటలిసిరేత్తన్నవ్. ఖూనీకోరు నీ మొగుడ్ని జైల్లో యెట్టించినందుకు పంచాయితీ యెలచ్చన్లు వొత్తన్నాయి గదా నా పెజలు నా కోటు యెయ్యకుండా సెయ్యడానికి యిసం నువ్వే కలిపుంటావ్..." అన్నాడు కుర్చీలోనుండి లేచి.

"యిది చాలా దారుణమైన విషయం. నాగరికత సంతరించుకున్న మానవ జాతిలో, యింతవరకూ పదవికోసం, యిలా ప్రజల్ని చంపి ఆ శ్మశానాన్ని యేలుకోవాలన్న ఉద్దేశ్యం చరిత్రలో మీతోనే మొదలు కాబోతోంది యింక." ఆమె శరీరం ఆవేశంతో వణుకుతోంది.

"పెసిడెంటు బాబు దేవుడు. అర్సనుకుంటే గంజినీళ్ళుకూడా దొరకవు" అన్నాడు సాంబడు వాడికళ్ళు అరుగు అంచుమీద నున్న గండ్రగొడ్డలిమీదనే వున్నాయి. ఎండలో దాని అంచు తళతళ మెరిసిపోతోంది.

"ఓ రూరుకోరా బామ్మర్ది. నీలాంటి బ్రోకర్నాకొడుకులనుండి వూరల్లా తగలబడిపోతన్నది" అన్నాడు కోటీశు.

ఆ రోజు దెబ్బలాట తర్వాత సాంబడితో మాట్లాడ్డం యిదే మొదటిసారి.

"ఓ రొల్లకోరా! మాటలు జోరుగా పోతున్నాయి" అన్నాడు సాంబడు.

"నీ యెదవపన్లు నాకెరికే. యెన్ని అన్నేయాలు సేసేవురా. యెంగిలి మెతుకుల కాశపడి. యెందుకురా యెదవబతుకు. నువ్వే ఎండ్రిన్ మందు బావిలో కలిపుంటావురా. యిప్పుడు నీకు సంతోసమై పోనాదా సెప్పరా...దొంగ నాయాలా..." అన్నాడు బాణాకర్రను నేల తాటిస్తూ.

"నానెందుకు కలుపుతాన్రా నా కే టవసరం..." అన్నాడు గట్టిగా.

"అలాగని నీ సెల్లెలిమీద పెమానం సేసి సెప్పరా!" కోటీశు గట్టిగా అడిగాడు. సాంబడు మాట్లాడలేదు.

"సెప్పరా! దమ్ముంటే సెప్పు..."మళ్ళా హెచ్చరించాడు.

"సెబుతారా! నాకేటి భయవా. నాసెల్లెలిమీద కాదురా. గుళ్ళోవున్న దేవుడోరి మీద పెమానికం సేసి సెబుతాను..." అన్నాడు కోపంగా.

"ఓరి పితలాటకం నా కొడకా! బతికిన మనిసిమీద సేసిన పెమానికానికి యిలువుందిరా! నోరూ వాయీ లేని దేవుడేటి సేస్తాడ్రా నీ సెండాలంపనికి..." ప్రశ్నించాడు అసహ్యంగా.

శారద చూస్తున్నది. జనం వింటున్నారు. వాళ్ళ తలుచుకుంటే ఉక్కుగేటు తుక్కుతుక్కయిపోతుంది. అవతల మనుషులు చలిమిడి ముద్దయిపోతారు కానీ ఆమె ధ్యేయం అదికాదు. కోటీశుని వారించింది,

"నాయుడుగారూ, ప్రజలూ, కన్నకొడుకూ యేనాడూ శత్రువులుకాదు మీకు. మీకు దారుణ శత్రువులు, మీరుచేసిన నేరాలే. మీరు తవ్వుకున్న గోతిలో మిమ్మల్ని నడిపించేవరకూ, మిమ్మల్ని నీడలా అనుసరిస్తూ వుంటాయి. అది మీకు త్వరలో తెలుస్తుంది," అని వెనుదిరిగి పోయింది.

క్షణంక్రితం జాతరలా వుండే స్థలం నిశ్శబ్దమైపోయింది బలిష్ఠమైన పొట్టేలు గింగిల లాడిపోతూ అరుస్తున్నది.

సాంబడికి గుండెల్లో దడ పట్టుకుంది. పాపభీతి పొరవిప్పిన నాగుపాములా వాడి వెన్నెముకలో పాకుతోంది. శరీరం సన్నగా వణకటం ప్రారంభించింది.

"బాబూ! ఆల్లు పోలీసు రిపోరటు సేస్తారేమో...'' అన్నాడు భయం భయంగా.

కామినాయుడు మరికొంత సేపు ఆలోచించాడు, చుట్ట వెలిగించుకుని. యేదో ఆలోచించుకుని లోపలికి వెళ్ళి మళ్ళా క్షణంలోనే తిరిగివచ్చాడు.

"ఒరేయ్, యీడనుండి పట్నంపోయి వో వారముండి రారా! యీలోగా యీ గొడవ సర్దుకుంటుంది. నీకేటి కాకుండా సూసే పూసీ నాది" అన్నాడు. అతని చేతిలో అరువందలు విలువచేసే పదిరూపాయల నోట్లు రెపరెపలాడుతున్నాయి. సాంబడి ముఖంలో కృతజ్ఞత, గర్వం ప్రతిబింబించాయి. వంగి తీసుకున్నాడు. అంత డబ్బు చూడటం వాడి జీవితంలో అదే మొదటి సారి.

యింతలో జనం సవ్వడి వినిపించింది. ఊళ్ళోవున్న ముసలీ, ముతకా అడా

మగా తాటిరేకుం బొ క్కెనలు, బిందెలు, కుండలు పట్టుకుని చాలామంది ఊరు విడిచి దూరంలోఉన్న బావికి బయల్దేరారు, బిక్కు బిక్కు మంటున్న గుండెంతో. కామినాయుడు యింటిము దుగానే వుందా అడ్డదారి.

నాయుడూ, సాంబడూ మిగతా పాలేర్లూ ఆనందంగా ఆ దృశ్యాన్ని చూస్తు న్నారు. అలా బయలుదేరిన జనంలో కోటిశు కావిడి వేసాడు. వాడిని చూసే సరికి సాంబడికి కడుపుతో వున్న చెల్లెలు లచ్చి జ్ఞాపకం వచ్చింది.

"ఛీ! నీదీ వొక బ్రతుకే! థూ..." అని గట్టిగా అరిచి సాంబడ్ని చూసి, కాంద్రించి వుమ్మి మళ్ళా జనంలో కలిసిపోయాడు. సాంబడు వులిక్కిపడ్డాడు.

"నువ్వు యెల్లిరా! బేగి..." అని సాంబడ్ని హెచ్చరించాడు హుషారుగా. నాయుడి గుండె తేలికపడింది.

' అలా వెళ్ళిన సాంబడు పదిహేను నిముషాల్లో పరిగెత్తుకుని తిరిగివచ్చారు. వాడి ముఖంలో హుషారులేదు. దిగాలుగా వున్నాడు.

అంతకుమునుపు వాడేం చేసాడంటే కడుపుతో వున్న సెల్నెల్ని చూడ్డానికి వెళ్ళాడు. హృదయంలో అంతర్వాహినిలా పెనవేసుకున్న రక్తపాశం యెక్కడ తెగిపోతుంది. తరాలు, యుగాలు తరిగినా తెగని బంధం అది.

అది పెళ్ళిచేసుకున్న తర్వాత కన్నవారు యివ్వాల్సిన చీరే సారె యేమీ యివ్వలేదు. చేతిలో యెలాగూ డబ్బుంది. అదిగాక తన దగ్గర కొంత డబ్బుంది. కడుపుతో వున్న చెల్లెల్ని చూడాలని దానికేదో పట్నం వెళ్లేలోగా యివ్వాలని నిశ్చయించుకుని డబ్బు తీసుకొని వెళ్ళాడు

తడిక తలుపు తీసుకుని గుడిసెలోకి వెళ్ళాడు. లచ్చి నిద్రపోతోంది. చాలా కళగావుంది. శరీరం తేటదనం తేరి నిగారి చివుంది.

"సెల్లీ... సెల్లీ..." వొంటిమీద చేయివేసాడు సాంబడు వాడిచెయ్యి చురుక్కున కాలినట్లయింది.

లచ్చి శరీరం చాలా వేడిగవుంది. అంత జ్వరంతోనూ లచ్చి కళ్ళు తెరిచింది. దాని కోరిక నెరవేరింది. ఆనందంతో కళ్ళు మిలమిల మెరిసాయి.

"బాగున్నావే!" అన్నాడు ఆనందంతో చేతులు, ముఖం తడిమి.

"జొరంరా' అన్నయ్యా! ఈవ లొట్టి పోతున్నాను. నీళ్లియ్యరా..." అడిగింది నీరసంగా. గుడిసెలో కుండలు చూసాడు ఆతృతిగా. అందులో ఒక చిన్న నీటి చుక్కకూడా లేదు. యిరుగు పొరుగు లందరూ యిళ్ళకు తాళాలు వేసి బావికి వెళ్ళారు. అందుకని పరుగుతో నాయుడింటికి వచ్చాడు.

"ఏటి మల్లొచ్చేసినావేటి? యెవరైనా తగువు కొచ్చినారా?" అడిగాడు నాయుడు వాడు తల అడ్డంగా వూపాడు.

"డబ్బేటి కావాలర్రా" అడిగాడు విసుగ్గా.

"డబ్బేటొద్దు బాబూ! నా సెల్లి యీవ లొట్టిపోతన్నాది. అదొట్టిమనిసి కాదు. ముంతెడు నీళ్ళిప్పించండి" అడిగాడు ఆతృతగా.

"నీ సెల్లంటే కోటీసు పెళ్లావేనా. నీతో సెప్పకుండా పెళ్లి సేసుకుంది."

తల వూపాడు సాంబడు.

"నీకేటి పిచ్చెక్కినాదేటి? మనమీద కేంద్రించి వూసేసిన మన యిరోధి కోటీసు పెళ్లానికి నీళ్లిస్తానంటావ్..." కోపంగానే అన్నాడు.

"అల్లాగనకండి బాబూ! సిన్నప్పట్నించీ దాన్ని నా భుజాలమీద పెంచినాను. ఆదో బిడ్డతల్లి కాబోతోంది. జొరంతో వొల్లంతా కాలుతోంది. గుక్కెడు నీల్లు..." వాడి వాక్యం పూర్తికాలేదు.

"సాంబా! నీకు ఈ వలంటే నీల్లుతాగురా! కానీ నీ సెల్లి కివ్వను." విసుగ్గా కుర్చీలోనుండి లేచాడు. సాంబడు వదిలిపెట్టలేదు.

"బాబ్బాబూ! మీ సొమ్ము తీసుకోండి. కాని నాకు ముంతెడు నీల్లిప్పించండి..." సాంబడు నాయుడి కాళ్ళమీద పడిపోయాడు. కానీ ఆ వ్యక్తిది రాక్షస మనస్తత్వం అది కరగదు. కాళ్ళు వెనక్కి తీసుకన్నాడు.

"నాయుడు బాబూ..." గట్టిగా అరిచాడు, సాంబడు.

"యేట్నీకు పిచ్చేటి ముదరిందేటిరా ! యీ పొద్దిలా వున్నావు. యెల్లు... యెల్లు..." కసిరేసాడు.

"బాబూ! నానెలాంటోణ్ణో నీ కెరికే." గద్దించాడు.

"ఏటి సేస్తావురా! నువ్వేటి భయపెట్టినా నానేటి జంకుతాననుకున్నావేమో... ముందు నువ్వు దెబ్బలు తింటావు..." అన్నాడు చాలా కోపంగా.

"సాంబడికి శివమెత్తిపోయింది. ఇన్నాళ్ళూ ఎవరికయితే తను అడుగులకు మడుగులొత్తాడో, ఆ యజమానిమీదకు వురికాడు కోపంతో. ఇంతలో మిగిలిన పాలేళ్ళు అడ్డుకొని వాణ్ణి తోసేసారు.

సాంబడు అరుగు అంచున పడ్డాడు. అంతకు క్రితమే వాడు సానపెట్టిన గండ్రగొడ్డలి మొన భుజానికి గుచ్చుకుంది. బాధతోనే దానిని తప్పించాడు. మెత్తని కండరాన్ని కోసిన గొడ్డలి మొన ఏమీ ఎరగని నిర్దోషిలా వుంది. వాడి భుజంనుండి రక్తం కారటం మొదలుపెట్టింది.

"ఒరేయ్! ఏ నీళ్ళయితే ఇసమయం చేయించావో...నిన్నేటి సేస్తానో సూడు" అని బాధతో అరచి గాయాన్ని చేత్తో అదిమిపట్టి బయటకు పరిగెట్టాడు.

లచ్చి గుడిసె తలుపు తెరిచేసరికి, అది అన్న కోసం ఆశగా చూస్తోంది. వాడి చేతిలో నీళ్ళు లేవు.

''ఏటయ్యిందిరా నీల్లు తెచ్చినావా ?"

"లేవే. ఊల్లో నీ...ల్లు యిసమయం అయిపోయాయి. ఆడు నీల్ల కెళ్ళాడు గదే. ఈ పాలి కొచ్చేస్తుండాలి..." అన్నాడు ఆశగా బయటకు చూస్తూ. కానీ ఎవ్వరూ వచ్చిన జాడ కన్పించలేదు.

''ఓరన్నా ఆడొచ్చేవరకూ నా పేనాలు నిలవ్వు..." అని పెదాలు తడుపు తుంటోంది. దుఃఖం పెల్లుబికింది సాంబడికి. తొలిసారి కడుపుతో వుంది. మిఠాయి పొట్లం కొనలేదు. దానికి బదులుగా కనీసం నీళ్ళయినా ఇవ్వలేక పోతున్నాడు. వాడి మొలలో వున్న వందల డబ్బు ఏమీ చేయలేక నిస్సహాయమై వెలవెలపోయింది.

సాంబడ్ని చూస్తోంది లచ్చి. వాడి గాయంనుండి రక్తం బొట్లు బొట్లుగా కారుతోంది. అవి ఆమెకు నీటిచుక్కలుగా మారినట్లు భ్రమించింది.

"దేవుడోయ్ ! నా సెల్లెల్ని రచ్చించు..." అన్నాడు. ఎక్కడున్నాడు దేవుడు. సాంబడి రక్తం చుక్కలు, కన్నీటి చుక్కలు నేలమీద పడి స్నేహం చేసాయి.

"బావిలోనివి ఇసం నీల్లే..." మళ్ళా అన్నాడు లచ్చి బాధగానే లేచి చీర చింపి వాడి గాయానికి కట్టు కట్టింది ప్రేమగా.

"ఓరన్నా నీల్లు తాగినా సత్తాను. తాగకపోయినా సత్తాను. తాగి సత్తే నా యూవల తీరుతుంది. ఎల్లరా...నీకేరా...సచ్చి నీ కడుపున..." మరి మాట్లాడ లేక సొమసిల్లిపోయింది.

మరి వినలేక తాటిబొక్కెన పట్టుకొని బావికి బయలుదేరాడు. గతరాత్రి విషం మింగిన నీరు చచ్చిపోయిన ప్రాణంలా నిశ్చలంగా వుంది. నడినెత్తిన ఎండని తలలు చెమగుతున్నది. కాళ్ళు మాడుతున్నా ఆలోచనారహితమై ఎంతసేపు నిలబడిపోయాడో వాడికే తెలియదు.

తిరిగి వర్తమానంలోకి వచ్చేసరికి, నీళ్ళు తోడుకొని వెళ్ళేసరికి, కోటీశు గుండెలు బాదుకుంటూ లచ్చి శవంమీద పడి ఏడుస్తున్న దృశ్యం కనిపించింది. సగం దూరంలోనే ఆగిపోయాడు.

"సెల్లి...లచ్చి...లచ్చి... నీ పేనం నానే బలవంతంగా తీసేసినానే..." అని నెత్తి కొట్టుకుంటూ, ఆ దుఃఖంలో, వూరివాళ్ళు తనను చూసి ఏం చేస్తారోనని భయంతో పరిగెట్టాడు.

శారద కోటీశును ఓదార్చింది. తనముందు తుళ్ళుతూ పరిగెట్టిన సెలయేరు నిండు నదిలా జీవించాల్సిన క్షణాలలో ఎండిపోయింది. అంత దుఃఖం దిగమింగింది.

గుక్కెడు నీళ్ళకోసం దాహంతో విలపించిన ప్రాణంలేని లచ్చి శరీరాన్ని నాలుగుబిందెల నీళ్ళతో స్నానం చేయించారు. పసుపు, కుంకుమ ముఖానికి పూసారు.

పాడె కదిలింది. కోటీశు లచ్చి చితికి నిప్పంటించాడు. అది రాజుకుంది. కోటీశును వోదార్చి, యింటిదగ్గర శారదని విడిచి వెళ్ళారు, ఇరుగుపొరుగులు. శారద క్యారేజీలోనుండి అన్నం తీసి వడ్డించింది. "అమ్మగారూ..." అని బావురుమన్నాడు కోటీశు శారద అంత దుఃఖంలోనూ ఆప్యాయంగా తల నిమిరింది. అన్నం తినమని బ్రతిమాలింది. కానీ తినలేకపోయాడు. రెండు ముద్దలు బలవంతంగా కోప్పడి తినిపించి రాత్రి కిష్టిగాడ్ని తోడువుండమని సౌంజ్ఞచేసి యింటికి వెళ్ళిపోయింది.

కోటీశు ఒక్కడూ ఎండిపోయిన చెరువుగట్టుమీద కూర్చున్నాడు. గట్టు కింద ఎండిపోతున్న మర్రిచెట్టు దానికి ఆనుకునే శ్మశానం.

లచ్చి చితి మంటలు వాడి గుండెల్లో రాజుకుంటున్నాయి. అందులో వాడు లచ్చి చావుకు కారకుల్ని వెతుకుతున్నాడు. అప్రయత్నంగానే వాడి పిడికిట్లో వున్న గులకరాళ్ళు పిండయిపోయాయి. వెలుగును మింగిన చీకటి, కోటీశును మింగింది. దాని మధ్య ఎర్రటి మచ్చలా లచ్చి చితి మండుతోంది.

ఆ రాత్రి శారదకు నిద్రపట్టలేదు. జీవితం ఒక రైలుపెట్టె. ఎక్కడ గమ్యస్థానం ఎవరికి రాసుందో అక్కడే దేవుడు వాళ్ళని దింపేస్తాడు. మరొక్క అడుగు కూడా ఎక్కువ వెళ్ళనివ్వడు. లచ్చి గమ్యస్థానానికి చేరకుండానే దేవుడు బలవంతంగా దింపేసాడు ఎందుకింత పగో ఆ అమాయకురాలిమీద దేవుడికి ? ఆలోచనలు ముసురుతున్నాయి.

తలుపు శబ్దమైంది. ఆమెకు గుండెల్లో రాయిపడింది మళ్ళా కామినాయుడు కాదుకదా ! అసలే వొంటరిగా వుంది...కాని కాదు కిష్టిగాడు వచ్చి రాని గొంతుకతో అరుస్తున్నాడు.

తొందరగా తలుపు తీసింది. వాడు శారద చేయి పట్టుకొని సౌంజ్ఞలు చేసాడు. ఆమె తాళంవేసి తొందరగా నడవసాగింది. వాళ్ళు సగం తవ్విన బావిదగ్గర ఆగిపోయారు. బావిలోకి వంగి చూసింది శారద!

అంత చీకటిలోనూ చిరుదీపం, వెలుగును కోయాలని తాపత్రయపడుతోంది. "ఖణేల్...ఖణేల్" మని శబ్దాలు వినిపిస్తున్నాయి కసిగా.

ఆశ్చర్యపోయింది. కోటీశు నెమ్మదిగా దిగింది. వాడి కళ్ళు అగ్నిగోళాల్లా వున్నాయి. పిడికిట్లో బిగుసుకుపోయిన గునపం వాడి చేతులనుండి కారుతున్న రక్తంలో తడిసిపోయింది శారదను చూసి నోట మాట రాలేదు.

"ఏమిటి పని కోటీశూ..." అంది బాధగా. వాడి చేతులు ఎర్రగా గులాబీల్లా వున్నాయి.

"అమ్మగోరూ! ఈ నీల్లు లేక...నా లచ్చి పేనాలు పోయాయి. ఇలా వుపేచ్ఛ చేత్తే, యీ ఊల్లో ఇంకెంతమంది పేనాలు పోతాయో. ఈ రాతి గుండెల బండలకి సెప్పానమ్మగారు. కాని ఏమీ మాటాడనేదు. ఇయ్యాల ఈటి సంగతో, నా సంగతో అటో యిటో తేలిపోవాల..." కసిగా మరో పోటు వేసాడు. రాతిపొరలు కొంతవరకు సుగిలాయి.

ఆ రాత్రి పొరల మధ్య జీవనగంగ, గజ్జెలు కట్టుకొని జలజల గలగలా..." భర్త నమ్మకాలు జ్ఞాపకం వచ్చాయి శారదకు. పట్టుదల కలిగిన ఆవేశం ఆమె నావహించింది. ఆ కోటీశు ప్రయత్నం ఆపుచేయలేదు. ఆమె గూడా మరో గునపం అక్కడే వుంటే దాన్ని చేతిలోకి తీసికొంది.

కిష్టిగాడు పగిలిన రాళ్ళముక్కలు తట్టలోకి యెత్తుతున్నాడు. "గంగమ్మ తల్లీ! మా ప్రయత్నంలో స్వార్థంలేదు. అందరి ప్రాణాల పాలిట జీవనాధారమై చిరంజీవిగా విలసిల్లు తల్లీ. ఈ రాతి పొరల్ని చీల్చుకొని మమ్మల్ని కరుణించు" అని ఒక పోటు పొడిచింది శారద.

అంతే ఆశ్చర్యం! గంగ జిమ్మన ఉపరితలానికి వెదజిమ్మింది, బలమైన ధారతో. కోటీశు ఆనందం పట్టలేక పెద్దగా అరిచాడు. వాళ్లందరికీ స్వప్నంలా మిగిలిపోతుందనుకున్న అనుభవం నిజమైపోయింది. శారద తడిసిపోయింది తృప్తిగా. ఆ నీళ్ళు తియ్యగా గంగాజలంలా వున్నాయి. ఈ వార్త తెల్లవారకుండానే పాకిపోయింది నిద్రలేస్తున్న గ్రామంలో.

తమస్సును కొసేసిన ఉషస్సు వెలుగు రేఖలకు ఆహ్వానం పలుకుతున్న శుభక్షణాలలో శారదకు కొంచెం వొంట్లో నలతగా వుంది. ఆమెకు నెలలు

నిండుతున్నాయి. అనాధశరణాలయం నిర్వహిస్తున్న నర్సింగ్‌హోంలో చేరడానికి బస్సు యెక్కించి ఊరివారందరి వీడ్కోలుల మధ్య

వారంరోజుల తర్వాత ఒకనాటి ఉదయం నాయుడు దాగట్లో పడ్డ వెంగ కాయలా అటూ, యిటూ తిరుగుతున్నాడు. అతని కోపం ఒక స్థాయి చేరకుంది. అతనింట్లో బావిలో గూడా ఎండ్రిన్, డీసెల్ ఆయిలు కలపబడటమే కాకుండా, యిల్లు కడదామని తెప్పించిన రాళ్ళు గూడా పడవేయబడ్డాయి. బావి పక్కన కాశీ దబ్బాలు నాయుడ్ని వెక్కిరిస్తున్నాయి.

"నాకే పాఠం సెప్పావు దొంగ యెదవా. నీ అంతు సూడకపోతే నాను నాయుడ్ని కాదు. సాంబా..."అన్నాడు క్రోధంగా. పాలేళ్లు గూడా నాయుడి కంత కోపం రావటం యెప్పుడూ యెరగరు.

కామినాయుడు దీర్ఘంగా ఆలోచించాడు. సాంబడు పట్నం వెళ్లాడు. వాడు తనకి కుడిభుజం. తన తాలూకా రహస్యాలన్నీ వాడికి తెలుసు. రవి నిర్దోషని పోలీసులకు చెప్పి విడిపించేస్తారేమో అన్న అనుమానం కలిగింది.

అలాక్కాకుండా తగిన కట్టుదిట్టం చేసుకోవాలి నాలుగైదు రోజులు ఆలోచించి. యెక్కడి వ్యవహారాలు, అక్కడ సర్దుబాటు చేసుకుని ఒకనాడు ఐదు గంటలవేళ పట్నం బయల్దేరాడు.

నల్లని బ్రీఫ్‌కేస్‌తో నడుస్తున్న నాయుడి నడక పొరవిప్పిన మల్లినాగు పరుగులా వుంది. తెల్లని గ్లాస్కో పంచ, తెల్లని పట్టుచొక్కా వేసుకున్నాడతను.

బస్సురోడ్డు చేరుకోవడానికి యింకా చాలా దూరం నడవాలి. రోడ్డు పక్కన చిన్న చిన్న తుప్పలూ, ముళ్ల డొంకలూ లేవు చిన్న చిన్న సీమచింత చెట్లు తప్పించి మరేమీ లేవు.

యెవరో వెనుకనుండి తనని అనుసరిస్తున్నట్లుగా అనుమానం తోచింది. వెనక్కి రెండుసార్లు చూసాడు. కానీ యెవరూ కన్పించలేదు.

మూడవసారి అతని భ్రమ నిజమే అయ్యింది. యెదురుగా నల్లటి ఆకారం. [redacted] అస్తవ్యస్తంగా రగులుతున్న జుట్టు, చేతిలో బాణాకర్రతో కోటిశు. మృత్యువుకన్నా భయంకరంగా నిలబడ్డాడు.

నాయుడు భయంతో గట్టిగా అరిచాడు. కాని యెవరు వింటారా కేకను? నల్లరాళ్లే జీర్ణించుకోలేక కక్కేసాయి, దానిని అసహ్యంగా. అలాగ అతను వేసిన రెండూ, మూడూ కేకలూ, వ్యర్థమైపోయాయి. ఆకాశంలో అక్కడక్కడా వేలాడుతున్న నల్లమబ్బులు మీద పడడానికి సిద్ధంగా వున్నాయి

"నీకు దండం పెడతా కోటీశూ...నన్నొదులు..." బతిమాలుతున్నాడు.

"యింద. యీ సొమ్ము తీసుకో. మరి నన్నేమీ సేయకూ" ... బ్రీఫ్‌కేసు తెరిచాడు. దాని నిండా నోట్లు, బంగారం!

కానీ కోటీశు చలించలేదు. వాడు ముందుకు వస్తున్నాడు వాడి చేతిలో బాణాకర్ర కసిగా నలిగిపోతోంది.

"నన్నొదులు...నన్నొదులు..." అడదానిలా ఏడుస్తున్నాడు కామినాయుడు.

"బలవంతంగా సంసార స్త్రీలను చెరిచి వాళ్ల నిండుజీవితాల్ని నాశనం చేసినపుడు, నీ అక్రమాలకు యెదురు తిరిగినవాళ్లందర్నీ కొట్టించినపుడు, రైతులకు కామధేనువులయిన ఎరువు లివ్వక అల్లరి పెట్టినపుడు, చౌకడిపోలో బియ్యం మొక్కలైనవి, చీకటి బజారులో అమ్మి డబ్బు చేసుకొని బీదవాళ్ల కడుపులు కొట్టినపుడు, స్కూల్లో చదువుకునే పసిపిల్లలకు పెట్టే తిండిని అమ్ముకున్నందుకు, నీవు తగిలించుకున్న సుఖరోగాలు, నీ భార్యకు సంక్రమించినపుడు తగిన వైద్యం చేయకుండా, ఆమె సర్వనాశనానికి కారకుడివై హీనాతిహీనంగా సాంలోకి మార్చి, బలవంతపు చావు ఆమెకు తెచ్చిపెట్టినందుకు వొక్క కన్నకొడుకును శత్రువు కన్నా నీచాతినీచంగా చూసి హత్యానేరం మోపి జైలుకు పంపించినందుకు తిండిలేకపోయినా గుక్కెడు నీళ్లుత్రాగి బ్రతికే బీద ప్రజల ప్రాణాలు తీయడానికి, నీళ్లలో విషం కలిపి, నీ స్వార్థం కోసం, పదవి కోసం, ప్రయోజనంకోసం, నీచాతినీచమైన పనులు చేసిన పాపిష్టివాడా! యింక నువ్వు బ్రతికుంటే చరిత్ర చిరకాలం గుర్తుంచుకోవలసిన మానవతారహితమైన పనులు యింకా యెన్ని చేస్తావో... నీవింక బ్రతకకగూడదు..." కోటీశు గుండె మంటలు, బాణాకర్రను జ్వలింపజేసి నాయుడి బుర్రను వేగంగా తాకింది.

అంతే బుర్ర పగిలిన నాయుడు బట్టలు సింధూరంలో ముంచినట్లుగా తయారయ్యాయి ప్రాణం దక్కించుకోవాలన్న భయంతో, తపనతో నాయుడు పరిగెట్టి ముండ్లకంచెల మధ్యన తూలి పడిపోయాడు.

మళ్లా కర్రి కసిగా యెత్తాడు. కోటీశు ఆ దెబ్బతో నాయుడి ప్రాణాలు అనంత విశ్వంలో కలిసిపోతాయి. యెత్తిన కర్రను దించేసాడు కోటీశు.

"ఒరే యెదవా! నీవు సేసిన పాపాలకి నీ పేనం వొకే సారి పోగూడదురా. నీ విలా బాధతో కుక్కసావు సావాల్రా... నీ శవాన్ని రాబందులూ, కుక్కలూ, నక్కలూ, పీక్కుతినాల్రా...థూ..." అని నాయుడిమీద వుమ్మేసి వెనక్కు తిరిగి చెరువుగట్టు క్రింద శ్మశానంవేపు వెళ్లిపోయాడు, కాలరుద్రుడిలా కోటీశు

అప్పుడే రోడ్డుమీద బస్సు ఆగింది. పొత్తిళ్లలో పసివాడితో, తెల్లచీరతో,

నుదుట కుంకుమబొట్టుతో, శారద బస్సుదిగింది. వొకచేతిలో చిన్న బ్యాగు వుంది సత్యవరం బోర్డు చూసేసరికి, తన టీచరుద్యోగం, కామినాయుడి ప్రవర్తనా, లచ్చి మరణం, గంగావతరణం యివన్నీ జ్ఞాపకం వచ్చాయి. రవికి బెయిల్ మీద విడుదల త్వరలో జరుగుతుందని లాయరు స్నేహితుడు నర్సింగ్ హోమ్‌కి వచ్చి ధైర్యం చెప్పాడు.

యివన్నీ తలంచుకుంటూ, నెమ్మదిగా నడుస్తోంది. కొంత దూరం వచ్చేసరికి శారదకు మూలుగు వినిపించింది. రోడ్డుకు ప్రక్కగా ముండ్లపొదల మధ్య నుండి దేకురుకొని బయటకు వచ్చి సీమచింత నీడలో, రక్తపు మడుగులో వున్న కామినాయుడు కనుపించాడు.

"దాహం...దాహం..." మెల్లగా హీనమైన స్వరంతో గిలగిల కొట్టు కుంటున్నాడు

అతన్నీ స్థితిలో చూసిన శారదకు నోట మాట రాలేదు. ఆమె ముఖంలో క్రోధం, అసహ్యం, రెండూ అప్రయత్నంగానే పుట్టుకువచ్చాయి.

"ఈ నీచుడికి యిలాంటి చావు రావల్సిందే..." అని ముఖం తిప్పుకుంది.

"అమ్మా...దాహం...దాహం... నాలిక పిడచ కట్టుకుపోతుంది. నీళ్లు... నీళ్లు...దేవుడోయ్ నీళ్లు...."

నాయుడి కాళ్లు నేలమీద కొట్టుకుంటున్నాయ్. అతను సగం మగతలోనే శారదను గుర్తించాడు.

"తల్లీ...తల్లీ...దాహం... నన్ను బ్రతికించు. నన్ను బ్రతికించు..." గుండెల్ని కోసే నాయుడి కేకలు.

శారదలో చలనం కలిగింది

"భగవాన్! నేను చదువుకున్నదాన్ని. విజ్ఞానంవుంది జాలి వుంది. వృత్తి రీత్యా అధ్యాపకురాల్ని. కానీ ..కానీ...నేను సామాన్యమైన స్త్రీని. నా భర్తమీద హత్యానేరం మోపి ఉరికంబం యెక్కించి నా నుదుట కుంకుమరేఖను చెరిపేయాలనుకొన్నవాడ్ని, కరుణించే శక్తి నాకు లేదు," అనుకుంటూనే పూరి వేపు కదలబోయింది.

కానీ ఆమె కదలలేకపోయింది.

"నిజమే యిలాంటివాడ్ని చిత్రవధ చెయ్యాలి, కాదనను. కాని నీలో దానవత్వానికీ, మానవత్వానికీ మధ్యన వంతెన, నీ మనస్సు మమతలో చీకటి నుండి వెలుగుకు ప్రయాణం చేయాలి. అమృతత్వం సంతరించుకోవాలి, నీ ధర్మం నిర్వర్తించు..." అని శారద మనస్సులో సంఘర్షణ ప్రారంభమైంది.

శారద చుట్టూ చూసింది. బీటలు పడిన పొలాలు. ఆకాశంమీద రాబందులు, గెద్దలు విచ్చలవిడిగా యెగురుతున్నాయి. కొంచెం దూరంలో పొలంలో కుక్క పొకటి ఆకాశంకేసి మోరసాచి హృదయ విదారకంగా రోదిస్తున్నాది.

శారద పొత్తిళ్ళలో పసికందు కదిలింది. ముఖం అచ్చుగుద్దినట్లు భర్త రవి పోలికే. బుల్లి బుల్లి చేతులు, బుల్లి బుల్లి పెదాలు, పాలకోసం ఆమె రొమ్ముల వేపుకు తల తిప్పుకున్నాడు. ఆమెకు పాలు చేపొచ్చాయి.

శారద అంతర్నాళాలలో జాగృతమైన మమత, మాతృత్వం కదలనీయలేదు. కామినాయుడి రక్తసిక్తమైన తలను వొడిలోకి తీసుకుంది.

దిక్కు తెన్నూ తోచక, దాహంతో అలమటిస్తున్న పసివాడు లాగే కనిపించాడామెకు.

అదేసమయంలో బెయిల్ మీద విడుదలైన రవి బస్సు దిగి తొందర తొందరగా యిల్లు చేరుకోవాలని నడుస్తున్నాడు. రవి ఆ దృశ్యం చూసి ఆగిపోయాడు.

శారదలో పొంగి పొరలిన క్షమాభావం, మాతృత్వంతో కరుణతో, ఆర్ద్రత తోను సంతరించుకొని అతనికి స్తన్య మిచ్చింది.

"శారదా..." పిలిచాడు.

ఆ పిలుపులో యే రకమైన అర్థాలున్నాయో, భావానికీ, వర్ణనకీ అతీతంగా వుంది.

శారద రవి వేపు చూసింది.

"ఈ క్షణంలో మీకు తండ్రి కాదు. పరమశత్రువు కాదు. ఈ గ్రామప్రజలకు నరరూప రాక్షసుడు కాదు. దిక్కూ తెన్నూ తోచక దాహంతో అలమటిస్తున్న ఆఖరి శ్వాస పీల్చుకోవాలనుకుంటున్న పసివాడు. నేనే కాదు యే మాతృ మూర్తయినా, అన్నీ మరచిపోయి అతన్ని క్షమిస్తుంది. యిది ధరిత్రి నుండి ప్రతిమాతృమూర్తి సంతరించుకున్న వారసత్వం..." ఆ చూపులో భావాలు అంతర్లీనమైపోయి, అతన్ని పరవశుణ్ని చేసాయి. నాయుడు తృప్తిగా చివరి శ్వాస పీల్చి మరణించాడు.

శారదను లేవదీసి చంటిబాబు పొదివి పట్టుకుని తొందరగా ఊరికేసి నడవటం ప్రారంభించాడు.

అప్పుడే ఆకాశంలో విద్యుల్లత తళుక్కున మెరిసింది. రెండు సంవత్సరాలుగా మంటను భరిస్తున్న భూమిమీద చుట్టూ కమ్ముకొస్తున్న మేఘాలు కుండపోతగా వర్షపు ధారలు అమృతధారలుగా కరిగి పడటం ప్రారంభించాయి.

# నిర్ణయం

ఈరంకి వెంకటరావు



అనంతరామయ్య సాయంత్రం ఐదు గంటలు దాటాక కాళ్ళీడ్చుకుంటూ ఆఫీసులోనుంచి బయట ప్రపంచంలో పడ్డాడు. మామూలుగానే నిస్సారంగా అతనికి అగుపించే జీవితం ఆరోజున మరీ సారవిహీనంగా కనిపించసాగింది. అతని జీవితం వెనకకు తిరిగి తరచి చూసుకొన్నపడల్లా అతనికి అలాగే వుంటుంది. అతనికి యాభై సంవత్సరాలు నిండాయి. శరీరంలో చెప్పుకోదగ్గ రుగ్మతలేమీ లేకపోయినా, అతను జీవిత పరుగు పందెంలో అలసటచెంది, విశ్రాంతి కోరుకొనే స్థితికి వచ్చాడు. శరీరం దారుఢ్యంగా వున్నా, పరిస్థితుల ప్రభావంవల్ల, తీరని కోరికలవల్ల, నెరవేరని ఆశలవల్ల, అసంతృప్తివల్ల బాగా

చితికి, చివికిపోయిన మనస్సు అతని దేహదారుఢ్యాన్ని కూడా కృంగదీసిందనే చెప్పాలి. దగ్గర దగ్గర ముప్పైఏళ్ళుగా అనగా అతను లోవర్ డివిజన్ క్లర్కుగా ప్రవేశించిన దగ్గరనుండీ నెట్టుకుంటూ వస్తున్న యీ గానుగెద్దు జీవితంమీద అతని మనస్సు బాగా తిరుగుబాటు చేస్తోంది.

మనసుకి ఎన్నో కోరికలుంటాయి. అది రెక్కలు కట్టుకొని ఎగిరిపోగలదు. యదార్థంగా తీర్చుకోలేని, సాగించుకో లేని ఎన్నో ఆశలను పెంచుకొని, ఎంతో ఎత్తుకు పెరిగిపోగలదు మనసు అయితే ఆ కోరికలను, ఆ ఆశలను పగటికలలు కంటూ ఊహాలోకంలోనే తీర్చుకోవాలి గాని, అనంతరామయ్యవంటి సామాన్యుడికి, అవి వాస్తవంకావడం అసంభవం. అందుకని తను దాదాపు ముప్పై సంవత్సరాలుగా దొర్లించుకుంటూ వస్తున్నజీవితంమీద విరక్తి తనమీద తనవారిమీద, తన పరిస్థితులమీ దకోపం పగ, కసి. తన జీవితవిధానాన్ని తాను ఊహించుకున్న ఉన్నతస్థానంలోకి తీసుకెళ్ళలేని తన అశక్తతమీద కోపం. తీయని, సుఖకరమైన, ఐశ్వర్యప్రద మైన, ఉన్నతోన్నతమైన జీవితాన్ని ఊహించుకోవడం, దానికోసం అర్రులు చావడం, ఆశపడడం, ఆ జీవితం తనకు లభ్యంకాలేదని విరక్తితో, ప్రస్తుతం నడుస్తున్న, గడుస్తున్న జీవితంతో రాజీ పడలేకపోవడం. ఇది ఎవరికైనా నిర్లిప్తతను, నిరాశను, విరక్తిని కలుగజెయ్యక మానదు.

ఒక వైపు తన జీవితం తాను ఊహించుకొన్న ప్రగతి మార్గంలో ఒక్క అంగుళమైనా కదలకపోగా, తన చుట్టూవున్న వాళ్ళలో కొందరు, వాళ్ళెందుకూ పనికిరానివాళ్ళని తన అంచనాలో కచ్చితంగా నిర్ధారింపబడిన వాళ్ళు తన కళ్ళముందే, చూస్తూ వుండ గానే చిన్నవాళ్ళు పెద్దవాళ్ళయిపోవడం సంఘంలో ప్రయోజకులుగా చెలామణీ అవడం, తన అప్రయోజకత్వాన్ని రెట్టించినట్లుగా, అవహేళనచేసినట్లుగా కనపడసాగింది అనంతరామయ్యకు. కాఫీహోటలు సర్వరుగా పనికి చేరిన వాడు కొంతకాలానికి పెద్ద ప్రొప్రయిట రయిపోయి, పెద్ద హోటలు, లాడ్జింగు నడుపుతున్నాడు. బస్సులో కండక్టరుగా చేరినవాడు ఒక బస్సు, రెండు లారీలకు యజమాని అయిపోయాడు. పదేళ్ళలో; ఒక డాక్టరుగారి ఆస్పత్రిలో పుళ్ళు, దెబ్బలు కడిగి డ్రెస్సింగుచేసే వార్డు బాయ్ పదిహేను సంవత్సరాలలో ఒక టాక్సీ, ఒక లారీ సంపాదించి, రెండు కిళ్ళీకొట్లు నడిపిస్తున్నాడు. కిరాణాకొట్లో తూకాలు తూచేవాడు ఓ పెద్ద కొట్టుకు యజమాని అయాడు. రెండులక్షం రూపాయలు వడ్డీకి తిప్పుతున్నాడు. తాను మాత్రం రైల్వేలో చిన్న గుమాస్తాగా

ప్రవేశించినవాడు యీ ముప్పైఏళ్ళకూ ఒక పెద్ద గుమాస్తాగా అయాడు. ప్రథమ భార్య పదేళ్ళక్రితం చనిపోతే ఆమె చెల్లెల్నే మళ్ళీ పెళ్ళిచేసుకున్నాడు—తాను చేసుకోలేదు. వాళ్ళు ఆమెను తన మెడకు గుదిబండలా వేశారు. అలా చెయ్యడానికీ, అతను చేసుకోవడానికీ ఎన్నో కారణాలు చూపించారు తన అత్త మామలు. వారి దృష్టిలో అవన్నీ సవ్యమైనవే. అప్పట్లో, తనకూ, తన ప్రథమభార్య సంతానానికీ, వండిపెట్ట డానికీ, ఇల్లు చక్కదిద్దుకోడానికి ఒక ఆడదిక్కు కావాలిగదా అని, తనూ తన మరదల్ని పెళ్ళిచేసుకోవడానికి తయారుపడ్డాడు. ఆ పిల్లని తనకు కట్టబెట్టి వాళ్ళ బాధ్యత తీర్చుకున్నారు. తనకీ, ఆమెకూ యిరవై సంవత్సరాలు తేడా. సంసారరథానికి కట్టిన రెండు ఎద్దుల్లో ఒక ఎద్దు వయస్సు మరో ఎద్దు వయస్సుకి రెట్టింపు. ఒకరి భావాలు, ఆశలు కోరికలు, సరదాలు మరొకరి వాటితో సరిపోవు. అతని భార్య రామలక్ష్మి మంచి వయస్సులో వున్నది గనుక ఆమె కోరికలు సహజంగానే ఉరకలు వేస్తూ వుంటాయి. తన రక్తంలో ఉడుకు తగ్గిపోయింది. తన ఆలోచనలు, భావాలు బాధ్యతతో కూడుకొన్నవి. బాధ్యత విస్మరించి తనూ, తన పడుచుపెళ్ళాం రాజా రాణీల్లాగ జీవితాన్ని నెట్టివేసి, అప్పులపాలై, పిల్లల్ని పస్తులు పడుకోబెట్టలేరు. తన మీద ఆధారపడినవాళ్ళకి తిండికీ, గుడ్డకూ, చదువుకూ లోటులేకుండా చెయ్యాలనే బాధ్యత తన గానుగెద్దు జీవితానికి కారణం. తన జీతం రబ్బరులాగ సాగదు; తన జీవితం పంచకల్యాణిలా పరుగులెట్టదు-ఇలాటి భావాలెన్నో అతన్ని ముసురుకొన్నాయి. ఆఫీసులో పని ఎక్కువగా లేదుగాబట్టి యీ ఆలోచనలు అతన్ని మరీ ముంచెత్తాయి. ఆ ఆలోచనలతో కూడిన నిరాశ మరీ కృంగదీసింది.

అనంతరామయ్య టీ దుకాణంలోకి వెళ్ళి టీ త్రాగి వచ్చాడు. అతనికి మామూలు అలవాటుప్రకారం యింటికి వెళ్ళాలనిపించలేదు. అతని కాళ్ళ పార్కువైపు తీసుకొని వెళ్ళాయి. పార్కులో ఒకమూల గడ్డిలో చతికిలబడ్డాడు. పార్కులో పిల్లలు నిశ్చింతగా ఆడుకుంటున్నారు. రిటైరయిపోయిన ముసలివారు ప్రశాంత వాతావరణాన్ని అనుభవిస్తున్నారు. యువతీ యువకులు మధుర భావనాలోకంలో తేలిపోతున్నారు తాను మినహా అందరూ ఏ చీకూ, చింతా లేనట్లుగానే అతనికి కనిపించారు.

పార్కులో ఏకాంతం, ప్రశాంతత లభిస్తుంగనే అతను పార్కుకి వచ్చాడు. పార్కులోని పూలమొక్కలుగాని, చల్లని గాలిగాని, అమాయకంగా ఆడుకుంటూ, ఆనందంతో ఉక్కిరి బిక్కి

తయే పిల్లల నవ్వుమొగాలుగాని అతనికి ప్రశాంతతను కలుగజెయ్యలేదు. అయితే అతని అంతరంగంలో లేని ప్రశాంతత పై వాతావరణంనుంచి ఎక్కడ ఏర్పడు తుంది?

అతని ఊహలన్నీ గజిబిజిగా వుండి చికాకు కలగజేస్తున్నాయి. ఏదో అసంతృప్తి అతన్ని వేధిస్తోంది. సాధిస్తోంది. ప్రతి మనిషికీ సుఖం కావాలి, ఆనందం కావాలి; సంతృప్తి కావాలి. అనంతరామయ్యకు ఆశించినంత సుఖం, ఆనందం, సంతృప్తి జీవితంలో లభ్యం కాలేదు. కోరికల్నీ, ఆశల్నీ, చంపుకుని గడియారం ముల్లులాగ ఒకే పరిధిలో, ఒకే క్రమంలో జీవిస్తున్నాడు. ఆ జీవితం తనకోసం జీవిస్తున్నట్లుగా లేదు. ఎవరికోసమో తను జీవిస్తున్నాడు; ఎవరికోసమో తను చాకిరీ చేస్తున్నాడు. ఎవరికోసమైతే తను చాకిరీచేస్తున్నాడో వారిదగ్గరనుంచి తనకు ప్రేమ, ఆదరం లేవుసరికదా కనీసం సానుభూతి, జాలి, ఒక చల్లని మాటయినకూడా లేవు. అనంతరామయ్య మెదడులో ఏదో మెరుపు మెరిసినట్లయింది. అవును, తనపై తన భార్యకుగాని, పిల్లలకుగాని వాత్సల్యం గౌరవం, సానుభూతి ఏమీ లేవు. వారు అవేమీ తనపట్ల కనపరచినా, కనపరచకపోయినాతానువారినిపోషిస్తాడు ఆదుకుంటాడు.తన శక్తినీ,శ్రమనూవారికి ధారపోస్తాడు. ప్రతిఫలంగా తన భార్య తనకు వండి పెడుతుంది. అంతవరకూ బాగానేవుంది. మరి వీలున్నప్పుడల్లా, అవకాశాన్ని జారవిడువకుండా సూటీపోటీ మాటలతో తనను గాయపరుస్తుంది. తనను ఒక చేతగానివాడుగా నిర్ణయించి, ఆ చేతగానితనాన్ని ఎత్తి చూపిస్తుంది; దెప్పిపొడుస్తుంది. ఆమె మెడలో తను తాళికట్టి వుండకపోతే మరెవరో మహారాజు వచ్చి ఆమెను భార్యగా స్వీకరించి, మొయ్యగలిగినన్ని బంగారునగలూ, బట్టలకొట్టునిండా వుండేటన్ని చీరలూ యిచ్చి, ఆమెకు సర్వసౌఖ్యాలూ, వొళ్ళుకందకుండా జరిపించేవాడని ఆమె అభిప్రాయం కావచ్చు. ఆ కోరిక ఆమెకు తీరకుండా తను అడ్డుపడ్డాడు. అందుకని అతని జీవితాన్ని నరకప్రాయం చెయ్యడమే ఆమె ధ్యేయం.

అనంతరామయ్యకు జీవితంలో ప్రేమాస్పదులుగా కనపడినవారు ముగ్గురే ముగ్గురు. వారు తన తల్లి, తన ప్రథమభార్య, తన అన్నగారు తల్లి పోయి చాలాకాలం అయింది. ప్రథమ భార్యపోయి పదేళ్ళయింది. అన్నగారు రిటైరయిపోయి దూరంగా వున్నాడు. రెండు నెలలకో ఉత్తరం వ్రాస్తూ వుంటాడు. అతని ఉత్తరమే తనకు కొంత ఊరట. తనకు ఆఫీసులోగూడా ఎవరూ స్నేహితులులేరు. అక్కడ కూడా జీవితం యాంత్రికంగానే సాగి

పోతుంది. ఈ పరిస్థితులలో తనజీవితానికి అర్థమేమిటో, తానెందుకు, ఎవరికోసం బ్రతికివున్నాడో, తను జీవితంలో సాధించినదేమిటో అతనికి బోధపడలేదు. మొత్తానికి తన జీవితం వెనక్కి తిరిగి చూసుకున్నా, పెంచుకున్న మమతలు, ఆశలతో ముందుకిచూసినా, సారహీనంగానే కనపడింది.

వారంరోజులు శలవుపెట్టి ఎక్కడైనా వెళ్ళిపోతే అలసిపోయిన తన గానుగెద్దు జీవితానికి విశ్రాంతి లభిస్తుంది. తన భార్యా పిల్లలకు తన మొగం కొన్నాళ్ళు కనబడకుండావుంటే వారికి కొంత కాలానికి తనని చూడాలని అనిపించవచ్చు. తనపై కొంత ఆప్యాయతకలగవచ్చు; ఆ యింట్లో తన స్థానమేమిటో వాళ్ళు గుర్తించవచ్చు.

ఏ మనిషైనా, వస్తువైనా నిత్యం కళ్ళకు కనబడుతూవుంటే ఆ మనిషికి కాని, ఆ వస్తువుకుగాని విలువ ఏమీ వుండదు. ఆ మనిషినిగాని, వస్తువును గాని,పోగొట్టుకున్నప్పుడే,మనిషి విలువ, వస్తువు విలువ తెలుస్తాయి. అందుకని కొన్నాళ్ళపాటు ఎటో వెళ్ళిపోదామనుకొన్నాడు అనంతరామయ్య.

ఆ నిర్ణయం అతను చేసుకోగానే మళ్ళీ ఆ ఆలోచన ఎక్కడ మారిపోతుందోననే భయంతో, పార్కులోంచి లేచి గభాలున బయటికి వచ్చాడు. గబగబా నడిచి రైల్వే అసిస్టెంటు యింజనీరుగారి బంగళాకు వెళ్ళాడు. అదృష్టవశాత్తు ఆయన యింటిదగ్గరే ఉన్నాడు. తనకు నీరసంగా వుందనీ, పనిచేయలేక పోతున్నాననీ, వారం రోజులు శలవుయిస్తే అన్నగారి దగ్గరకు వరంగల్ వెడతాననీ అభ్యర్థించాడు. ఆయన శలవు యివ్వకపోవడానికి ఎన్నో కారణాలుచెప్పి, ఎలాగైతేనేం రెండురోజులు తగ్గించి, ఐదురోజులకు శలవు మంజూరు చేశాడు. ఎలాగూ విజయవాడ దాటి వెడుతున్నావుగనుక ఆ దారిన విజయవాడలో దిగి ఆఫీసులో పనిచూసుకొని రమ్మనమని పనిపురమాయించారు యింజనీరుగారు. ఇంజనీరుగారు విజయవాడలో రైల్వేసూపరింటెండింగ్ యింజనీరు ఆఫీసులో పనిఎలాగూ అప్పజెప్పారుగదా అని, కొంతదూరం ఛార్జీలు కలిసివచ్చినా కలిసిరావడమేనని, అనంతరామయ్య విజయవాడకు రైల్వే పాసు అడిగాడు. ఏ. యి. గారు విసుక్కొంటూ ఒక ప్యాసు వ్రాసి యిచ్చాడు.

అసిస్టెంటు యింజనీరుగారి దగ్గర ఐదురోజులు శలవు, రైల్వేపాసూ సంపాదించేటప్పటికి ఏదో అసాధ్యమైనది సంపాదించానన్న సంతృప్తి, సాధించానన్న ఆనందం అనంతరామయ్యకు కలిగాయి. కాని ఆ ఆనందం కాస్తా యింట్లో అడుగుపెట్టేసరికిహరించి పోయింది.

అనంతరామయ్యకి రైల్వే అసిస్టెంటు యింజనీరు ఆఫీసులో అప్పర్ డివిజన్ క్లర్కుగనుక క్వార్టర్సు యిచ్చారు. అందులో అతనూ, భార్య రామలక్ష్మి, ప్రథమభార్య సంతానం రామశేషు, కృష్ణసాయి, రెండోభార్య సంతానం మంగ, గంగ వుంటున్నారు. రామశేషు బి కాం. ప్యాసయి, పాతికేళ్లు దగ్గర దగ్గరగా వచ్చినా ఖాళీగానే వుంటు న్నాడు. కృష్ణసాయి యింటర్ రెండో సంవత్సరం చదువుతున్నాడు. మంగకి తొమ్మిదేళ్లు, గంగకి ఆరేళ్లు. ఆ ఆరు గురికీ ఆ క్వార్టర్సు యిరుకే. అసలు వాళ్ళ జీవితాలే యిరుకుజీవితాలు.

సాయంత్రం ఐదున్నరకి యింటికి రావలసిన భర్త అనే ద్విపాదం రాత్రి ఏడుగంటలకి కొంపకి చేరుకున్నందుకు రామలక్ష్మి కొరకొర చూసింది — 'నీ సంజాయిషీ ఏమిటన్నట్లు.' అనంతరామయ్య ఆచూపు అర్థం తెలుసు కొన్నట్లుగా ముఖం మళ్ళించేశాడు. నెలలో ఆఖరురోజుల్లో నెలవారీ స్టేటు మెంట్లు తయారుచేసే రోజుల్లోనేగాని అనంతరామయ్య యింటికి ఆలస్యంగా రావడానికి వీలులేదు. ఆరోజు అనంత రామయ్య యింటికి ఐదున్నరకి వస్తే యింటిని అతనికి అప్పజెప్పి ఆడపిల్ల లిద్దర్నీ తీసుకుని సినిమాకి వెడదా మనుకొంది రామలక్ష్మి. ఐతే అనంత రామయ్య ఆలస్యంగా రావడంవల్ల ఆమె సినిమా ప్రోగ్రాంకి ఆటంక మేర్పడింది.

"కాఫీ చల్లారిపోయింది. ప్లాస్కు కొనమంటే కొన్నారు గాదు. స్టౌ వెలిగించుకుని వెచ్చబెట్టుకు తాగండి. మీరు కొన్న ఆవెధవ బొగ్గులు త్వరగా అంటుకొని తగలడవు. నాకు తల నొప్పిగా వుంది. తలనొప్పి మాత్రలు తెచ్చే దిక్కుయినాలేదు, అబ్బా... అమ్మా..." అంటూ ఆవిడ మంచం మీద వాలిపోయింది.

"దారిలో టీ తాగాను. నాకు కాఫీ అక్కరలేదు. వంటయితే భోజనంచేసి, రాత్రి 9 గంటల రైలుకి విజయవాడ వెడతాను," అన్నాడు అనంతరామయ్య.

"కట్టుకున్నది తలనొప్పితో ఛస్తూంటే విజయవాడ, గుంటూరు ఎందుకండీ. ఎంతసేపూ మీ ఆఫీసూ, మీ ఫైల్సూ, మీ బిల్లులూ, మీ స్టేటు మెంట్లేనా, యింట్లోవాళ్ళకి ఏంతావాలో చూడడముందా?" అన్నది రామలక్ష్మి, అనంతరామయ్య ప్రయాణమై వెళ్ళ డానికి తన నిరసన తెలుపుతూ.

"అమ్మా, నీకు తలనొప్పిగావుంటే సినిమాకి ఎలాగ వెడదామన్నావే?" అంది కూతురు అమాయకంగా.

"ఛా, నోర్ముయ్. అప్పటికి తల నొప్పి నాకెక్కడిది.అంతా అరగంటయి పట్టుకుంది. అమ్మా...అబ్బా..."అంటూ దీర్ఘాలు తీసింది.

అనంతరామయ్య వెంటనే చెప్పులు తొడుక్కొని బజారుకెళ్ళి రెండురకాల తలనొప్పి మాత్రలు కొనితెచ్చి, ఆమె కిచ్చి, 'స్టౌ' వెలిగించి కాఫీ వెచ్చబెట్టి యిచ్చాడు. ఒకమాత్ర వేసుకొని, కాఫీ తాగి కళ్ళుమూసుకుని పడుకొంది. అదొకరకమైన సత్యాగ్రహం. అది అనంతరామయ్యకు కొత్తగాదు.

తనకి రైలుకి టైమయిపోతూవుంటే తనే కంచం పెట్టుకొని, పీటవేసుకొని వడ్డించుకొని భోజనం అయిందని పించాడు. ఆ తర్వాత సంచీలో రెండు పంచలు, రెండు చొక్కాలు, కండువా, తువాళ్ళు కుక్కుకొని ఆదరా బాదరా స్టేషనుకి బయలుదేరాడు. అంతవరకూ తన చర్యలు కనిపెడుతున్న తన భార్య "ఎప్పుడు వస్తారు?" అని అడిగింది. తనకి వళ్ళుమండింది. సమాధానం చెప్పకూడదనుకొన్నాడు గాని, ఆకోపం లోనే "ఈ కొంపకి రావడమంటూ వుంటే, ఐదురోజులు పోయాక" అన్నాడు. "ఏం? మళ్ళీ రాకూడదనే వెడుతున్నారా?" అన్నది. ఆ మాటకు ఏమీ సమాధానం చెప్పకుండా అతను బయటికి వచ్చేశాడు.

దారిలో పెద్దకొడుకు రామశేషు కనపడితే తాను తన అన్నగారింటికి వరంగల్ వెడుతున్నాననీ, నాలుగైదు రోజుల్లో తిరిగి వస్తాననీ, జాగ్రత్తగా వుండమనీ హెచ్చరించాడు. "నాన్నా, పెదనాన్నతో చెప్పి అక్కడేమైనా వుద్యోగంవుంటే నాకు చూడమనిచెప్పు నాన్నా. ఆయన ప్రయత్నిస్తే ఏదో ఒకటి దొరక్కపోదు" అన్నాడు రామశేషు.

"సరేలే, అలాగే" అంటూ వెళ్ళిపోయాడు అనంత రామయ్య స్టేషను వైపు.

రైల్లో కూర్చున్నాక అనంత రామయ్య ఆలోచనలు మళ్ళీ తనజీవితం మీదకి మళ్ళాయి. తన భార్య ప్రవర్తన అతనికి మాటిమాటికీ జ్ఞాపకంవచ్చి బాధకలుగుతోంది — ఆమె ప్రవర్తన తనకు కొత్తకాకపోయినప్పటికీ, ఆమెకి తనమీద కొంచెమైనా — ప్రేమమాట దేవుడెరుగు — భక్తిగాని, భయంగాని, గౌరవంగాని లేవు. తనను ఆమె ఒక బంట్రోతుకన్నా హీనంగా చూస్తోంది— అదీ తన పిల్లలముందే. తన పిల్లలకు తనపట్ల వారి అంతరాంతరాలలో ఏ కాస్త గౌరవంవున్నా, అభిమానంవున్నా ఆమె తన ప్రవర్తనతో అదికూడా లేకుండా చేస్తోంది. అతనికి యింట్లో వుండవలసిన స్థానం ఆమె యివ్వనపుడు పిల్లలుమాత్రం ఎందుకిస్తారు? జీతం రాగానే తను పట్టుకొనివెళ్ళి ఆమెకు అప్పగించాలి! తనకి డబ్బుతో ఏ అవసరం వున్నా ఆమెను అడిగితీసుకో వలసిందే జీతం పట్టుకొని వెళ్ళినప్పుడల్లా "యింతేనా" అంటుంది. అందే

నువ్వు పైన యింకేమీ సంపాదించలేదా? అని; 'నీ ప్రయోజకత్వం యింతేనా?' అని. అవును. తన పైన ఏమీ సంపాదించలేదు. యన్.ఎం.ఆర్. మజ్దూర్ల కాయకష్టాన్ని దోపిడీచేసే వాళ్ళున్నారు. కంట్రాక్టరులకి లాభం చూపెట్టి, పర్సంటేజి తీసుకునేవాళ్ళున్నారు. అయితే తనకాపని ఎంతమాత్రం యిష్టంలేదు— చేతకానూకాదు. రెండోపెళ్ళి భార్యలైనా భర్తలను గౌరవంగా చూసేవాళ్ళు, భయభక్తులు ప్రదర్శించేవారు ఎంతో మంది వున్నారు. తన ఖర్మ ఏమిటో యిలాటిది తన పాలబడింది. తాను జీవితంలో చేసిన బుద్ధితక్కువపని ఏదైనావుంటే అది మళ్ళీ పెళ్ళిచేసుకోవడమే. తన ప్రథమభార్య చెల్లెలే గదా, ఆమెలా అణకువగా, ఆప్యాయతగా అనురాగంగా వుంటుందని వూహించాడు కాని యీామె కొరకరాని కొయ్యగా తయారైంది. అనుక్షణమూ తనను రెచ్చగొట్టి, వేధించి ప్రత్యక్ష నరకాన్ని రుచిచూపించడమే ఆమె ధ్యేయమైనట్లు తనకు కనిపిస్తోంది. ఆమె అలా ప్రవర్తిస్తోంది. ఈ బ్రతుకు బ్రతకడంకంటె చావడం మేలేమో— అవును; తను ఎవరికోసం బ్రతకాలి. ఎందుకోసం బ్రతకాలి తను చచ్చిపోతే ఏడ్చేవాళ్లెవరున్నారు-తన అన్నగారు తప్ప. ఆయనైనా తననీ ప్రత్యక్ష నరకంనుంచి రక్షించి ఒడ్డున పడవెయ్య గలడా? పోనీ, తను ఏ రమణాశ్రమమో అరవిందాశ్రమమో, హృషీకేశమో పోతే. అక్కడ తనచేత ఏదోపని చేయించుకొని యింత తిండిపడేస్తే అక్కడ పడివుండడం మంచిదనుకున్నాడు ...... ఇలా ఆలోచిస్తూనే అనంతరామయ్య రైలు కుదుపుకి నిద్రలోకి జారుకున్నాడు. ఏలూరు స్టేషను వచ్చేసరికి అతనికి మెలకువ వచ్చింది. లేచి, చూసేసరికి పక్కనే పెట్టుకొన్న అతని సంచీలేదు. రైల్వేప్యాసుతోసహా సంచీ ఎవరో ఎత్తుకుపోయారు.

అనంతరామయ్య కట్టుబట్టలతో, జేబులో కొద్దిడబ్బుతో విజయవాడలో దిగి అక్కడి రైల్వేవారితో తన అవస్థ చెప్పుకొని స్టేషను ఆవరణలోంచి బయటపడ్డాడు. పైమీద వస్త్రంకూడా పోయిన నలమహారాజుకంటె తన పరిస్థితి కొంతనయమని సంతృప్తిపడ్డాడు. అసిస్టెంటు యింజనీరుగారు అప్పగించినపని అంత తొందరపని కాదుగనుక, మళ్ళీ ఆ కాగితాలన్నీ ఆఫీసుకివెళ్ళి తయారుచేసి, సంతకాలు చేయించి పంపించవలసినవే గనుక, సూపరింటెండింగు ఇంజనీరు వారి ఆఫీసుకు వెళ్ళి వారి ఆఫీసులో పని చూడకుండానే వరంగల్‌కి వెళ్ళిపోవాలని నిశ్చయించుకొన్నాడు. తాను రమణాశ్రమంగాని, అరవిందాశ్రమంగాని వెళ్ళి వుండిపోవాలని చేసుకున్న



నిర్ణయానికి ప్రారంభసూచనగానే తన సంచీ పోయిందని అనుకున్నాడు.

విజయవాడ పూళ్ళోకి వెళ్ళి చిన్ననాటి స్నేహితుణ్ణి ఒకతనిని కలుసుకొని కొంతడబ్బు అడిగి తీసుకొని ఒక పంచ, తువ్వాలు కొనుక్కొని, స్టేషనుకి వచ్చి వరంగల్ టిక్కట్టు తీసుకొని అనంతరామయ్య ప్రయాణం సాగించాడు.

అన్నగారు, వదినగారు, పిల్లలు చూపిన ఆదరణలో, ఆప్యాయతలో, వాత్సల్యంలో తన యింటి నరకబాధ తాత్కాలికంగా మరచిపోయాడు. రెండు మూడు పర్యాయములు తన మానసిక క్షోభను అన్నగారితో చెబుదామనుకున్నాడుగాని, తన కష్టాలతో, సమస్యలతో ఆ వయస్సులో ఆయనను క్షోభపెట్టి ఆయన మనస్సు వికలంచెయ్యడమెందుకని పూరుకొన్నాడు.

అనంతరామయ్య కాలక్షేపంకోసం రోజూ లైబ్రరీకి వెళ్ళి పేపరు చదివేవాడు; తనకు విసుగుపుట్టేవరకూ పూరంతా తిరిగి వచ్చేవాడు. అనంతరామయ్య వెళ్ళిన నాలుగోరోజున ఒక

ప్రకటన అతని ఫోటోతోసహా పేపర్లో ప్రకటించబడినది,అతనిని ఆకట్టుకుంది. అకస్మాత్తుగా తనఫోటో పేపర్లో చూసే టప్పటికి అతనికి చాలా ఆశ్చర్యం కలిగింది. తనఫోటో క్రింద యీ విధంగా ప్రకటింపబడివుంది. "పూజ్యులు, నా భర్తగారైన అనంతరామయ్యగారు రాజమండ్రి స్టేషనులో ప్రమాదవశాత్తు నాలుగురోజులక్రితం రైలుక్రిందపడి మరణించి పరమపథము చేరుకొన్నారు. కర్మ సామర్లకోటలో రైల్వే క్వార్టర్సులో పదవరోజు బుధవారం జరుగును. వారి ఆత్మకు శాంతి కలుగుగాక యని ప్రార్థించు వారి ధర్మపత్ని రామలక్ష్మి. పుత్రరత్నములు రామశేషు, కృష్ణసాయి పుత్రికారత్నములు మంగ, గంగ "

అనంతరామయ్యకు యీ ప్రకటన చదవగానే గొంతు తడి ఆరిపోయింది. ఆ ఫోటో తనదే, ఆ ప్రకటన వేయించి నది తనభార్యే అందులో ఏమీ సందేహం లేదు. కానీ, తను నిక్షేపంగా అన్నగా రింటికి వస్తే తాను చనిపోయినట్టు, అందులోనూ రాజమండ్రి స్టేషనులో— ఇది ఎలా సంభవించింది? రాజమండ్రిలో తాను దిగనైనాలేదే. ఒకవేళ తాను యింటికి తిరిగిరానని ఉక్రోషంగా అన్న మాటలకు కక్షతో యీ తప్పుడు ప్రకటన యిచ్చిందా? దానివల్ల ఆమెకు గాని, ఆమె సంతానానికిగాని ఒరిగే లాభమేమిటి? అని పరిపరి విధాల ఆలో చించడం మొదలు పెట్టాడు. అతనికేమీ అంతుచిక్కలేదు. వికలమైన మనసుతో అన్నగారియింటికి వెళ్ళిపోయాడు.

ఇంటికి చేరుకోగానే అన్నగారు "ఒరేఅనంతం ఒక తమాషా జరిగిందిరా. నీ పేరుగలవాడెవరో రాజమండ్రి స్టేషను యార్డులో రైలుక్రిందపడి చచ్చిపో యాడు. అతని ముఖమంతా పోల్చ డానికికూడా వీలులేకుండా చితికి పోయిందట. అతని దగ్గరవున్న సంచీలో రైల్వే ప్యాసుమీద పేరు, సామర్లకోట నుంచి బయలుదేరినట్లు వుండే అది నువ్వే అనుకొని రైల్వేవారు ఆ శవాన్ని మీ యింటికి తీసుకొని వెళ్ళి అప్పగించి తాత్కాలికంగా వెయ్యిరూపాయలు ఎక్స్‌గ్రేషియాగా యిచ్చారట. ఆ వార్త మొన్ననే పేపర్లో పడిందని ఎవరో చెబితే తెప్పించి చూశాను. ఈ వేళ పేపర్లో మీ ఆవిడ, పిల్లలు నీఫోటోతో ప్రకటనే యిచ్చారు. నువ్వు వెంటనే క్షేమంగా వున్నట్లు వాళ్ళకి టెలిగ్రాం యిస్తే మంచిదేమో" అన్నారు.

ఆ వార్త నేను చూడలేదుగాని, రామ లక్ష్మి వేయించిన ప్రకటన చూశా నన్నయ్యా. నేను రైల్లోంచి ప్రమాద వశాత్తు యార్డులో వున్న పట్టాలమీద పడివుండవచ్చుననీ, మరో రైలింజను మీదనుంచి వెళ్ళడంవల్ల చనిపోయానని ఆ ప్యాసునుబట్టే గుర్తించి వుంటారు. కాని, ఆ సంచీ, ప్యాసు నావే.

అలసిపోయి నేను నిద్రపోతూంటే ఎవడో దొంగ నా సంచీ దొంగిలించాడు. వాడు రాజమండ్రి ప్రాంతంలో దొంగిలించి దిగి పారిపోతూ పట్టాలమీద పడి, ప్రమాదానికి గురై చనిపోయి వుండాలి. ఆ శవానికి పోస్ట్‌మార్టమ్ అవకుండా నేనే చనిపోయానని రైల్వేవారు నమ్మితే మీ మరదలికి కొంత పెన్షను, యాభై వేల రూపాయలనగదు, ఒక పిల్లవాడికి ఉద్యోగంకూడా ప్రభుత్వం యిస్తారు. నేను బయటపడితే వాళ్ళకు అవేమీ దక్కవు. నేను బ్రతికి వున్నట్లుగా బయటపడి, ఆ డబ్బూ, సదుపాయాలూ వాళ్ళకు దక్కకుండా చెయ్యమన్నావా? లేక చచ్చినట్టు పడివుండి ఆ డబ్బు, సదుపాయాలు వాళ్ళకు దక్కేలాగ చెయ్యమంటావా ?

ఇంత జటిలమైన సమస్యను సూటిగా అడిగితే, సూక్ష్మంగా తేల్చివేయడం ఎవరికీ సాధ్యంకాదు. అంనతరామయ్య అన్నగారు ఎటూ తేల్చి చెప్పలేక పోయాడు. బ్రతికి, ఆరోగ్యంగా వున్న తమ్ముణ్ణి, జీవించివుండీ శవంలా శేష జీవితాన్ని గడపమని ఎలా సలహా యివ్వగలడు ? అది కాదని, బ్రతికి వున్నట్లుగా ప్రకటించి అతని జీవితంలో పొదుపుచేసి మిగల్చలేనంత డబ్బు, కుటుంబానికి పెన్షను, నిరుద్యోగిగా కాలం వృధాచేస్తున్న కొడుకుకిఉద్యోగం యిటువంటి సదుపాయాలన్నీ వదులుకోమని ఎలా చెప్పగలడు. ఆయనకు యీ ధర్మసందేహం విడదీయరాని సమస్యగా తోచింది.

అప్పుడు అనంతరామయ్యే తన కుటుంబ పరిస్థితులూ, తనను యింట్లో వాళ్ళు అమర్యాదగా చూసే తీరు, తాను తన భార్య కోరికలూ, కలలు తీర్చలేని అసహాయస్థితి, యీ పరిస్థితులలో తాను ఏ ఆలోచనతో వరంగల్లు వచ్చినదీ, ప్రయాణంలో ఏ ఆశ్రమానికైనా వెళ్ళిపోవాలని చేసుకొన్న నిర్ణయం యివన్నీ చెప్పాడు. తన తమ్ముడిలో అగ్ని పర్వతం రగులుతూవుంటే తన ప్రశాంతతకు, స్వస్థతకు భంగం కలిగించడ మెందుకని నాలుగురోజులైనా అనంతరామయ్య నోరు విప్పకుండా, తన కష్టాలు చెప్పుకోకుండా వేదన ననుభవించడం ఆయనకు ఆశ్చర్యం కలిగించింది. సంగతంతా పూర్వాపరాలు విన్నాకకూడా ఆయన యిదమిద్ధంగా తేల్చి ఏమిచెయ్యాలో తమ్ముడికి చెప్పలేకపోయాడు.

చివరికి అనంతరామయ్యే ఓ మార్గం సూచించాడు. అన్ననూ, వదిననూ, పిల్లలనూ, అందరినీ 'తన కర్మకు' సామర్లకోట వెళ్ళి రమ్మన్నాడు. కర్మకాండ ముగిసింతర్వాత తన పిల్లలను వాళ్ళ అమ్మమ్మగారింటిదగ్గర దిగబెట్టి, తన భార్య నొక్కతైనా స్థలం మార్పు కని వరంగల్లు తీసుకొని రమ్మన్నాడు.

ఈలోగా తను గెడ్డం, మీసం పెంచుకొని, యింట్లోనే పడివుంటానన్నాడు. తన భార్య వచ్చిన తర్వాత ఆమెతో ఆలోచించి తను చచ్చినట్లుగా వుండాలో బ్రతికివున్నట్లుగా బయటపడాలో ఆమె ఎలాగ చెబితే అలాగ చెయ్యవచ్చునని చెప్పి, అన్నగారినీ, వదినగారినీ పిల్లలనూ ప్రయాణానికి సిద్ధమవమన్నాడు. తన భార్య వరంగలు వచ్చేదాకా తాను బ్రతికి వున్నట్లుగా తన భార్యకుగాని, మరెవరికిగాని ఎవ్వరూ చెప్పకూడదని కట్టుదిట్టం చేశాడు.

ఈ ఆలోచన అతని అన్నగారికి కొంతలో కొంత నచ్చింది. తమ్ముణ్ణి యింట్లోనే జాగ్రత్తగా వుండమని వారందరూ లేని దుఃఖాన్ని ముఖాలపైకి తెచ్చుకొని సామర్లకోట బయలుదేరి వెళ్ళారు.

ఎనిమిదిరోజులు పోయినతర్వాత అనంతరామయ్య అన్నగారి కుటుంబం అతని భార్య వరంగల్లులో దిగారు. వాళ్ళ యింటికి వెళ్ళేసరికి యిల్లు తాళం వేసివుంది. చుట్టుప్రక్కలవారిని వాకబు చేయగా ఎవరో గెడ్డాలు వున్నాయన మీరు వచ్చి అడిగితే తాళాలు యివ్వమని చెప్పి యిచ్చి వెళ్ళారని తెచ్చియిచ్చారు.

అనంతరామయ్య అన్నగారు తలుపులు తీసుకొని లోపలికి వెళ్ళాక బల్లమీద ఉత్తరం కనపడింది. అందులో యిలా వ్రాసివుంది.

"మీరు యిప్పటివరకూ ఆమెకేమీ చెప్పకపోతే యికమీదట కూడా చెప్పకండి. నేను మరణించినానని అందరితో పాటు ఆమె కూడా అనుకోవడమే మంచిది. నేను చేరదల్చుకున్న చోటికి వెళ్ళిపోతున్నాను. ఎవరికి కావలసినది వారికి దక్కుతున్నప్పుడు విచారమెందుకు? ఎవరికెవరూ లేరు. మానవులు అనాదరణ చేశారని, అవమానిస్తున్నారని బాధపడడంకంటె, శాశ్వత విలువలకోసం తాపత్రయపడడం మంచిదని తోచింది. కర్తవ్యం తోచక ఊగులాడుతున్న సమయంలో భగవంతుడే కర్తవ్య నిర్ణయంచేశాడు. శలవు."



ఉదయం ఎనిమిదిగంటల సమయం—

నల్లని కారు నున్నటి రోడ్డుమీద రాకెట్‌వలె దూసుకుపోతున్నది

డ్రైవ్‌చేస్తున్న కృష్ణమోహన్ చాలా హుషారుగా ఉన్నాడు.

"తెలియని ఆనందం

నాలో కలిగెను ఈ ఉదయం..."

పాతపాటను కూనిరాగం తీస్తున్నాడతను.

చేతిలో స్టీరింగ్‌వీల్ ఉన్నా, కళ్ళు రోడ్డుని చూస్తున్నా, మనసులో ఏవేవో సంఘటనలు మెదులుతున్నాయి.

అతనికి ఇరవై ఆరేళ్ళు, ఐదేళ్ళ క్రితం ఎం.ఎస్‌సీ యూనివర్సిటీ ఫస్ట్ రాంక్‌లో పాసయినాడు.

తల్లిదండ్రులు, దగ్గర బంధువులు ఎవరూ లేరతనికి. ఆస్తిపాస్తులూ లేవు. ధర్మాత్ముల దయవలన చదువుకొని పెద్దవాడయినాడు.

స్వయంకృషితో పైకి రావటమనే దానికి ఉదాహరణగా కృష్ణమోహన్‌నే చెప్పుకోవాలి.

ఎం.ఎస్‌సి. పూర్తవుతూనే అతని తెలివితేటలకు మెచ్చి ఒక ఇండో-అమెరికన్ సంస్థ ఉద్యోగం యిచ్చింది. ఉద్యోగం చేస్తూనే పార్ట్-టైమ్‌గా రిసెర్చిచేయసాగాడు. ఇటీవలనే అతన్ని పిహెచ్.డి డిగ్రీకి అర్హుడుగా నిర్ణయించింది విశ్వవిద్యాలయం. వచ్చే వారం-ఇదేరోజున-తను నల్లకోటు వేసుకొని, స్టేజీ ఎక్కి డిగ్రీ అందుకుంటాడు సగర్వంగా ఆ దృశ్యాన్ని ఊహించింది మనసు

ముందు వెళ్తున్న కారు నెమ్మదిగా పోతున్నది. కృష్ణమోహన్‌కి చిరాకని పించింది. స్పీడ్ ఎక్కువచేసి, ఆకారుని 'ఓవర్‌టేక్' చేశాడు. మనసు మంచి మూడ్‌లో ఉన్నప్పుడు కారు వేగంగా పోతేనే సరదాగా ఉంటుంది!

"కష్టాలెప్పుడూ ఒకటొకటిగారావు, పరంపరలుగా ఒకేమారు వచ్చేస్తాయి" అని షేక్స్‌పియర్ అన్నాడట. కష్టాల మాటేమోకాని, తన విషయంలోసుఖాలు మాత్రం అలాగే వచ్చేస్తున్నాయి! పిహెచ్.డి. పూర్తవుతూనే పనిలో తనుచూపిస్తున్న సమర్థతకు గుర్తింపుగా కంపెనీ ప్రమోషన్ ఇచ్చింది. ఈ క్రొత్తహోదాలో అరునెలలపాటు అమెరికా వెళ్ళి ట్రెయినింగ్ అయి రమ్మన్నది. ప్రయాణం ఇంకో నెల రోజుల్లోనే!

పేదరికంలో పుట్టిపెరిగిన తనను ఇంతటి హోదా వరిస్తుందని ఎన్నడయినా కలగన్నాడా? దూరాన ఉన్న కాలేజీకి వెళ్ళేందుకు బస్ ఎక్కలేని తను, విమానంలో విదేశాలకు వెళ్ళనున్నాడు!

కారు కిటికీలోంచి చల్లని గాలి వచ్చి జుట్టు రేపేస్తున్నది. ఆ చల్లనిగాలి

సుప్రియ తలపులనుకూడా లేపింది మదిలో.

సుప్రియ!

ఆమెను తలచుకుంటూండగానే పెదవులపైన చిరునవ్వు విరిసింది.

అన్నిటికీ మించిన అదృష్టం సుప్రియ తనదవటం.

'యూనివర్సిటీ బ్యూటీ' అని పిలిచే వారు అందరూ సుప్రియని. రూప లావణ్యంతోపాటు, ధనవంతుల బిడ్డే మో రకరకాల చీరలతో, నగలతో మెరిసి పోతూ బంగారు బొమ్మలా జిగేలు మంటూ ఉండేది.

దూరంనించి చూసి ఆరాధించేవాడు కాని, తనకు ఆమెతో పరిచయం లేదు.

ఇటీవల ఆమె తండ్రి తనను కలుసుకొని, పరిచయం చేసుకొని, ఇంటికి ఆహ్వానించి, ఆపైన సుప్రియను తనకు ఇచ్చి పెళ్ళిచేయాలనే ఉద్దేశం బయటపెట్టాడు.

ఆనందంతో, ఆశ్చర్యంతో ఏమీ మాట్లాడలేకపోయాడు కృష్ణమోహన్.

తమ వివాహం ఫారిన్ వెళ్ళేలోపలే చేసి, ఆమెనుకూడా తనతో తీసుకు వెళ్లే ఏర్పాట్లు జరిగాయి. పెళ్ళి యింకా రెండు వారాలున్నది. ఈలోపుగా తామి ద్దరూ సినిమాలు, షికార్లతో రోజులు నిమిషాల్లాగా గడిపేస్తున్నారు.

ఇంతకు మించిన సంతోషం ఏ మనిషికయినా ఉంటుందా ?! కృష్ణ మోహన్‌కు ప్రపంచం ఎంతో సుంద రంగా కనిపించటంలో వింత ఏమీ లేదు!

కారు చురుగ్గా అతని కంపెనీవైపు పరిగెడుతున్నది.

మనసు సంతోషసాగరంలో తేలు తున్నది.

ఎదురుగా ... ఎదురుగా... ఏమిటి?? ఓ అయిదారేళ్ళ అమ్మాయి... చేతిలో మట్టిబొమ్మలతో ఆడుకుంటూ, ఏదో పాడుకుంటూ వస్తోంది...పాపా... ఆగు...బొంయ్ మంది హారన్...

"అమ్మా!" అరిచింది పాప.

కీచుమంటూ ఆగింది కారు.

రక్తపు మడుగులో ఆ చిన్నారి శరీరం.

కృష్ణమోహన్ ముఖమంతా చెమట. కాళ్ళు, చేతులు వణుకుతున్నాయి. అతి కష్టంమీద కారు తలుపు తీసుకొని క్రిందకి దిగాడు.

నిశ్చలంగా పడిఉంది పాప. ప్రాణం ఉందోలేదో? మెల్లిగా వంగొని నాడి చూడబోయాడు వణుకున్న చేతులతో. సాధ్యమవలేదు.

రోడ్డుకిరువైపులా దృష్టి సారించాడు. నిర్మానుష్యంగా ఉంది. కాని ఒకటి, రెండు నిమిషాల్లో ఎవరో ఒకరు రాకపోరు.

ఏంచేయాలి ???

ప్రశ్నార్థకం ఇంతై, అంతై నిలిచింది ముందు.

పాపని కారులో వేసుకొని హాస్పిటల్‌కి వెళ్ళాలి ముందు. తర్వాత ఆలోచించాలి ఇతర విషయాలు.

రక్తసిక్తమయిన ఆ దేహాన్ని లేవనెత్తటానికి సంసిద్ధుడయినాడు.

అంతలో మరో ఆలోచన ఎదుట నిలిచి, అతన్ని నిటారుగా నిలబడేటట్లు చేసింది.

పోలీసులు వస్తారు. తనను అరెస్టు చేస్తారు.

'చిన్నపిల్లకి రోడ్ క్రాస్ చేయటం ఏం తెలుస్తుంది? నీవే జాగ్రత్తగా కారు పోనియ్యద్దా' అంటారు.

నిజమేగా ... తన ఆలోచనల్లో తానుండి ఆ పాప సమీపించేవరకు చూసుకోలేదు. తన ఆటల్లో తాను ఉండి ఆ పాపా కారుని చూసుకోలేదు.

మరొకమారు చూశాడు క్రిందకి. ఆ పిల్ల ఒళ్ళంతా రక్తమే. ముఖంమాత్రం స్వచ్ఛంగా ఉంది కళ్ళు తెరిచే ఉన్నాయి కాని, అవి గాజుకళ్ళలా నిర్జీవంగా ఉన్నాయి.

రోడ్డుకి ఇరువైపులా ఇంకొకసారి చూశాడు కృష్ణమోహన్. ఎవరూలేరు. అది ఊరి పొలిమేర. దూరదూరంగా తప్ప ఇళ్లులేవు. సందడేలేదు.

ఆ పిల్ల ప్రాణం పోయేఉంటుంది. ఇప్పుడు చేయగలిగిందీ లేదు. కావాలని నేరం బయటపెట్టుకొని తన భవిష్యత్తు తానే నాశనం చేసుకోవటం ఏమంత వివేకం?

లారీ ఒకటి వస్తున్న చప్పుడయింది. ఇక ఆలోచించలేదు అతను. చటుక్కున కారెక్కాడు.

పాప చేతిలోనించి ఎగిరి, అల్లంతదూరాన పడి విరిగిపోయిన మట్టిబొమ్మలు వెక్కిరిస్తున్నట్లే కనిపించాయి. అతను కారెక్కుతుంటే.

చూపులు మళ్ళించుకొని, వేగంగా వెళ్ళిపోయాడు.

* * *

తానిక ఈరోజుకి ఆఫీసుకి వెళ్ళలేడు. అదిమాత్రం తనకు చేతకాదు. ఇప్పుడు కాస్సేపయినా ఒంటరిగా ఉండాలి. చెదిరిన మనసుని నిబ్బరించుకోవాలి ఆలోచన సరిగా పేర్చుకోవాలి.

కారుని యింటికి పోనిచ్చాడు కృష్ణమోహన్. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. ఆ యింట్లో క్రింద ఇంటివాళ్లు, పైన అతను ఉంటున్నారు. నాలుగురోజులుగా ఇంటివాళ్లు ఊళ్ళోలేరు. అదీఒకఅదృష్టమే.

కారు గారేజ్‌లో పెట్టి వచ్చేస్తుంటే చూశాడు. ఎడమవైపు బ్రైరుకి రక్తం. తన తెల్లని పాంటుకీ అంచులో అంటుకొని ఉంది రక్తం

కడుపులో ఎవరో చేయిపెట్టి మెలిపెట్టినట్లే అయింది.




తూలుతున్న శరీరాన్ని అదుపులో పెట్టుకోవటానికి ప్రయత్నిస్తూ, తడి గుడ్డతో షైరుని తుడిచాడు. తర్వాత వెళ్ళి, పంపు క్రింద కాలు ఉంచి పాంటు అంచునీ కడిగేశాడు.

బట్టలు మార్చుకొని ప్రక్కపై వాలాడు. ఏదో నిద్రలో నడుస్తున్నట్లు ఈ పనులన్నీ చేశాడేకాని అతని మనసు స్వాధీనంలో లేదు.

నిర్జీవమైన ఓ జత కళ్ళు అతన్ని వెంటాడుతున్నాయి.

ఆ పిల్ల ఎవరో!?

పనిపాటలు చేసుకొనే వాళ్ళ అమ్మాయిలాగా ఉంది. విరిగిపోయిన మట్టిబొమ్మలు అతని కళ్ళముందు నిలిచాయి.

"అమ్మా!" ఆ పిల్ల అరుపు భయంకరంగా చెవుల్లో వినిపిస్తూనే ఉంది.

ఎవరయినా హాస్పిటల్‌కి తీసుకు వెళ్ళారా! బ్రతికిందా? లేదా?

ఆ పాప బ్రతకాలి - మనసులోని శక్తంతా వెచ్చించి గాఢంగా కోరుకున్నాడు.

కాని కోరుకున్నవన్నీ నిజాలవుతాయా?

కనీసం, నిజం చేయటానికయినా తను ప్రయత్నించాడా?

అమానుషంగా వదిలేసి పారిపోయాడు.

తన ప్రవర్తన ఎంత అసహ్యంగా ఉంది! అతనికి సిగ్గుతో ఒళ్ళు సెగలు కక్కినట్లే అయింది.

కాని ఆ పిల్లను తను హాస్పిటల్‌కి తీసుకువెళ్ళి ఉంటే, తన నేరాన్ని వెల్లడి చేసుకుంటే, తనకు ఏం లభించేది? అరెస్ట్-కోర్టు-శిక్ష-

ప్రమోషన్ కాన్పించేది, అసలు ఉద్యోగమే ఉండేదీ-

సుప్రియతో పెళ్ళి కాన్పించేది—

ఇంతవరకు తనను గౌరవించిన వాళ్ళంతా అసహ్యించుకొనేవారు —

తను ఇదంతా భరించలేడు! భరించ లేడు!!

ఎంతో కష్టపడి ఈ దశకు వచ్చాడు తను. రెప్పపాటు కాలంలో జరిగిపోయిన ఈ సంఘటనవలన ఇదంతా కూలిపోతే, తను భరించలేడు.

మబ్బుకమ్మితే చీకటి ఆవరిస్తుంది. మబ్బు తొలిగితే వెలుగే నిండుతుంది.

ఈ సంఘటనవలన తన జీవితం చీకటి కారాదు అందుకే కదూ తను పారిపోయి వచ్చాడు.

ఆ పాప ప్రాణం ఉన్నదో, పోయిందో?

మళ్ళీ అదే ప్రశ్న.

నిర్జీవమైన కళ్ళు ఎదుట నిలిచాయి.

పాప స్వరం — "అమ్మా!" చెవుల్లో గింగురుమంది.

తను హంతకుడు!

తల వేడెక్కిపోతున్నది. ఆ కళ్ళు సదా వెంటపడుతుంటే, ఆ స్వరం నిత్యం చెవుల్లో వినిపిస్తూఉంటే మాత్రం తను భరించగలడా?!

చావుబ్రతుకుల్లో ఉన్న పాపని వదిలేసి తనదారి తను చూసుకున్నాడే- ఈ గిల్టీఫీలింగ్ తనను వదులుతుందా?

లేచి ఏదయినా చేయాలి...ఆలోచ నలనుంచి తప్పించుకోవాలి...

పోలీసుల వద్దకు వెళ్ళి, జరిగింది చెప్పేస్తే ఈ మానసికమయిన శిక్ష తప్పుతుందేమో?

ఉహుం, ఆ పని చేయలేడు తను.

పక్కమీద దొర్లి దొర్లి విసుగెత్తి లేచాడు కృష్ణమోహన్.

చటుక్కున మరో ఆలోచనవచ్చింది. పారిపోయి వచ్చేసినా తను పట్టు బడ్డాడేమో! ఎలాగయినా తన నేరం బయటకు వస్తుందేమో!

ప్రతి మనిషిలోను దానవుడు, దేవుడుకూడా ఉన్నారు. కృష్ణ మోహన్‌లో జరుగుతున్న దైవ, దానవ సంఘర్షణలో అతను నలిగిపోతున్నాడు.

ఒంట్లో బాగాలేదని, ఆఫీసుకి రాలే నని ఫోన్‌చేసి చెప్పాడు.

నిస్త్రాణగా కుర్చీలో వాలిపోయిన అతనికి కాలగమనంకూడా తెలియలేదు.

సాయంత్రం సుప్రియ వచ్చి తలుపు తట్టింది.

ఎవరూ తలుపుతీయలేదు కాని లోపలం గడియవేయనందున నెట్టే తెరుచుకుంది.

లోపల కుర్చీలో కూర్చున్న కృష్ణ

మోహన్ పది లంకణాలు చేసినట్లు న్నాడు.

నిన్నటికి, ఈ రోజుకి అతనిలోని మార్పుకి నివ్వెరపోయింది ఆమె.

దగ్గరగా వెళ్ళి నుదిటిపైన చేయి వేస్తూ మృదువుగా పిలిచింది- 'కృష్ణా!'

కృష్ణమోహన్ కళ్ళుతెరిచాడు నుదుటి పైనున్న చేయి గట్టిగా పట్టుకున్నాడు. తుఫానులో కొట్టుకుపోతున్న వ్యక్తికి ఆధారం దొరికినట్టే అయింది.

"సుప్రియా! నన్ను వదిలేసి వెళ్ళవు కదూ? కష్టానికయినా సుఖానికయినా నాతోనే ఉంటావుకదూ? చెప్పు!"

"ఏం జరిగింది, కృష్ణా? ఎందుకిలా ఉన్నావు?"

జరిగినదంతా చెప్పేయాలనేకోరికను నిగ్రహించుకున్నాడు కృష్ణమోహన్.

"ఏంలేదు ... ఏంలేదు ..." తడబాటుగా అన్నాడు.

"పిచ్చి కృష్ణా! చూస్తే జ్వరంవచ్చినట్లుంది అందుకే ఇలా మాట్లాడుతున్నావు ఇప్పుడు నీకు కష్టాలేం వచ్చినాయి? ముందున్నవన్నీ సుఖాలే. కాస్త జ్వరానికి ఇలాగయిపోతే ఎట్లా?? ఎంత బలహీనుడివి డార్లింగ్!" సుతారంగా నవ్వింది సుప్రియ

'బలహీనుడినా? స్వార్థపరుడినా?'— అనుకున్నాడు కృష్ణమోహన్.

బలవంతంగా అతన్ని తన యింటికి తీసుకువెళ్ళింది సుప్రియ.

అతనికి చాలా చిరాకుగా ఉంది ఉన్నట్లుండి సుప్రియపట్ల కోపం ముంచుకువచ్చింది. ఈ సుప్రియకోసం కదూ తను ఆ పసిపిల్లను రక్తపు మడుగులో వదిలేసి వచ్చింది?

చుట్టూ వున్న ప్రపంచంపట్ల కూడా ఏదో కసి ఆవరించింది అతనిలో. ఈ ప్రపంచంలో ఔన్నత్యంకోసం ఎంత నీచంగా ప్రవర్తిందారు! ఈ సమాజపు గౌరవాన్ని పోగొట్టుకోవట మవుతుందనే భయమేగా తన ఆత్మగౌరవాన్ని పోగొట్టుకోవటానికి కారణం?

అంతలోనే తమాయించుకున్నాడు అతను. సుప్రియనీ, ప్రపంచాన్ని తిట్టుకోవటంలో అర్థంలేదు. నేరంచేసింది తను, శిక్షకు భయపడి పారిపోయింది తను. ఆ పారిపోవటంలో మరో జీవి ప్రాణాలను సైతం లెక్కచేయక పోవటం స్వార్థానికి పరాకాష్ఠ.

నిర్జీవంగా ఉన్న పెద్ద కళ్ళు వెంటే ఉండి, అతన్ని నిలవనీయటంలేదు.

'పాపా! పాపా! బతికే ఉన్నావా?' నా పిహెచ్.డి. డిగ్రీకన్నా, ప్రమోషన్ కన్నా, విదేశీయానం కన్నా, పెళ్ళి కన్నా, అన్నిటికన్నా విలువయినది తోటిమనిషి ప్రాణం.

'పాపా! నన్ను హంతకుడిని చేయకమ్మా! దయచేసి బతికే ఉండమ్మా! నన్ను క్షమించి, బతికే ఉండు తల్లీ!'

కళ్ళముందు విరిగిపోయిన మట్టి

బొమ్మలు మెదిలాయి 'మనమంతా మట్టిబొమ్మలమే' అంది మనసు.

అతని ప్రవర్తన అర్థంకాక, జ్వర ప్రభావమనిసరిపెట్టుకున్నారు. సుప్రియ. ఆమె తల్లిదండ్రులు. డాక్టరుని పిలిపిస్తే ఏదో మందు ఇచ్చి వెళ్ళాడు.

ఆ రాత్రంతా కన్నుమూయలేదు కృష్ణమోహన్. ప్రొద్దున్నే, ఇంట్లో ఎవరూ లేవకముందే వరండాలోకి వచ్చి కూర్చున్నాడు, ఆ రోజు వార్తాపత్రిక కోసం ఎదురుచూస్తూ.

పేపర్లో మొదటిపేజీలోనే ఉంది అతను వెతుకుతున్న వార్త.

"నిన్న ఉదయం-రోడ్డులో కారు క్రింద పడిపోయిన అయిదేళ్ళ పాప రాత్రి హాస్పిటల్‌లో మరణించింది రక్తం బాగా కోల్పోవటంవలన మరణం సంభవించినట్లు తెలుస్తున్నది. తెలివి తప్పిన స్థితిలో ఉన్న పాపను వదిలేసి కారుతోసహా డ్రైవరు పారిపోయినాడు. పాప తల్లి ఇరవైనాలుగేళ్ళ వితంతువు లక్ష్మి, ఒక్కగానొక్క కూతురి మరణ వార్త వింటూనే గుండె ఆగి చనిపోయింది. ఇంతటి ఘాతుకమైన ట్రాజడీకి కారకుడయిన కారు వ్యక్తి కోసం పోలీసులు గాలిస్తున్నారు."

కృష్ణమోహన్ చేతిలోనించి పేపరు జారిపోయింది.

సుడిగుండంలో కొట్టుకుపోతున్నట్టే ఉంది అతనికి.

'పాపా, నేను హంతకుడినే! నిన్నే కాక నీ తల్లినీ చంపిన నీచుడిని.'

తనకోసం పోలీసులు గాలిస్తున్నారట. ఆ వార్త ఎందుకో సంతోషాన్నే కలిగించింది. తన నేరానికి అంతరాత్మ విధిస్తున్న ఈ శిక్షకంటె, చట్టం విధించే శిక్ష తక్కువగానే ఉంటుంది.

మనిషి తనముందు తానే తలవాల్చుకొనవలసి రావటానికి మించిన అవమానం మరొకటిలేదు.

తప్పుచేయటం మానవసహజం. శిక్ష అనుభవించటం విశ్వధర్మం. చట్టంనించి తప్పించుకున్నా, మనోఘర్షణనుంచి తప్పించుకోవటం ఎలా?

'పాపా! నిన్ను వెంటనే హాస్పిటల్‌కి నా కారులోనే తీసుకువెళ్తే బ్రతికేదానివేమో?!'

ఎవరూ జవాబు చెప్ప(లే)ని ప్రశ్న అది.

బ్రతికి ఉన్నన్నాళ్ళు తనను తినేస్తూ ఉండే ప్రశ్న అది.

తనంతట తాను వెళ్ళి పోలీసులకు జరిగింది చెప్పేసి, పట్టుబడిపోతే కొంతయినా మనశ్శాంతి లభిస్తుందేమో!

కాని...కాని...తను జీవితమంతా జైల్లో మగ్గినా ఆ పాప తిరిగిరాదు. పాప తల్లీ తిరిగిరాదు.

తన జీవిత పుష్పాన్ని తానే నలిపి పారేయటం తెలివయిన పనికాదు. జరిగి

పోయినదానిని మరిచిపోవటానికి ప్రయత్నించటమే మేలు.

కాని...ఆ పాపసంగతో? క్షణాల మీద ఆ పువ్వుని కాలరాచి పారేశాడే'? ఆక్సిడెంట్ పొరపాటున జరిగినా, వదిలేసిరావటం తాను కావాలని చేసిన పనేకదా?

అన్నీ ప్రశ్నలే' జవాబులేనిప్రశ్నలే. అవి చుట్టుముడుతుంటే సుడిగుండంలో చిక్కుకున్నట్లేఉంది

నిర్జీవమైన కళ్ళు-రక్తపు మడుగు-పగిలిపోయిన బొమ్మలు - ఆ దృశ్యమే మదిలో నిలుస్తున్నది.

అయోమయంగా ఉన్న అతని వాలకం అర్థంకాక సతమతమవుతున్నారు సుప్రియ, ఆమె తల్లి తండ్రులు.

ఆఫీసుకి వెళ్ళటం మానేశాడు అతను

వారంరోజులు గడిచాయి.

పిహెచ్ డి డిగ్రీ అందుకోవలసిన రోజు ఆసన్నమయింది. ఆసాయంత్రమే ~~విశ్వవిద్యాలయంలో స్నాతకోత్సవం.~~

ఉదయమే వచ్చారు అతని స్నేహితులు కొందరు. కాన్వొకేషన్ అయిపోయాక ఆ రాత్రికి తామంతా అతనికి హోటల్‌లో డిన్నర్ ఇవ్వాలనుకుంటున్నట్లు చెప్పారు.

నిరాసక్తిగా కూర్చున్న అతని వాలకం వాళ్ళకి వింతగాఉంది.

సుప్రియ చెప్పింది, అతనికి ఒంట్లో బాగాలేదని, రాలేదని.

అమెరికావెళ్ళేలోపల తమవద్ద మరో రోజయినా పీడ్కోలు విందు తీసుకోవాలని చెప్పి వెళ్ళిపోయారు మిత్రులు. వాళ్ళు వెళ్ళాక నిలదీసి అడిగింది సుప్రియ, అసలేం జరిగిందని

అతనేమీ చెప్పలేదు. బాణంతగిలి, గాయపడి విలవిల్లాడుతూ పడిపోయిన పక్షిని గుర్తుకుతెచ్చాయి అతనిచూపులు. ఆమె మరేమీ అడగలేకపోయింది. ఆ సాయంకాలం మాత్రం బలవంతంగా కార్లో అతన్ని యూనివర్సిటీ కాన్వొకేషన్‌కి తీసుకువెళ్ళింది.

డిగ్రీలు పుచ్చుకోవలసిన ఇతరులతో కలిసి నల్లకోటు, కాప్ ధరించి ముందు వరసలో కూర్చున్నాడు. కృష్ణమోహన్. అందరిలోను ఉత్సాహం వెల్లివిరుస్తున్నది —అతనిలో తప్ప!

స్టేజీమీద ఉపన్యాసాలు ఇస్తున్నారు, ఎవరెవరో పెద్దలు. కృష్ణమోహన్‌కి ఉక్కిరిబిక్కిరి అవుతున్నట్లున్నది కూర్చో ~~లేకపోతున్నాడు.~~

చిన్నగా లేచి బయటకు వచ్చాడు. హడావిడిలో ఎవరూ గమనించలేదు.

బయటకు వచ్చాకకూడా సుప్రియ కాని, మరెవరయినా ఇతర మిత్రులు కాని చూస్తారేమోనన్నట్లు, వెనుదిరిగి చూడకుండా చాలామారం వడివడిగా నడిచాడు.

ఎక్కడికి వెళ్తున్నాడో, ఎందుకు వెళ్తున్నాడో అతనికే తెలియదు.

తెలిసినదల్లా ఒక్కటే-తను స్టేజీ ఎక్కి డిగ్రీ అందుకొనే ఈ గౌరవానికి తగడు ; ఉద్యోగంలో ప్రమోషన్‌కి, ఫారిన్‌ట్రిప్‌కి తగడు; సుప్రియను పెళ్ళిచేసుకోవటానికి అసలు అర్హుడే కాదు.

ఎక్కడో సినిమాపాట వినవస్తున్నది

"అందమైన జీవితము అద్దాల సౌధము

చిన్నరాయి తగిలినా ముక్కలే మిగులును..."

కనిపించిన బస్ ఎక్కాడతను. తోచినచోట దిగేశాడు. దిగి చుట్టూ చూస్తే. టాంక్‌బండ్ మొదట్లోఉన్న పోలీస్‌స్టేషన్ వద్ద ఉన్నట్టు తెలిసింది.

పోలీస్‌స్టేషన్?

తను వెళ్ళవలసిన చోటు ఇదే. నేరాన్ని వెల్లడిచేసి శిక్ష, అనుభవించాలి. తప్పదు! ఏమీ జరగనట్లు వెనకటిలాగే జీవించటం మాత్రం అసాధ్యం.

'కాని నేను ఏ శిక్ష అనుభవించినా నువ్వు తిరిగి రావమ్మా, చిట్టితల్లీ! నిన్ను చంపేశాను పాపా!' విషాదంగా ఆక్రోశించింది అతని హృదయం. 'మీ అమ్మనీ బలిపెట్టుకున్నానమ్మా నేను...సంఘంలోని ఉన్నత స్థానాన్ని పోగొట్టుకుంటానని భయపడ్డాను. దాని కోసం దిగజారిపోయాను...'

కానీ పోలీస్‌స్టేషన్‌లోకి అడుగు పెట్టలేకపోయాడతను. ప్రశ్నలు, జవాబులు, సంజాయిషీలు, కోర్టు-ఇవన్నీ తాను భరించలేడు. పూలు అమ్మినచోట కట్టెలు అమ్మలేడు.

టాంక్‌బండ్ పైన నడవసాగాడతను. రాత్రి పదిగంటలుదాటినా అట్లా ఆ వంతెనపైనే అటూ, ఇటూ తిరుగుతూ ఉండిపోయాడు.

తనలోని ఘోషను భరించలేకున్నాడు. 'పాపా! నా స్థానం ఈ సంఘంలో కాదమ్మా...నీ వద్ద... నీ తల్లివద్ద...'

వంతెన రెయిలింగ్‌పైన ఒకకాలు ఉంచాడు. రెండోపాదం శూన్యంలోకి పెట్టాడు. అతని ప్రాణం విశ్వంలో లీనమయిపోయే చివరి క్షణానస్ఫురణకు వచ్చాయి-ఆనాడు రోడ్డుపైన పగిలి, ముక్కలయిపోయిన మట్టిబొమ్మలు.



# కూలితల్లి

వి. రాజా
రామమోహనరావు



ఆ యింట్లో తనజీవితం ఎన్నేళ్ళనుంచీ గడుస్తోందో రంగమ్మ ఎప్పుడూ లెఖ్ఖ పెట్టుకోలేదు.

ఆ యిల్లు తప్ప తనకి బయట వేరే జీవితం వుందన్న విషయం మరచిపోయి చాలా ఏళ్ళయింది. అలాంటిది ఆ రోజు సుశీలమ్మ అలా అన్న దగ్గర్నించీ కాలూ చెయ్యీ ఆడలేదు. ఇంటిపనిమీదే కాదు, బతుకు మీదే ఆసక్తి అడుగంటి నట్లనిపించింది.

* * *

జీవితంలో పూర్తిగా ఏకాకి అయిపోయిన కొత్తరోజులవి. ఏం చెయ్యాలో, ఎలా బతకాలో... అసలు బతకాలో వద్దో ఏమీ నిర్ణయించుకోలేని అయోమయంలో వున్న కాలం అది. పక్క పాక వెంకమ్మ ప[illegible] ఖాళీగా వుందని తీసుకొస్తే మొదటిసారి ఆ యింట్లో కాలు పెట్టింది.

విశాలంగా పెద్దమైదానంలా వున్న హాలులో ఏదిక్కూ తోచనట్టు నిలబడింది. చాలాసేపు. మేడమీంచి దిగొస్తున్న

---

**1978 చక్రపాణి మూతన అవార్డు పొందిన కథ**

సుశీలమ్మని చూసి వెంకమ్మే ముందు... 'దండాలండి...' అన్నాక తలెత్తి చూసింది.

సన్నగా, నాజూగ్గా, తెల్లగా, అందంగా, నిండుగా వున్న పాతికేళ్ళైనా దాటని సుశీలమ్మని చూసి 'ఏంటి యిలా వుంది అనుకుంది.' అనుకున్నాక ధైర్యం వచ్చింది

సుశీలమ్మంటే వెంకమ్మ తనకన్నా పెద్దగా, లావుగా యింకేదోలా వుంటుందనుకుంది ముందు. అలాంటిది తనకన్నా వయసులో చిన్నగా వున్న సుశీలమ్మని చూసి బెరుకు తగ్గిన మనసుతో తనూ దణ్ణమెట్టింది.

"నీ పేరేమిటి." అంది కుర్చీలో కూచుంటూ సుశీలమ్మ.

"రంగి, అండి," అంది.

ఎదురుగా కనిపిస్తున్న మట్టికాళ్ళ దగ్గర్నించి, బొట్టులేని ముఖం వరకూ వో క్షణం చూసింది సుశీలమ్మ. చూసి, "పసిపిల్లాడ్ని పెంచాలి... వొచ్చా" అంది.

'వొచ్చన్నట్టు' తలూపింది రంగి.

~~"పిల్లలున్నారా..." అనడిగింది.~~

"ఇద్దరు పుట్టి పోయారండి..." అంది రంగి.

ఆరోజే పనిలో చేరిపోయింది రంగి. అంత పెద్ద యింట్లో ఎంతమందుంటారో ఏ రకం గొడవలుంటాయో అని ముందు భయపడింది. కానీ సుశీలమ్మ భర్త, మరోయిద్దరు పనివాళ్ళు తప్ప ఎవరు లేకపోవటం, నెలేనా నిండని సుశీలమ్మ కొడుకుని సాకడం తప్ప వేరే పనేం లేకపోటంతో తేలికపడింది రంగి మనసు.

నెల గడిచేటప్పటికి ఆ యిల్లు, యింటి మనుషులు, వాతావరణం బాగా అలవాటయ్యాయి. ఇదివరకు మొగుడు బయటకెళ్ళినపుడు వొంటరిగా పాకలో ఎలా వుండేదో అలాగే వున్నట్టుంది. పాత పాకే బాగా పెద్ద యిల్లయి, ఆ యింట్లో తనకి సరిపడ్డ వో మూల బతుకుతున్నట్లే వుంది. కొత్త తగ్గాక చాలావరకు అయోమయం తగ్గింది. జీవితం యిలా గడిచినా చాలనిపించింది.

ఆ నెలలో ఒకటి రెండుసార్లు తన పాకకి వెళ్ళివొచ్చినా రాత్రింబవళ్ళు రంగి మకాం ఆ యింట్లోనే. ఆ పక్క మేడలోనే పనవటంవల్ల వెంకమ్మ చూసి పోతుండేది. వొచ్చినప్పుడల్లా... "ఎలావున్నావే..." అనేది వెకమ్మే ముందు.

'బాగానే వున్నానన్నట్టు' తలూపేది ~~రంగి. ఆతరువాత యిద్దరికీ తీరుబడుంటే~~ కాస్సేపు కష్టంసుకం చెప్పుకునేవారు. వెంకమ్మే ఎక్కువ వాళ్ళ కబుర్లు వీళ్ళ కబుర్లు చెపుతుండేది. అలా కబుర్లతోనే ఆ రోజు చాలా మామూలుగా అంది వెంకమ్మ... ముందంటే నీకు "పని కొత్త...ఎంటనే పనవసరం... అందు

కని మిగిల్నాయి పెద్దగా సూసుకోకుండా పనితో చేరావు...నేనూ వూరుకున్నా... యిక్కడే పడుండి అస్తమానం పిల్లాణ్ణి చూసే నీలాంటి మనిషి యాళ్ళకి అవసరం. లేకపోతే ఆళ్ళ పనులు, సరదాలు సాగవు. అందుకని సుశీలమ్మని జీతం పెంచమని అడుగు..." అంది.

రంగి ఏం మాట్లాడకపోవటం చూసి "ఏం సుశీలమ్మని నన్నే అడగ మంటావా..." అంది వెంకమ్మ తిరిగి.

"వొద్దు... వొద్దు ..." అంది కంగారుగా రంగి.

"నెమ్మదిగా నువ్వే అడుగు. మన సంగతి మనం గుర్తుచేస్తేనే కానీ పెద్దోళ్ళకు గుర్తుండదు. తెలిసిందా," అంది వెంకమ్మ.

వెంకమ్మ అలా అన్న ఆ మాటలు రంగిని అంత తేలిగ్గా వదలలేదు. ఇంటివాళ్ళిస్తున్న జీతం డబ్బు... మొగుడుతో గడిపిన జీవితం... చచ్చి పోయిన పిల్లలు. యిలా గతంలోంచి చాలా గుర్తొచ్చాయి. ఇంచుమించు వారంరోజులు ఆ కలత వదల్లేదు రంగిని. కొన్ని వాటంతట అవే గుర్తొచ్చాయి. మరికొన్ని కావాలనే గుర్తుతెచ్చుకుంది.

ఈ యింట్లోవుండి పాకలో గడిచిన జీవితం గుర్తు తెచ్చుకుంటే దబ్బు యిబ్బంది, తననీ మొగుణ్ణీ ఎన్ని రకాలుగా బాధపెట్టింది. యిద్దర్నీ ఎంత యిరకున పెట్టింది మరింత బాగా తెలిసింది, రంగికి.

రంగి మొగుడు మొదట్నుంచీ తాగేవాడు. అందరిలాగే తన మొగుడు అనుకుంది. తప్పుగా అనుకోలేదు. కానీ మొగుడు ఏఅర్ధరాత్రో వచ్చి, అవసరాలు తీరేవరకే తెలివిగా వుండి, తర్వాత ఏ వులుకూ పలుకూ లేకుండా మొద్దులా నిద్దరపోతుంటే కొంత బాధగా వుండేది. అయినా... 'అలిసిన ప్రాణంలే' అని సరిపెట్టుకునేది.

రోజులు ఆ రకంగానూ గడవలేదు. రంగి కాన్పులు కష్టమవటం. పుట్టిన పిల్లలకు రోగాలు రావటం...చివరికివాళ్ళు దక్కకపోటంతో యింటి పరిస్థితే మారి పోయింది. వీటన్నిటిలో అప్పులయ్యాయి. అలా అయిన అప్పులూ అంత పెద్దవేం కావు. మొగుడు పెళ్ళాన్ని, యింటిని... యింటిలో సుఖాన్ని నాశనంచేసేంత పెద్దవేంకావు. కానీ చివరికి అంతా నాశనమే అయింది.

అప్పుల్తోపాటు రంగి మొగుడి త్రాగుడూ పెరిగింది. అవితీర్చేయ్యాలని రాత్రింబగళ్ళు రిక్షా లాగి లాగి.... ఆ చిరాక్కి మరింత తాగి... ఆ తాగుళ్ళో రంగిని తన్ని, తిట్టి నానా గొడవచేసేవాడు. మొగుడు యింటి కొస్తున్నాడంటే భయం... తిట్లు, తన్నులు కన్నా, మొగుడు తనమీద చూపించే అసహ్యమే మరీ యిబ్బందిగా

వుండేది రంగికి... చివరికి తన కసి, ఎవరిమీద చూపించాలో దేని మీద చూపించాలో తెలియక పెళ్ళాన్ని మొరటుగా బాధపెట్టటం అలవాటైంది రంగి మొగుడికి.

ఆ పాకలో వో చోట కలిసి వున్నారు, కలిసి పడుకుంటున్నారని తప్ప యిద్దరి మనసుల మధ్యా యింకేం మిగల్లేదు. ఎప్పుడో .. ఎలాగో వరికి మగ తోడంటేనే పూర్తిగా యిష్టం పోయింది రంగికి.

'ఆ రోజుల్లోనే కనక డబ్బుంటే. ఆ అప్పులు తీర్చేసే అవకాశం వుంటే .. బతికుండగానే మొగుడు అంతదూరమై వుండకపోను' ... అనిపించింది రంగికి.

'యింటివాళ్ళు ఏదో జీతం యిస్తున్నారు. దాని అవసరమే లేదు. రోజూ తిండి గడుస్తోంది. వుండటానికి నీడుంది .. యిప్పుడు జీతం పెంచమనటం ఎందుకు. . అనుకుంది రంగి. మళ్ళీ ఒపక్క డబ్బుమీద మనసు పీకుతూనే వుంది రంగికి .' అవకాశం వున్నపుడు అడిగితే మాత్రం ఏం... అని, 'తీరా అడిగాక వాళ్ళకి అది నచ్చక గుట్టునప్పుడు కాకుండా పనిలోంచి తీసేస్తే ..' ఆ ఆలోచనతో గుండె దడదడ లాడింది. తిరిగి పాత పాకలో తన బతుకు.. నువ్వింకా పనికొస్తావు నాతో చేరు.. నా దగ్గరుండు అనే మగాళ్ళు...అవేవీ భరించలేదు. మరో యిల్లు. మరో యిల్లు పనికోసం వెతుక్కుంటూ తిరగనూలేదు అందుకనే చివరికి వారం తరువాత వో నిర్ణయానికి వచ్చేసింది రంగి.

మరో పదిరోజులకి సుశీలమ్మకి చెప్పి వెళ్ళి పాక ఖాళీ చేసేసి తన సామాను తెచ్చేసుకుంది

ఆ తర్వాత రెండేళ్ళకి వెంకమ్మ చచ్చిపోయాక యింక బైట సంగతులు తెలవడం మానేసాయి. ఆశక్తి అంతగా మిగల్లేదు రంగిలో. ఆ యిల్లు ఆ యింటి వాళ్ళతోనే జీవితం ఇంటివాళ్ళల్లో అయినా ఆ చిన్నకుర్రాడితో, వాడి నవ్వుల్తో, ముద్దు ముద్దు మాటల్తో... కంటి మీదకి కునుకేనా రానియ్యని ఆ పసివాడు రోగాల్తో గడిచిన అనేక వందల రాత్రులతో రంగమ్మ జీవితం ముడిపడిపోయింది. ఆ కుర్రాడి తాలూకు చాలా చిన్న చిన్న విషయాలే రంగికి చాలా పెద్ద సంతోషాలయ్యాయి.

ఆ కుర్రాడికి పేరు పెట్టేరోజు సుశీలమ్మ... "బాబుకి మురళి అని పేరు పెడుతున్నాం..." అని ముందు చెప్పినందుకే పొంగిపోయింది రంగి. ఆ కుర్రాణ్ణి స్కూల్లో చేర్చే రోజు కూడా కారులో తనని తీసికెళ్ళినందుకు తనబతుకు ధన్యమైపోయినట్టు సంతోష పడింది.

'దాయమ్మా' అని ఆ కుర్రాడు పిలిచే పిలుపు... 'మురళి బాబు...

మురళీ బాబు...' అని తను పిలిచే పిలుపు యివి రెండే చాలావరకు జీవితం అయిపోయాయి రంగికి.

ఏళ్ళు గడుస్తుంటే, అనుభవాలు పెరుగుతుంటే... యింటివాళ్ళ కోప తాపాలు, యిష్టా యిష్టాలు బాగా అలవాటవుతుంటే... ముసలితనం వొంటిమీద కొచ్చి రంగి చాలామందికి రంగమ్మ అయింది.

చిన్నతనంలో రంగి వాళ్ళ పల్లెటూర్లో చాలా తోటలుండేవి. యింటి ముందు ఎన్నో చెట్లుండేవి. రోజూ ఎన్నో గంటలు వాటిచుట్టూ తిరుగుతూ, వాటి వెనక దాక్కుంటూ చాలా ఆటలు ఆడుతుండేది. పెళ్ళయి వాటినుంచి దూరమయ్యాక, అలాంటివే తనుండే చోట పెంచుకోవాలనుకుంది. పాక పక్కన పాక, మురికికాలవలు పల్లెలో లాగ పట్టణాలలో అది కుదరదని తెలియటానికి ఎంతో కాలం పట్టలేదు రంగికి. తను తల్లి అయ్యాక తిరిగి పాత పెంపకం కోరిక తలెత్తింది. జీవితంలో అదీ తీరలేదు. చివరికి ఆ ఆశ యీ యింట్లో యిలా తీరినట్టయింది రంగికి.

మడికట్టి నీళ్ళు పోసి శ్రమపడి పెంచిన మొక్క ఎదుగుతుంటే ఎలా వుంటుందో అలా వుండేది ఎదుగుతున్న మురళిని చూస్తుంటే. ఆ చెట్టుకాపు మీద తనకి ఏ రకం ఆశాలేదు. అవి తెలిసీ తృప్తిగానే వుండేది. రంగికి.

ఒకళ్ళుండి పెంచాల్సిన వయసు మురళికి దాటేశాక తన బతుకేమవుతుందోనని చాలామార్లు బెంగపడేది. కానీ ఆ యిల్లు తనకి దూరమవదని, ఆ యింట్లో తనూ వో భాగమే నని మొండి ధైర్యంగానూ వుండేది.

మురళి పెద్దవాడైనా, సుశీలమ్మకి తిరిగి పిల్లలు పుట్టకపోయినా రంగమ్మని ఆ యిల్లు వొదలమని ఎవరూ అనలేదు. ఇంటిపని, వంటపని చూసుకుంటున్న రంగమ్మకి రోజులు గడుస్తూనే వున్నాయి.

పెరిగిన వయసు, బలంతగ్గి వొళ్ళు యిదివరకంత చురుగ్గా రంగమ్మ పని చెయ్యలేకపోతుంటే యీ మధ్యనే మరో పనిపిల్లని పై పనికి కుదిర్చిందిరంగమ్మ.

ఇంటిపని చాలావరకు ఆ కొత్త పిల్ల మణే చేస్తోంది. తను పెంచిన మురళిని చూసుకోవటం, చిన్న చిన్న పనులు చేయటం పెద్దగా పనేం మిగల్లేదు రంగమ్మకి.

పెద్దయిన మురళి... 'దాయమ్మా.' ...అనకుండా 'రంగమ్మా' అని పిలుస్తున్నపుడే కొంచెం యిబ్బందిగా వుండేది. 'అయినా పిలుపుకేమిటిలే...' అని సమాధాన పడి రోజులు గడుపుతోంది.

* * *

కేకలు, గోల ముందు తిన్నగా వినలేదు రంగమ్మ. ఇంట్లో సుశీలమ్మ, భర్త లేరు...మురళి నిద్రపోతున్నాడు.

గోల కొంచం వినిపించినా బయట వీధిలోనేమో అనుకుంది.

కానీ మణిగొంతు వినిపించేటప్పటికి వంటింట్లోంచి బైటకొచ్చింది. పేదిగది లోంచి...మురళి పడుకున్న గదిలోంచే గోల...లోపల ఏం జరుగుతోందో గ్రహించటానికి ఎక్కువసేపు పట్టలేదు. వేసున్న తలుపుల్ని దబదబా బాదింది. "మురళీ బాబూ... మురళీ బాబూ..." అని అరిచింది.

వో క్షణం ఆగిన గోల తిరిగి ఆరంభమైంది. రంగమ్మ అరపులకి మురళి ఏం బదులు పలకలేదు. తను పెంచిన మురళి పనిపిల్లని గదిలో నిర్బంధిస్తుంటే, ఆ గోల చెవుల్ని గింగిర్లెత్తిస్తుంటే... ఎన్నో ఏళ్ళనుంచి తనను అసహ్యించుకొని దూరమైన మొరటుతనం మురళి రూపంలో కనిపిస్తుంటే కంగారుపడింది రంగమ్మ... ఆరాటపడింది. దిక్కుతోచకుండా పరిగెట్టింది. వీధి గుమ్మం చేరి తనకు తెలిసికొంతా తెలియక కొంత అరిచింది.... "అన్యాయమైపోతోంది... రండినాయనో..." అని, గొంతు చించుకుంది.

రంగమ్మ అరుపులకి యింటినౌకరుతో బాటు మరో యిద్దరు బైటివాళ్ళు కూడా వొచ్చారు తలుపు విరగ్గొట్టేంత పనిచేస్తుంటే తలుపు తెరుచుకుంది.

రెక్కతెగిన పక్షిలా, చెదిరిన బట్టల్తో రివ్వునొచ్చి తనని అంటుకుపోయిన మణినే చూసింది రంగమ్మ.

కొంచెం తేరుకున్నాక వచ్చినవాళ్ళని పంపించేశారు, నౌకరూ, రంగమ్మ. పెరట్లోకితీసికెళ్ళి మణిని వోదారుస్తూ తనని తను వోదార్చుకుంది రంగమ్మ.

జరిగిన గొడవంతా సాయంత్రానికే సుశీలమ్మ చెవినిపడింది. అయినామర్నాటి దాకా ఆ గొడవెత్తలేదు ఆరోజంతా కాలుగాలినపిల్లిలా తిరిగింది రంగమ్మ. గదిలోనేవున్న మురళి దగ్గరకెళ్ళి ఒకటి రెండుసార్లుకావాలనేపలకరించింది మురళి పలకకపోతే మరింత కుంగిపోయింది.

సుశీలమ్మ ఎదురుపడితే... ఆవిషయం ఎత్తితే బావురుమని ఏడ్చి తన గుండె బరువంతా దింపుకోవాలనిపించింది

రాత్రి పడుకున్నా తిన్నగా నిద్రరాలేదు రంగమ్మకి. కలతగా పట్టిన నిద్రలో పాత పాక...ఆ పాకలో మొరటిబతుకు ...ఆ పాకచుట్టూ దెయ్యాల్లా వెకిలి చూపులు చూస్తూ తిరిగే దరిద్రమూక కనిపించాయి... చచ్చిపోయిన పిల్లలు కనిపించారు... తను పెంచుకోవాలనని కలలుగన్న చెట్టు చీడ పట్టి కనిపించింది.

తెల్లారిన చాలాసేపటికి, పొద్దున్న యింటిపని అయిపోయే సమయానికి... 'మణిని సుశీలమ్మగారు రమ్మంటున్నారని' కబురు తెచ్చాడు నౌకరు.

బెరుకుగా బెరుగ్గా వెళ్ళిన మణి పావుగంటలోపే దిగాలు ముఖంతో తిరిగొచ్చింది. 'అమ్మగారు నన్ను పని లోంచి ఎల్లిపొమ్మన్నారు...' అంది. అలా అంటుంటే దానికి ఏడుపొచ్చింది.

మణిని దాని ఏడుపుని చూస్తుంటే రంగమ్మకి కాస్సేపు ఆలోచన సాగలేదు. ఈ మధ్యనే తండ్రి పోయిన పిల్ల, తల్లి లేని పిల్ల... పదహారేళ్ళ ఆ వయస్సులో దానికి అన్నీ కంగారే ... అంతా భయమే...

"ఊరుకో... దీని కేడుపెందుకు .. సుశీలమ్మతో నే మాట్లాడతాగా..." అంది చివరకు రంగమ్మ.

మణి కొంచం తేరుకున్నాక సుశీలమ్మ దగ్గరకెళ్ళి నిలబడింది రంగమ్మ. కాస్సేపు నిలబడ్డాక...

"మణిని పనిలోంచి వెళ్ళిపొమ్మనారని...తెగ ఏడుస్తోంది..." అంది.

"పొమ్మనక నెత్తినెక్కించుకోమంటావా... అసలు వున్న దరిద్రానికే పడలేక చస్తుంటే మళ్ళీ యిదికూడానా" అంది సుశీలమ్మ.

సుశీలమ్మ కోపం రంగమ్మ అనుభవంలో వున్నదే అందుకే "పోనీ లెండి అయిందేదో అయిపోయింది... దీన్నెందుకు పొమ్మనటం..." అంటూ ఏదో చెప్పబోయింది.

అయిందేదోఅయిపోయిందా...అంతే నీకు అలాగేతేలిగ్గావుంటుంది ఎంత అల్లరి, ఎంత గొడవ... అయినా ఏమంతకొంప మునిగిందని... వయసులో ఏ కుర్రాడికి మాత్రం తొందరపాటుండదు... అయినా చేసిన అల్లరంతా చేసి అయిపోయిందంటున్నావా" అంది సుశీలమ్మ.

"అదికాదు బాబుని నేనెంతగానో ఆపాలని చూశా...కానీ" రంగమ్మని మాట పూర్తి చెయ్యనివ్వలేదు సుశీలమ్మ.

"నువ్వేం చెప్పక్కర్లే... నాకంతా తెలుసు... అయినా నువ్వు వాణ్ణి కన్న తల్లివైతే యింత అల్లరి చేస్తావా... నలుగురి కళ్ళల్లో పడేలా చేసేదానివా. కన్న పేగుకి తెలుస్తుంది పిల్లల్ని ఎలా కడుపులో పెట్టుకోవాలో... అదీకాక యింత జరిగాక ఆ మణిని వెనకేసుకొస్తున్నావా... ఎంతైనా మీ జాతి బుద్ధి పోనిచ్చావుకాదు. పిల్లాడిమీద లేకపోయినా... యిన్నాళ్ళు యీ యింటి తిండితిన్నానన్న విశ్వాసం లేకపోయింది నీకు... ఛీ... ఛీ..." అంటూ అక్కడ్నించి లేచి వెళ్ళిపోయింది సుశీలమ్మ.

రంగమ్మ చాలాసేపు ఎదురు చూసింది కోపం తగ్గి సుశీలమ్మ వస్తుందేమోనని. ఎప్పటికీ రాకపోతే తిరిగి వెనక్కి వచ్చేసింది. వచ్చేసినా ఆ రోజంతా బాధపడింది రంగమ్మ.

మర్నాడు మామూలుగా పనిలోకొచ్చిన మణిని గుమ్మంలోనే నిలవేసింది సుశీలమ్మ.

ఏంచెయ్యాలో తోచక దిక్కులు చూస్తూ గుమ్మంలోనే ఆగిపోయిన మణిని చూస్తూ సుశీలమ్మకి నచ్చచెప్ప



బోయింది రంగమ్మ. వింటే సుశీలమ్మకి దిక్కులేని మణి పరిస్థితంతా వివరంగా చెప్పాలనుకుంది.

ఆ అవకాశం యివ్వలేదు సరికదా... యింత జరిగాక నిన్నుండనిస్తున్నందుకే సంతోషించు మురళీ నీ ముఖం కూడా చూడనంటున్నాడు... చచ్చే వయసొచ్చింది. ఏమూలో కాలంగడుపు. అంతే తప్ప అన్నీ నీకే కావాలని పూసుకు తిరక్కు... తెలిసిందా..." అంది సుశీలమ్మ.

అంతవరకు అట్టడుగున కదులుతున్న ఆశ కాస్తా అడుగంటింది రంగమ్మకి. దిగులుగా వెనక్కి తిరిగిన మణి కూడా గుమ్మందాకా వెళ్ళి సాగనంపింది.

మణిని పంపేసి తిరిగి ఆ యింట్లోకి వస్తుంటే ఏదో పరాయి యింట్లోకి, తనదేంలేని ప్రపంచంలోకి తప్పనిసరిగా వెడుతున్నట్టనిపించింది రంగమ్మకి. ఎవరితోనూ చెప్పుకోలేని దిగులుకి ఆ ముసలిమనసు పగిలి బీటపడినట్టయింది.

తన జీవితం అందుకే నన్నట్టు పెంచిన మురళీ, సుశీలమ్మ యింక ఎప్పటికీ తనకందనంత దూరమైనట్టని పించింది. వంటీంట్లో కెళ్ళి గుమ్మం పక్కన కూచుంటే, తనున్న ప్రపంచం వాళ్ళున్న ప్రపంచం వేరు వేరుగా తోచాయి రంగమ్మకి. కూలికి బిడ్డని పెంచిన నేను ఎక్కువ ఆశలకి పోయానేమో..." అనుకుంది కన్నీళ్ళు తుడుచుకుంటూ చివరికి.



సి.యస్.రావు సీరియల్

# కాంచన కుటీరం



## 7

సృష్టిలోని ప్రకృతి సౌందర్యానికి కాశ్మీర్ పుట్టినిల్లు. ఆ ప్రకృతి మధ్య విరిసిన పువ్వులో కేరింతలు కొట్టే శ్రావణికి ఆ కాశ్మీర్ పుట్టినిల్లు. కన్నెవయస్సులో వున్న ఆమె పువ్వుల మధ్య పువ్వులా, ఆకుల మధ్య ఆకులా, సెలయేటి తుంపరుల మధ్య ఒక తుంపరులా ఆడుతూ, పాడుతూ బతుకుతోంది. నింగిలో మెరిసే మెరుపుతీగ మబ్బులాంటి మొహమొత్తి, అక్కడి ప్రకృతి శోభను ఆస్వాదించాలని నేలకు రాలిందా అన్నట్టు అనిపిస్తుంది శ్రావణి.

ఆమెకు ఒక్కచోటా కాలు నిలవదు.

కాసేపు ఈ లోయలోనూ, మరి కాసేపు గొర్రెల మధ్యా, మరి కొన్ని క్షణాల్లో పళ్ళ తోటల్లోనూ, పూల తోటల్లోనూ, ఇంకా సేపట్లో సరస్సులలో తేలియాడే బోట్ హౌస్‌ల మీదా ఎక్కడ చూసినా శ్రావణే కనిపిస్తూ వుంటుంది. శ్రావణి సెలయేరులాంటిది. సెలయేరు ఎక్కడ పుట్టిందో ఎవరికీ తెలియదు. ప్రవాహం మటుకు అందరికీ కనిపిస్తుంది. కొండ వాలుల పొడుగునా అలసట లేకుండా పరుగులు తీస్తుంది. ఆమెకు కూడా తన పుట్టుపూర్వోత్తరాలను గురించి తెలియవు. తెలుసుకోవాలని ఆమె ఎన్నడూ తాపత్రయపడనూలేదు, ఆ ప్రాంతంవారందరికీ శ్రావణి అంటే విపరీతమైన ప్రేమాభిమానాలు. ప్రతి ఇంటివారూ తమ ఇంటి ఆడబడుచులాగే చూసుకుంటారు. కాశ్మీర్‌లోని ప్రకృతి మానవజన్మ మీద మమకారంతో శ్రావణిగా పుట్టి ఆడుకుంటోందనుకుంటారు.

శ్రావణి పదహారేళ్ళ కన్య. పచ్చని శరీర ఛాయ. విశాలమైన కళ్ళు. సంపెంగ మొగ్గలాంటి ముక్కు. గులాబీ రేకుల్లాంటి పెదవులు. ఎప్పుడూ నవ్వుతూ వుండే మొహం. ఆమె నవ్వితే ఏదో తీయని సంగీతంలా ఆ కొండలోయల్లో ఆమె నవ్వులు ప్రతిధ్వనిస్తాయి. పూల తోటల్లోని పువ్వులు తుంపుకొని సరస్సులో బోట్ హౌస్‌లో విడిది చేసినవారికి తెచ్చి ఇస్తూ వుంటుంది. ఏ పూలతోటలో పువ్వులు కోసినా, ఆమెను ఎవ్వరూ ఏమీ అనరు. ఏ బోట్ హౌస్‌కు తెచ్చి పూలు ఇచ్చినా ఆమె అడక్కుండానే అందరూ పూలమ్ముకొనే పిల్లలకంటె ఎక్కువ డబ్బులే ఇస్తారు. నెలో, రెండు నెల్లో బోట్ హౌస్‌లో వుండి, తిరిగి తమ ప్రాంతానికి వెళ్ళి పోయే వారు, వెళుతున్నామని ఆమెకుచెప్పకుండావుండరు ఆమెముఖార విందం అంత ఆకర్షణీయమైంది. వచ్చిన టూరిస్టులతో కూడా కొద్దిరోజుల్లోనే అలా కలిసిపోయి ఆప్యాయతనూ, అనురాగాన్నీ పెంచుకొంటుంది, పంచుకుంటుంది

ఒక రోజున శ్రావణి 'దాల్ లేక్' లోని 'శ్వాన్' అనే బోట్ హౌస్ మీదకు వచ్చింది. అందులో రాజశేఖరమూ, రాజేశ్వరీ అంతకు క్రితం రోజునే దిగారు.

శ్రావణి తొలిచూపులోనే రాజేశ్వరిని ఆకర్షించింది. ఆమెను రాజేశ్వరి ఆప్యాయంగా లోపలకు తీసుకెళ్ళింది. ఎందరో టూరిస్టులు ఆ ప్రాంతానికి రావడంచేత, వచ్చిన అందరితోటీ పరిచయాన్ని పెంచుకోవడంచేత శ్రావణి అన్ని భాషల్లోను పొడిమాటలూ నేర్చుకుంది.

"నీ పేరేమిటి ?" అంది రాజేశ్వరి.

"శ్రావణి" అంది శ్రావణి.

శ్రావణి మాట్లాడే అలాంటి పొడి

మాటలు రాజేశ్వరికి ఎంత విన్నా ఇంకా వినాలనిపిస్తూంటుంది. దోరమగ్గి కెంపులు తేరిన ఆమె బుగ్గలనూ, మాట్లాడేటప్పుడు ఆమె పెదవుల కదలికలనూ చిత్రంగా చూసింది రాజేశ్వరి. అలా చాలాసేపు శ్రావణితో మాట్లాడుతూ, ఆమె పలికే చిలక పలుకులను వింటూ వుండి పోయింది రాజేశ్వరి.

శ్రావణి నోటివెంట తెలుగు మాటలు వింటూవుంటే, తెలుగులోని తియ్యదనం మరీ పెరిగినట్లనిపించింది రాజేశ్వరికి. తమతోపాటే ఆ పూట భోజనం చేయమంది శ్రావణిని

అప్పటిదాకా బోట్ టాప్ మీద కూర్చుని చుట్టూ వున్న కొండల్నీ, కొండలు కప్పుకున్న ఆకు పచ్చని సొగసుల్నీ కన్నుల పండువుగా చూస్తూ వుండిపోయిన రాజశేఖరం కింద తమ గదిలోకి వచ్చాడు భార్యతో కలిసి కూర్చున్న శ్రావణిని చూశాడు. ఆమె అందాన్ని చూస్తూ ఒక్క క్షణం బొమ్మలా నిలబడిపోయాడు.

"ఏమిటి అలా వుండిపోయారు !" అంది రాజేశ్వరి నవ్వుతూ.

రాజశేఖరం తేరుకొని, "ఇప్పటిదాకా బయటి ప్రకృతి సౌందర్యాన్ని చూశాను. లోపలికి వచ్చి ఈమె సౌందర్యాన్ని చూసేసరికి కాశ్మీర్‌లోని ప్రకృతినే నీ ముందు కట్టేసుకున్నట్లనిపించింది" అన్నాడు నవ్వుతూ.

వారి సంభాషణ శ్రావణికి అర్థం కాలేదు.

"ఇక నేను వెళతాను" అంటూ లేచింది శ్రావణి.

"ఫరవాలేదు, కూర్చో. మావారు చాలా మంచివారు" అంటూ వెళ్ళి పోతున్న శ్రావణి చేయి పట్టుకొని తన పక్కనే కూర్చోబెట్టుకుంది రాజేశ్వరి.

"ఇంతసేపూ ఆమె దగ్గర నువ్వు కాశ్మీరం నేర్చుకున్నావా? నీ తెలుగు ఆమెకు నేర్పావా ?" అన్నాడు రాజశేఖరం భార్యతో.

'ఆమెకు కొన్ని తెలుగు మాటలు వచ్చు. నాకే వాళ్ళ భాషలోని ఒక్క మాటా రాదు" అంది రాజేశ్వరి.

"నీ వరస చూస్తే ఈ పిల్లతో చెలిమి చేసి మనం వెళ్ళేలోపున మొత్తం కాశ్మీరం నేర్చుకొనేలా వున్నావు."

"నయమే! మొత్తం కాశ్మీర్‌నే దోచుకొనేలా వున్నానన్నారుగాదు."

"అంతటిదానవే. ఇక భోజనానికి లేద్దామా ?" అన్నాడు రాజశేఖరం.

"శ్రావణిని కూడా మనతోపాటే భోజనం చేయమన్నాను."

"మంచిపని చేశావు. అతిథి లేకుండా చేసిన భోజనం భోజనమే కాదనేవారు మా నాన్నగారు."

"అంతవరకూ ఫర్వాలేదు. మామ గారి సౌందర్యోపాసనను మాత్రం

ఆచరణలో పెట్టకండి" అంది రాజేశ్వరి భర్త కళ్ళల్లోకి కొంటెగా చూస్తూ.

వారి మాటలుగానీ, సంభాషణగానీ, ఆ సంభాషణలోని అంతర్యంగానీ శ్రావణికి అంతుపట్టలేదు.

"ఏమిటి అంటున్నాడు?" అంది శ్రావణి వచ్చీరాని తెలుగులో.

ఆమె మాటలకు ఇద్దరూ నవ్వు కున్నారు.

"నిన్ను రోజూ భోజనానికి ఇక్కడికే రమ్మంటున్నారు" అని సైగలతో శ్రావణికి అర్థమయ్యేట్టు చెప్పడానికి ప్రయత్నించింది రాజేశ్వరి.

ఆ రోజు అలా శ్రావణి ఆ భార్యాభర్తలతో కలిసి భోజనం చేసింది.

భోజనాలైన తర్వాత రాజేశ్వరి తన వెంట తెచ్చుకున్న వీణను తీసి శ్రుతి చేసింది. ఆ నాదానికే శ్రావణి జోల పాట వింటున్న పసిపాపలా కూర్చుండి పోయింది. వీణా నాదంతో గొంతు కలిపి రాజేశ్వరి ఒక రాగాన్ని ఆలపించి ఓ పాట పాడింది. దాంతో శ్రావణి తన్ను తాను మర్చిపోయింది.

అలా శ్రావణి, రాజేశ్వరుల స్నేహం రోజు రోజుకి పెరగసాగింది. ఉదయాన్నే పూలు తెచ్చి యిచ్చి రాజేశ్వరితోటే శ్రావణి పగలంతా వుండిపోయేది. చీకటిపడిన తర్వాత వొదల్లేక వొదల్లేక బోట్ హౌస్ నుంచి బయటికొచ్చేది. ఒక్కొక్క రోజున శ్రావణి రావడం ఆలస్యమైతే రాజేశ్వరి వెయ్యికళ్ళతో ఎదురుచూసేది. అది గమనించిన రాజశేఖరం, నీ చెలికత్తె చెలిమిలో పడి కాశ్మీర్ వొదిలి రానవేలా వున్నావు" అని వేళాకోళమాడేవాడు భార్యను. ఇద్దరూ నవ్వుకొనేవారు.

"పాపం, మంచి పిల్లండీ! నా అన్నవాళ్ళు ఎవ్వరూ లేరట" అనేది రాజేశ్వరి.

శ్రావణి రాగానే రాజశేఖరాన్ని కూడా మర్చిపోయి రోజంతా ఆమెతోనే గడిపేది.

రాజేశ్వరి వీణ వాయించడం చూసి తాను కూడా నేర్చుకోవాలని శ్రావణి ముచ్చటపడింది.

అప్పుడప్పుడూ రాజేశ్వరి ఆమెకు వీణ నేర్పేది. ఎక్కువసేపు రాజేశ్వరితో కలిసి వుండటతో ఆమె చాల తెలుగు మాటలు నేర్చుకొంది. రోజూ సాయంత్రపువేళ రాజేశ్వరి వీణ వాయిస్తూ వుంటే ప్రక్కనే శ్రావణి, ఎదురుగ్గా రాజశేఖరం కూర్చునేవారు. ఆమె ఎప్పుడు వీణ చేతబట్టి, రాగం ఆలపించినా కనులు మూసుకొని తన్మయుడయ్యేవాడు రాజశేఖరం. అలాంటిది ఒక రోజున రాజేశ్వరి ఎంతో ఉద్వేగంతో పాడుతూ వుండగా, ఎప్పటిలా కళ్ళు మూసుకొని తన్మయత్వం చెందకుండా, విప్పారిన నేత్రాలతో తనకి ఎదురుగ్గా కూర్చున్న

రాజేశ్వరీ శ్రావణులను చూస్తున్నాడు. అది గమనించిన రాజేశ్వరి - "నేను రాగాలాపన ప్రారంభించగానే కనులు మూసుకొని తన్మయులై వినే మీరు ఈ రోజున కనులు తెరిచే వున్నారు. ఈ రోజు నా గానం అంత బావుండలేదా ?" అంది.

"గానం బావుండక కాదు. ఎప్పటి కంటె బావుంది. కాని కళ్లతో అందాలను చూస్తూ ఆలాపనలను విని ఆనందిస్తు న్నాను. కళ్ళు మూసుకొని వింటే ఆలాపననే వినగలనుగానీ, అందాలను చూడలేనుగా !" అన్నాడు రాజశేఖరం.

రాజేశ్వరికి తన భర్త తన అందాన్ని చూస్తున్నాడో, శ్రావణి అందానే ఆస్వా దిస్తున్నాడో అర్థంకాలేదు. నోరు తెరిచి అడిగితే శ్రావణి నొచ్చుకుంటుందేమో నని, ఆమె అడగలేదు.

రోజస్తమానమూ రాజేశ్వరీ, రాజ శేఖరాలతోనే శ్రావణి కాలం గడుపుతూ వుండటంచేత వారి మధ్య అరమరికలు తగ్గాయి. కొత్తలో ముభావంగా కూర్చున్నా రాను రాను శ్రావణి రాజశేఖరానికీ, రాజేశ్వరికీ సపర్యలు చేయసాగింది. చనువు పెంచుకుంది. బయటకు వెళ్ళినా ముగ్గురూ కలిసే వెళ్ళేవారు. ఒక్కొక్కసారి రాజేశ్వరిని ఒక్కత్తెనే తనవెంట తీసుకెళ్ళి చుట్టూ తిప్పుకొచ్చేది శ్రావణి. అలా శ్రావణి కాశ్మీర్‌లో పుట్టిపెరిగిన పిల్లే అయినా రాజశేఖరం కుటుంబంలోని మనిషిలా రాజేశ్వరి ఆత్మీయురాలిగా తయారైంది.

ఒక రోజున కాంచన కుటీరానికి ప్రయాణమయ్యారు రాజశేఖరం, రాజేశ్వరి.

"శ్రావణిని కూడా మనతో రమ్మ న్నాను," అంది రాజేశ్వరి భర్తతో.

"ఇంతటి అందమైన ప్రదేశాన్ని వొదిలి శ్రావణి మనతో రావడానికి ఒప్పుకుందా ?" అన్నాడు రాజశేఖరం.

"ఇక్కడి ప్రకృతి అందంకంటె మా చెలిమే బలమైంది కాబట్టి మనతో వస్తోంది."

"ఆమె రావడం నాకూ సంతోషమే. నీకూ కాస్త కాలక్షేపంగా వుంటుంది" అని తన అంగీకారాన్ని తెలియజేశాడు రాజశేఖరం.

ముగ్గురూ కాంచన కుటీరానికి బయల్దేరారు.

పుట్టింది మొదలు ఎన్నడూ కాశ్మీర్ కొండలోయలో తప్ప బయటి ప్రపంచం ఎరగని శ్రావణికి ప్రయాణమంతా కొత్తగానూ, వింతగానూ అనిపించింది.

కాశ్మీర్‌నుంచి బయలుదేరి దక్షిణానికి వస్తూన్న శ్రావణికి దారి పొడుగునా కనిపించే రకరకాల జనం, రకరకాల కట్టూ బొట్టూ, రకరకాల సాంప్ర దాయాలు - తానేదో అనేక ప్రపంచా లను దాటి వెళ్ళిపోతున్నట్లు అనిపించింది. అయినా శ్రావణికి బాధ అనిపించలేదు.

అంటూ లాలనగా మాటాడారు. ఏదో కొంత ఉపశాంతి. నెమ్మదిగా లేచాను. మెట్లుదిగుతూ ఆగి తాతగారివంక తిరిగి "వెళ్తాను తాతగారూ," అన్నాను ఆయన చేతిని తాకి. ఆయన పలుక లేదు. ఎవరినో చూస్తున్నట్టున్నాయి అతని చూపులు. స్వరంపెంచి "వెళ్ళిపో తున్నాను తాతగారూ! దయఉంచండి" అన్నాను. ఆయన సర్దుకుని, చూపులు మరల్చుకొని నన్నుచూచి "తప్పు బాబూ! 'అలా అనకూడదు. వెళ్ళివస్తాననండి" అన్నారు. తల విదుల్చుకొన్నాను "రాను తాతగారూ! రాను. ఈ వెళ్ళిపోవటమే వెళ్ళిపోవటం. సెలవియ్యండి."

తాతగారు మెట్లుదిగారు. "పోనీ బాబూ?...ఒక్కసారి..." నాకు తెలుసు తాతగారేంటారో. యామిని నన్నింకా ఆరాధించటం నేను సహించలేను. యామిని నన్నుద్వేషించాలి. అసహ్యించు కోవాలి.

కారువైపు పరుగెత్తాను ఒకసారి ఆ యింటివైపుచూచి కారు స్టార్టుచేశాను. కారు ముందుకు కదలటంలేనంతగా పోతోంది. యామినిని కలిసి మాటాడలేని నా మనసుమాత్రం వేగంగా వెనుకకు పరుగెడుతోంది. చెఱువు మొగలులోకి వచ్చింది కారు. దాని చెట్టుక్రింద బొజ్జ వినాయకుడు నన్నే చిత్రంగా చూస్తూ, నావైపు పరిహాసంగా చూస్తూ నవ్వు తున్నాడు. గాలి విసురుగా కదిలింది. పడమటకు వంగిన వెన్నెల చెట్లాకుల లోంచి వినాయకుడిమీద కదిలింది. అక్కడే కొద్దిసేపు కూర్చుని ఏదో చెప్పుకోవాలనిపించింది.

మనిషి మనిషిని ద్వేషిస్తాడు. ప్రేమిస్తాడు, సృష్టించిన శక్తికి తప్ప మరెవరికీ అందుకు సరియైన కారణం తెలియదు. అందరూ వేదాంతులు కారు. కాలేరు. కాని తమ చుట్టూ ఉన్నదంతా 'అస్థిర మని,' 'అశాశ్వతం' అని నమ్ముతారు. అయినా అశాశ్వతమైన దానిని, ప్రేమించకుండా ఉండలేరు వాటికోసం వెర్రిపడకుండా ఉండలేరు.

నేను బ్రతికిఉన్నంతకాలం యామిని మీద ప్రీతి ఉండనే ఉంటుంది. యామినికూడా అంతే.

నేనుగాని, యామినిగాని శాశ్వతం కాము. అశాశ్వతమైన ఈ జీవితం శాశ్వతమైనదానిని దేనినో కోరుతోంది. నాకు తెలుసు. మనం పొందని దేదుందో అదే శాశ్వతం. మనం పొందినవన్నీ అశాశ్వతాలు. అశాశ్వతంనుండి శాశ్వతాన్ని పొందటంకోసమే ఆర్యులు తపసు చేసేవారేమో.

కారు నాపాను. దిగబోతున్న తరుణంలో నాచేయితగిలి క్రిందకుజారి పోయింది. ఆత్రుతగా చూశాను. అది నా బ్రీఫ్‌కేస్ తాతగారికి, యామిని కోసం డబ్బుతోతెచ్చిన బ్రీఫ్‌కేస్ అయోమయంగా పెట్టెనుచూస్తూ, పెట్టెను

తెరచిచూశాను. నేనిచ్చిన నోట్లకట్టలు అలాగే ఉన్నాయి. వాటిమీద నేను తాతగారికోసం అసంపూర్ణంగా వ్రాసిన బ్యాంకుచెక్కు. దానిప్రక్కనే ఉంది; నాచేతిరుమాలు. వెంటనే అర్థమైంది. ఆ కేస్ నా కారులోకి ఎలా వచ్చినదీ. నా చుట్టూ చీకటికమ్మింది. వెన్నెల కాచు పూసుకుంది. యామిని ఇంటిలో మరచిపోయిన రుమాలును తిరిగి అందివ్వటానికి యామినితప్ప మరెవరికుంది అవకాశం? వెంటనే ఊరులోకి పరుగెత్తిపోయి, యామిని ముందు వ్రాలిపోవాలనిపించింది. అటే రెండడుగులు వేశాను.

నే నిలుచున్న చోటునుండి కొద్దిగ ఎదురుగా, ఊరుదరి రేవులో ఒకతెల్లని చీర నీటినుండి బయటికి వచ్చింది. నావైపే తిరిగింది. వక్షంపై కొంత వ్యాపించిన పొడవైన జుట్టు–వెన్నెలను కలుపుకుంటున్న ఆ చీకటిలో నన్నే చూస్తున్న కళ్ళు–నేను గుర్తుపట్టాను. ఆ నిల్చున్న తీరు నాకు తెలుసు. ఆమె యామిని. కొద్దిగ నీటినుండి బయటకు వచ్చి ఒడ్డునచేరి కుంకుమ దిద్దుకుంది. దీపపు ప్రమిదను వెలిగించింది. ఆ ప్రమిదను ఎందులోనో (బహుశా అరటి మట్ట అయిఉంటుంది) ఉంచింది. దానిని రెండుచేతులలోకి తీసికుంది. నీటిలోకి దిగింది. మోకాళ్ళ నీటిని దాటింది. మొలదాటింది నీరు. ఇంకా ముందుకొచ్చి రెండుచేతులను పైకెత్తిపట్టింది. ఆ వెలుగులో యామిని కళ్ళను, ఆకళ్ళలో వెలుగును చూశాను. ఇంకా ముందుకు వచ్చింది. నీరు నాభిని దాటింది. ఇంకా ముందుకొచ్చింది. నీరు వక్షాన్ని దాటింది. యామిని పొడవైన బాహువులను ముందుకుచాచి నీటికి, సమాంతరంగా ఉంచి వెలుగుతున్న దీపాన్ని నీటిపైనుంచి నెమ్మదిగా ముందుకు త్రోసింది. తాను ఒడ్డుకుచేరి ఆ కదలే దీపాన్నే (ఇప్పుడర్థమైంది. అది ఓడ) చూస్తూ నిలబడిపోయింది. నేను యామినిని చూశాను. ఆ దీపాన్ని చూశాను. దీపమున్న ఓడను చూశాను. ఆ ఓడ నావైపే ప్రయాణిస్తోంది. యామిని తన చూపులతో దీపాన్ని నావైపే నెట్టుతోంది. ఆ దీపం దేదీప్యమానంగా వెలుగుతోంది. ఆ వెలుగే నా చుట్టూ నిండింది. 'యామినీ' బిగ్గరగా అరవాలనుకున్నాను. మాట గొంతులోనే ఉండిపోయింది. ఊరు మేలుకుని చెలువుచుట్టూ చేరసాగింది, యామిని ఊరిలోనికి కదలిపోయింది. ఓడ మాత్రం నావైపే పయనించసాగింది. దరినున్న గట్టుపైని ఆకాశదీపం నన్నే చూడసాగింది.

———




ఇందిరా సేవాసదనంలో. సాయంత్రం ఆరుగంటలు కొట్టింది! కూరగాయల మొక్కల్లో పనిచేస్తున్న ఆడపిల్లలందరూ, చేస్తున్న పనిముగించి, బిలబిలలాడుతూ, అక్కడున్న నూతి దగ్గరకు వెళ్ళి, కాళ్ళూ చేతులూ కడుక్కుని, ప్రార్థనహాలువైపు పరుగెత్తసాగారు. శారద బావిలోనుంచి నీళ్ళు తోడుతోంది! ఆ బకెట్ పైకి రాగానే, 'శారద! నాకు! నాకివ్వు!' అంటూ అందరూ ఆ బకెట్ లాక్కుని కాళ్ళూ చేతులూ కడుక్కుంటున్నారు శారద చిరాకు పడలేదు. వారిని 'మీరు నీళ్ళు తోడుకోలేరా' అంటూ కసరలేదు. చిరునవ్వుతో, ఖాళీ అయిన బకెట్ నూతిలోకి జార్చి నీళ్ళుతోడి అందిస్తూనే వుంది! "మా శారద మంచిది! మా శారద దేవత!" అంటూ వాళ్ళు నవ్వుతూ ప్రశంసిస్తున్నారు. శారద ఆ పొగడ్తలు పట్టించుకున్నట్టేలేదు!

అందరూ వెళ్ళిపోయారు! శారద ఆఖరున నీళ్ళ బకెట్ అందుకొని, ముఖం కడుక్కుంది! ఎండలో శారీరక శ్రమపడిన తర్వాత నీళ్ళతో ముఖం కడుక్కుంటే, ఆ చల్లదనం అపరిమితమైన హాయిగా వుంటుంది! శారద

ఆ హాయిని అనుభవిస్తున్నదానిలా ముఖం తుడుచుకుంటోంది! సూర్యాస్తమయం అవుతోంది! దాని కాంతిలో సేవా సదనంవయసు మళ్ళిన స్త్రీలా, పాత బడిన గోడలతో నిలబడి వుంది.

శారద ప్రార్థనా మందిరం వైపు మెల్లగా నడుస్తోంది! ఇంతలో సేవా సదనం ఆవరణలోకి కారు ఒకటి దూసుకు వచ్చింది! కారు హారను వినగానే తిరిగిచూసింది. కారు ఆగీ, ఆగగానే, దాని తలుపులు తెరుచు కున్నాయి! అందులోనుంచి పెద్దపాప, చిన్నపాప, చంటి వురికినట్టుగా దిగారు. వాళ్ళ చేతులనిండా పాకెట్లు వున్నాయి.

'శారదా!' అంటూ పరుగున దగ్గరకి వచ్చారు. వాళ్ళని చూడగానే శారద ముఖం సంతోషంతో వెలిగింది.

"ఇదేమిటి? ఇలా హఠాత్తుగా వచ్చేసారు?" సంతోషం నిగ్రహించు కుంటూ అడిగింది.

"నిన్ను చూడాలని అనిపించినప్పుడు నాన్నకి చెప్ప మన్నావుగా! చెప్పాం. నాన్న వెంటనే సరే అన్నాడు. అంతేకాదు శారదకు మీరేం తీసుకు వెళ్తారు? అన్నాడు. నేనేమో స్వీట్లు అన్నాను. చిన్నపాప పువ్వులు, పళ్ళు అంది. చంటి పాప బిస్కెట్లు అంది. నాన్న మమ్మల్ని బజారుకు తీసుకెళ్ళి ఎవరికి ఏం కావాలంటే అది కొని పెట్టాడు. ఇవిగో! తీసుకో" పెద్దపాప గుక్కతిప్పుకోకుండా చెప్పింది. ముగ్గురూ చేతుల్లో వున్న ప్యాకెట్లని, శారదచేతుల్లో కుక్కారు.

శారద సంభ్రమాశ్చర్యాలతో చూస్తోంది! ఇలాంటి ఆదరణ, అభిమానం, యింతకు ముందు ఎక్కడా ఎవరి దగ్గరా ఎరగదు. తను చాలా మంది యిళ్ళలో వెళ్ళి వుండి సాయం చేసి వచ్చింది! తనకోసం ఎవరు వచ్చినా, వచ్చినప్పుడు వుండే అభిమానం, ఆప్యాయత, తిరిగి వచ్చే టప్పుడు వుండవు! అవసరం తీరగానే తన పేరుకూడా ఎవ్వరికీ గుర్తుండదు! కానీ, ఈ చిన్నారి పాపలు, వీళ్ళ అమాయక ముఖాలు, ఆ కళ్ళలో తనదగ్గరకి వచ్చారనే ఆనందం ఇవి చూస్తుంటే. యీ అనుభవం కొత్తగా వుంది!

శారద వాళ్ళని తీసుకొని, అక్కడున్న ఒక చెట్టుదగ్గరకి వెళ్ళింది. దాని క్రింద వున్న అరుగుమీద వాళ్ళని కూర్చోపెట్టి తను కూర్చుంటూ, "ఇంకేమిటి సంగతులు! విశేషాలు చెప్పండి. ఆయింట్లో మీకు బాగుందా?" అని అడిగింది.

ముగ్గురూ తలలూపారు. పెద్దపాప పసిపిల్లలా, ఉత్సాహం పట్టలేనట్టుగా చెప్పసాగింది. "శారదా! నువ్వు వెళ్ళిపో తుంటే మేం భయపడ్డాం! కానీ, నాన్న యిప్పుడు మమ్మల్ని ఎంత బాగా

చూస్తున్నాడో తెలుసా! మేం అన్నం తిన్నామా లేదా అని ప్రతిపూటా అడుగుతాడు. నువ్వు వచ్చేసిన తర్వాత రాత్రిపూట ఒంటరిగా పడుకోటానికి మేం భయపడుతుంటే, మమ్మల్ని తన గదిలో పడుకోమని చెప్పాడు. నువ్వు చెప్పినట్టే నాన్నకి కావలిసిన పనులన్నీ మేమే చేస్తున్నాం! ఒక్క మాటకూడా మర్చిపోలేదు."

చిన్నపాప పూలదండ తీసి శారద జడలో పెట్టింది. చంటి స్వీట్ పాకెట్ విప్పి స్వీట్ తీసి శారద నోటిలో పెట్టింది. శారద తను కూడా వాళ్ళకి తినిపించింది.

చిన్నపాప చెప్పసాగింది. "శారదా! రాత్రి ఏమయిందో తెలుసా! నాన్న అన్నం తినలేదు. అత్తయ్య, నాన్న ఎందుకో బాగా పోట్లాడుకున్నారు. నాన్న అత్తయ్యకి చేతులు జోడించి. 'నీకు పుణ్యంవుంటుంది! నా బ్రతుకు యిలా వెళ్ళదీయనీ!' అన్నాడు. అత్తయ్యేమో, 'నీకు విశ్వాసం లేదురా! వుంటే నామాట వినేవాడివి,' అంటూ తిట్టింది. నాన్న భోజనం చేయకుండా వెళ్ళి గదిలో కూర్చున్నాడు అత్తయ్య అన్నానికి ఎంత పిలిచినా 'ఆకలి లేదు,' అంటూ రాలేదు. అప్పుడు నేనేం చేసానో తెలుసా? అందరూ పడుకున్న తర్వాత కంచంలో అన్నంపెట్టి తీసుకువెళ్ళి నాన్న ముందు పెట్టాను. నాన్నేమో సిగరెట్లు ఒకదాని వెంట ఒకటి కాలుస్తున్నాడు. నన్ను చూడగానే కోపంగా, 'అన్నం నిన్ను ఎవరు తెమ్మన్నారు.' అంటూ కసిరాడు. 'శారద వుంటే, నువ్వు అన్నం తినకపోతే వూరుకోదుగా!' అన్నాను. నాన్న ఏమనుకున్నాడో ఏమో నన్ను యింకేం అనలేదు. మెదలకుండా అన్నం తిన్నాడు. నేను కంచం తీస్తుంటే,' శారద అంటే యిష్టమా?' అన్నాడు. చాలా యిష్టం. శారద చాలా మంచిది. అన్నాను. పెద్దపాపని, చంటిని కూడా పిలిచి అడిగాడు వాళ్ళు కూడా నాలాగే జవాబు చెప్పారు.

'శారదని చూడాలనివుందా?' అని అడిగాడు.

'అవునన్నాం.' 'రేపు పంపిస్తాను' అన్నాడు. పంపించాడు.

శారద ముగ్ధురాలు అయినట్టుగా ఆ కబుర్లే వింటోంది! ఇంతలో పెద్దపిల్ల హఠాత్తుగా లేచినిలబడింది. 'అయ్యో! మర్చిపోయాను!' అంటూ కారుదగ్గరికి పరుగెత్తింది అందులోనుంచి తన స్కూలు బాగ్ తెస్తూ' శారదా! నాన్న నీకు యీ పుస్తకాలు యిమ్మన్నాడు.' అంటూ తీసి యిచ్చింది. శారదకి ఆ పుస్తకాలు చూడగానే, ఎక్కడలేని వుత్సాహం వచ్చింది.

ఆ రోజున తను వచ్చేటప్పుడు, ప్రసాద్ లైబ్రరీలోనుంచి యీపుస్తకాలు




ఏరుకుని దొంతర పెట్టుకుంది! ఇంతలో కవిత అక్కడికి వచ్చింది. ఆ దొంతర చూడగానే కనుబొమలు ముడుస్తూ, "అవన్నీ ఎక్కడికి?" అంది.

"నేను తీసుకు వెళ్తున్నాను. చదివి పంపిస్తాను."

"ఎవరిని అడిగి తీసుకున్నావు?"

"మీ మామయ్యని అడిగాను. తీసుకోమన్నారు."

"తీసుకోమనటానికి యీ యింట్లో ఆయన పెత్తనం ఏమీలేదు. ఆ పుస్తకాలు అక్కడపెట్టు. పాపం! ఈ నెపంతో మరో పదిసార్లు రావచ్చునని ఎత్తువేస్తున్నావు కాబోలు."

శారద మనసు చివుక్కుమంది! పుస్తకాలు వద్దంటే బాధలేదు. కానీ, మళ్ళీ రావాలని చూస్తున్నావు అనే ఎత్తిపొడుపుకి కళ్ళలో చివ్వున నీళ్ళు తిరిగాయి! ఇన్ని నెలలు యీ యింట్లో వుంది! అందరికీ ఏ లోటూ రాకుండా, అంతగా సేవలు చేసింది! ఏం? ఒక్కసారి మళ్ళీ రాకూడదా!

శారద మారుమాట్లాడకుండా, పుస్తకాల దొంతర అక్కడ వుంచేసింది.

"శారదా! పుస్తకాలు అంటే నీకు యిష్టమా! నాన్నతో చెబుతానులే!" అక్కడేవున్న చంటి అమాయకంగా అంది.

బహుశా ఆ పిల్లే చెప్పివుంటుంది! అందుకే ప్రసాద్ పంపివుంటాడు.

పెద్దపాప బాగ్‌లోనుంచి ఆఖరున ఒక బౌండ్‌బుక్ తీసి అందిస్తూ

"శారదా! నాన నిన్ను యిది చదువమన్నాడు," అంది.

"ఏమిటది?"

"నాన్న కథ వ్రాసాడుట! నిన్ను చదివి ఎలావుందీ చెప్పమన్నాడు."

"కథా! మీ నాన్నకి కథలు వ్రాయడం వచ్చునా?" ఆశ్చర్యంగా అంది.

"ఏమో. నాకు తెలియదు. ఆసలు నాన్నే మాతో వద్దామని బైలుదేరాడు. మళ్ళీ ఎందుకో మానేశాడు. మేం వస్తుంటే, యీ పుస్తకం యిచ్చి, నీకు తప్ప యింకెవ్వరికీ యిది యివ్వవద్దని చెప్పాడు."

"నిజంగానా!" శారద కుతూహలంగా ఆ పుస్తకం తెరిచింది.

అందులో మొదటి పేజీలో, 'స్నేహమయి శారదకి, అభిమానపూర్వకంగా, ప్రసాద్.' అని వుంది. పుస్తకం తిరగేసింది. అదంతా అతని స్వదస్తూరితోనే వుంది! చాలా పేజీలు వున్నాయి.

"శారదా! మనదొడ్లో నువ్వు పెట్టిన వంకాయ మొక్కలు భలే కాయలు కాస్తున్నాయి," అంది పెద్దపాప.

'సన్నజాజి ఎన్నిపూలు పూస్తోందో తెలుసా?'

పిల్లలు పసపోసిన పిట్టల్లా, ఒక్క విషయం మర్చిపోకుండా చెప్పేస్తున్నారు.

'పొద్దుపోయింది! యిక యింటికి వెళదాం రండి.' డ్రైవరు వచ్చి పిలిచాడు. పిల్లలు అయిష్టంగా, శారదని వదలలేనట్టు కదిలారు.

'శారదా! నువ్వు మళ్ళీ మా యింటికి ఎప్పుడు వస్తావు?' అని అడిగింది చంటి.

'నేనా! నాకు యిక్కడ పనితో తీరుబడే దొరకదు. మీరే ఎప్పుడైనా రండి' అంది.

'అలాగే! నువ్వు మళ్ళీ రమ్మన్నావని నాన్నతో చెబుతాను.'

'సరే!' నవ్వుతూ అంది.

పిల్లలు వెళ్ళి కారు ఎక్కారు. వారు కనుమరుగు అయేవరకూ చేతులు వూపుతూనే వున్నారు.

ప్రార్థన ముగిసింది. లోపలనుంచి కిలకిలలాడుతూ శారద తోటివాళ్ళంతా పరుగెత్తుకు వచ్చారు.

'శారదా! ఈపూట ప్రార్థనకి నువ్వు రాలేదేం?'

'నా కోసం ఎవరో వచ్చారు!'

'ఎవరు వాళ్ళు?'

ఇంతలో వాళ్ళచూపులు అక్కడున్న పుస్తకాలమీద, పువ్వులమీద పడనే పడినాయి!

"యింకెవరు! ఈవిడగారి పెంపుడు కూతుళ్ళు అయివుంటారు.! ఇవిగో! ఈ కానుకలు చెప్పటంలా!"

"అబ్బా! చాలా తెచ్చినట్టున్నారే! బిస్కెట్లు, చాకలెట్లు, స్వీట్లు, పువ్వులు, పళ్ళు, పుస్తకాలు! నువ్వు ఎంత అదృష్టవంతురాలివే శారదా! మా కోసం ఎవరూ రారు!" ఒక అమ్మాయి నిరుత్సాహంగా అంది.

'వుండవే! శారద అదృష్టం ఒక్క దాన్నీ అనుభవించ నిస్తామా!' మనం కూడా పంచుకుందాం!' అంది యింకో అమ్మాయి.

శారద చిరునవ్వుతో స్వీట్ పాకెట్ అందుకుంది. క్షణంలో పళ్ళు, పువ్వులు, స్వీట్స్ అందరి చేతుల్లోకి వెళ్ళినాయి. పుస్తకాలు కూడా అందరూ తలొకటి లాక్కున్నారు. ప్రసాద్ చేతివ్రాతతో వున్న బౌండ్ బుక్ మాత్రం శారద చేతిలో పట్టుకుంది.

"అదేమిటీ!" ఒక అమ్మాయి ఆరాతీసింది.

"ఇది ఒక కథ, నేను చదివిన తర్వాత మీకు చెబుతాను"

"అవునవును. ఈ పుస్తకాలన్నీ శారద చదివి చెబితేనే బాగుంటుంది. మన కెందుకు ఆ చదివే బాధ!" అందరూ పుస్తకాలు అక్కడ పడేసి వెళ్ళిపోయారు.

శారద చిరునవ్వుతో, అమ్మయ్య అనుకున్నట్టుగా ఆ పుస్తకాలన్నీ దొంతర పెట్టుకోసాగింది.

* * *

నీరెండ సంధ్యచీకట్టుగా మారు తోంది! సేవాసదనం వెనక ఆవరణలో మొక్కజొన్న కంకులు గాలికి వూగిస లాడుతున్నాయి! దూరంగా, మిగతా ఆడపిల్లలందరూ ఆటలాడుతున్నారు. శారద మాత్రం వాళ్ళతో కలవకుండా, ఆ మొక్కజొన్న పొలం గట్టువెంట ఒంటరిగా నడుస్తోంది! శారద చేతుల్లో బౌండ్ బుక్ వుంది! శారద మాటి మాటికి దాన్ని వేళ్ళతో తడుము తోంది! ఆ స్పర్శ ప్రియమిత్రుడితో కరస్పర్శలా ఆనందంగా, ఆహ్లాదంగా వుంది!

నడుస్తున్న శారద ఒక చెట్టుక్రింద ఆగింది! ఆ చెట్టుకి ఆనుకుని నిలబడి పరధ్యానంగా, ఆలోచిస్తూండి పోయింది! శారద మనసు యింకా, విభ్రాంతిగా, నమ్మలేనట్టుగా, కలలో వున్నట్టుగానే వుంది! వారంరోజుల క్రితం పెద్దపాప వాళ్ళు వచ్చినప్పుడు 'నాన్న కథవ్రాసాడు' అంటూ యీ బౌండ్ బుక్ యిచ్చి వెళ్ళారు. శారద ఆ రాత్రి, అందరూ పడుకున్న తర్వాత ఆఫీసు రూమ్‌లోకి వచ్చి కూర్చుని ప్రసాద్ వ్రాసిన కథ చదవసాగింది! యధాలాపంగా మొదలుపెట్టిన శారద, రామ, రామ, అందులో లీనమైపోయి నట్లుగా బాహ్యప్రపంచపు స్మృతే లేనట్టుగా అయిపోయింది!

ప్రసాద్ వ్రాసిన ఆ కథ కల్పితం కాదు! పూర్తిగా ఆతని జీవిత చరిత్ర! దానిని చదువుతుంటే, మధ్య మధ్య కళ్ళు చెమ్మగిల్లినాయి! గుండెల్ని చీలిస్తే నిట్టూర్పు వచ్చింది. అంతా అయిన తర్వాత, ప్రసాద్ చిట్టచివరకు వ్రాసిన వాక్యాలు చదవగానే, శారద

నిటారుగా అయింది. తనని తాను నమ్మ లేనట్టు మళ్ళీ మళ్ళీ చదివింది! ఎన్ని సార్లు చదివినా, శారద యింకా నమ్మ లేకపోతోంది! ఇది సాధ్యమా అన్న ఆశ్చర్యం, విభ్రాంతి ముప్పిరిగొంటు న్నాయి! చెట్టుక్రింద నిలబడిన శారద మళ్ళీ పుస్తకం తెరిచింది. అందులో ఆఖరు పేజీ చదువసాగింది! అందులో యిలా వుంది

శారదా!

ఈ పిల్లలు యిలా నాకు దగ్గర అయ్యారంటే కేవలం నువ్వే కారణం! నువ్వు నా జీవితంలో యీ రూపంగా రాకుండా వున్నట్టయితే, బహుశా నేను తండ్రిగా నిర్వర్తించవలసిన నా బాధ్య తని నాకు తెలియకుండానే వదిలేసే వాడినేమో! నేను భర్తగా అపజయం పొందినా, తండ్రిగా నా కర్తవ్యం నిర్వ ర్తించాలని వుంది! కాని — దానికి నీ తోడు, అండదండలూ చాలా అవసరం అనిపిస్తోంది! శారదా! నేను నిన్ను పెళ్ళిచేసుకుంటానంటే నీకు అవమా నంగా అనిపించటంలేదు కదూ! నా జీవితంలో జరిగిన ప్రతి చిన్నవిషయం రవంతైనా దాచకుండా నీ ముందు పెట్టాను! నేను జైలుకు వెళ్ళిన పరి స్థితులు, పిచ్చాసుపత్రిలో గడిపిన రోజులూ, ఏదీ దాచలేదు! నా గురించి లోకం నీకేమీ చెప్పే అవకాశం యివ్వ కుండా, నేనే చెప్పేశాను! నా కెందుకో మరీ మరీ అనిపిస్తోంది. నువు అందరి అమ్మాయిల్లాటి దానివి కాదు! మనుష్యుల కష్టసుఖాలు, వాళ్ళ అంతర్యాలూ పసికట్టే నేర్పు నీకుందని భావిస్తున్నాను.

శారదా! నా జీవితనౌక సమస్యల పెనుతుఫాను గాలితాకిడికి గురిఅయి దురదృష్టపుసుడిగుండాల మధ్య చిక్కిపడి చివరికి ఎలాగయితేనేం, భగవంతుని దయవల్ల శిథిలంగాకుండా బైటపడింది. ఈ జీవితనౌక ప్రశాంతతీరం ఎటు వుందా అని వెతుక్కుంటూన్న సమ యంలో నువ్వు వచ్చావు! యిప్పటి వరకూ నా జీవితం అంతా సమస్యల మయంగానే తెల్లవారింది. యీ పెనుగు లాటలో అలిసిపోయాను నేను! నా శరీ రానికి వయసు 38 సంవత్సరాలేఅయినా మనసుకి మాత్రం 60 సం॥లు దాటినట్టే వుంది! అంత కంటకంగా, అంత భారంగా గడిచింది నా జీవితం! కొద్ది రోజులు అయినా నిర్విచారంగా, నిశ్చిం తగా, యీ లోకం కళ్ళముందు నేనూ ఒక మనిషినే సుమా అన్నట్టుగా బతకా లని వుంది! నేను ఈ విధంగా పెళ్ళి మాట తీసుకురావటానికి, మనపరిచయం ఎంత అని నువ్వు ఆగ్రహపడకు! నేను నీకు తెలిసినట్టే నువ్వు కూడా నాకు తెలుసు!

ఒక విధంగా, నా పరిస్థితులు ఎలా విపరీతమో, నీ పరిస్థితులుకూడా అంతే! మామూలు మనిషిగా కన్పించినా అందరి

కంటే నా జీవితం ఎలా భిన్నమో, నీ జీవితంకూడా అంతే! మనలాటి వ్యక్తులకి మామూలు పెళ్ళిళ్ళు అవవు! మొదటి చూపులో ప్రేమ, ఆకర్షణ, అంటూ దగ్గరయే వ్యక్తుల కోవకి మనం చెందము! పెళ్ళిపట్ల నీకు ఆశలు కంటే అతి వాస్తవికత బాగా ముఖ్యం అయి వుంటుందనే ధైర్యంతో, యింత నిర్మొహమాటంగా వ్రాస్తున్నాను!

శారదా! నువ్వు స్నేహమయివి! ఆ స్నేహంకోసమే నేను చేయి చాస్తున్నాను. నా చేయి నువ్వు అందుకుంటే నేనెంతో అదృష్టవంతుడినని భావిస్తాను. స్త్రీ పురుషుల జీవితాలకి ఎంతో ముఖ్యమైన పెళ్ళికి యీ స్నేహం చాలా అని నువ్వు ప్రశ్నిస్తే, చాలు అని నేను గట్టిగా జవాబు చెప్పగలను. ఎందుకంటే భార్యాభర్తలు స్నేహితులు అయితే ఆవివాహం నూటికి నూరుపాళ్లూ విజయవంతం అవుతుంది! ఎందుకో తెలుసా? స్నేహంతో అభిమానం మొలకెత్తుతుంది! అభిమానం అనేది వుంటే ఆదరణ లభిస్తుంది! ఆదరణ, అనురాగానికి పునాదిరాయి అవుతుంది. యిలా కట్టుకుంటూ వచ్చిన ఆ అనురాగ మందిరం ఆ భార్యాభర్తల పాలిట స్వర్గసీమగా మారుతుంది!

శారదా! నేను నీ విషయంలో ఆశలు పెంచుకున్నానేమో నాకు తెలియదు. నాది తప్పు అయితే ఒప్పుకోవటానికి, నీకు క్షమార్పణ చెప్పుకోవటానికి సిద్ధంగానే వున్నాను!

నీకు ఆలోచించుకోవటానికి వారం రోజులు వ్యవధి యిస్తున్నాను. వారం రోజుల అనంతరం నేను మీ సేవా సదనానికి వస్తాను. నువ్వు అంగీకరిస్తే ప్రత్యేకంగా నోరువిప్పి జవాబు చెప్పనవసరంలేదు. నీ మనసులో మాట నీ ముఖంమీద నేను చదువగలను! ఒక వేళ నీపట్ల నా అంచనా తప్పయితేనన్ను క్షమించగల మంచి మనసు నీ కుందని నాకు తెలుసు! ఈ పుస్తకం మౌనంగా నాకు వాపసు యిచ్చెయ్యి!

నా భవిష్యత్ నిర్ణయించే ఆ క్షణం కోసం నేను ఎదురు చూస్తున్నానని నీకు తెలిసే వుంటుంది.

వుంటాను
నీ వాడు కావాలిని
కోరుకుంటున్న,
ప్రసాద్.

శారద గుండెలు చీల్చుకొని వచ్చినట్టుగా నిట్టూర్పు వచ్చింది! పుస్తకం మూసేసి, ఒక్క క్షణం వెక్కి- చెట్టుకు అనుకుని, కళ్ళు మూసుకుంది!

'ఇది నిజమా! ఇది నిజమా!' శారద మనసు పదేపదే అనుకుంటోంది. పెళ్ళిని గురించి అతను చెప్పిన నిర్వచనం మళ్ళీ మళ్ళీ చెవుల్లో ప్రతిధ్వనిస్తోంది!

ఆ పుస్తకంలో ఆఖరున ఆ వాక్యాలు చదవగానే శారద మొదట్లో నమ్మలేక పోయింది. ఒకటికి పదిసార్లు, వంద

సార్థు చదివింది! ఆ అక్షరాలు ఇప్పుడు శారద రక్తంలో కలిసిపోయినట్లుగా వున్నాయి. 'మనలాటి వ్యక్తులకి మామూలు పెళ్ళిళ్ళు అవవు. మొదటి చూపులో ప్రేమ, ఆకర్షణ అంటూ దగ్గరయే వ్యక్తుల కోవకి మనం చెందం!' ఎంత బాగా చెప్పాడు. తన మనసు తనకంటే అతనికే బాగా అర్థంఅయినట్టుంది. నిజమే! అనాథ ఆశ్రమంలో దిక్కులేని పేదబాలికగా పెరిగిన తనకి, ప్రసాద్‌లాటి వ్యక్తి కావాలి. అతనికి జీవితం అంటే ఏమిటో బాగా తెలుసు! దాని ఆటుపోట్లుఎలాఉంటాయో, ఎరిగిన అనుభవం తనకి చాలా అండగా నిలబడుతుంది!

ప్రసాద్ ఉత్తరం శారద మనసులో అమృతపు తొలకరి కురిపించసాగింది. శూన్యంగావున్న ఆ బీడులో ఆశల మొలకలు రేకెత్తసాగినాయి! తనదీ అనే ఒక చిన్న యిల్లు. తనవాడు అనే ఒక వ్యక్తి భర్త! తన పిల్లలు! శారద కళ్ళముందు ప్రసాద్ రూపం కదులుతోంది!

'ఏయ్, శారదా! శారదా! ప్రార్థనకి టైమ్ అవుతోంది, రావే!' దూరం నుంచి పిల్లలు కేకలు పెట్టారు. శారద వులిక్కిపడినట్టుగా కళ్ళు తెరిచింది.

"రా, త్వరగా! ఈ రోజు నువ్వు రాకపోతే మేం ప్రార్థన చెయ్యం." యింకో అమ్మాయి గొంతెత్తి అరిచింది.

శారద పుస్తకం మూసేసింది. ఆఫీసులోకి వెళ్ళి బీరువాలో, పాత ఫైల్స్ వెనుక దాన్ని దాచేసింది. బీరువా మూసి తాళంచెవులు కొంగున కట్టుకుంటూ ప్రార్థనా మందిరంవైపు నడిచింది.

అందరూ వరసగా కూర్చునివున్నారు శారద వచ్చి తంబురా తీసుకుంది! రోజూపాడే ప్రార్థనాగీతమే అది. శారద కంఠం శ్రావ్యంగా వుంటుంది. శారద వచ్చిన కొత్తలో కనకమణిగారునేర్పింది. అప్పటినుంచీ ప్రార్థన గీతం పాడటం శారదవంతే! శారద చరణాలు అన్నిస్తుంటే మిగతా వాళ్ళు అంటుంటారు.

ఆ పాట ఎవరు వ్రాశారో శారదకు తెలియదు సర్వమానవ సమానత్వం గురించి ఎలుగెత్తిచెప్పే భాష అది. మతాలన్నీ ఒక్కటే! మనుష్యులందరూ ఒక్కటే. దేవుడూ ఒక్కడే. ఈ రోజు ఆ పాట పాడుతుంటే శారదకి ఎంతో హాయిగా వుంది. జీవితాలు అందరివీ ఒక్కటే. జననం, మరణం మామూలే. ప్రార్థన ముగిసింది. అందరూ బిలబిలలాడుతూ వెళ్ళిపోయారు.

శారద తంబురా తీసి మూలగానున్న పెట్టెలో భద్రపరచింది. పిల్లలు క్రింద పరుచుకుని కూర్చున్న జంపఖానా తీసి మడతపెట్టి అక్కడున్న బల్లమీద పెట్టింది. ఈ పనులేవీ శారదకు కొత్త కాదు. తను సేవాసదనంలో చేరినప్పటి నుంచీచేస్తున్న దినచర్యే. కిటికీతలుపులు




ఒక్కొక్కటే మూసి పరదాలు లాగుతోంది. కనకమణిగారు వూళ్లో లేదు. ఆమె లేనప్పుడు సేవాసదనం బాధ్యత అంతా శారదదే !

శారద యాంత్రికంగా లైట్లుతీస్తోంది. మధ్యనున్న లైట్ స్విచ్ తీయబోతూ, ఎందుకో వెనక్కి తిరిగింది. అక్కడ హాలు మధ్యగా ప్రసాద్ నిలబడివున్నాడు. ఎప్పుడు వచ్చాడో! శారదని నిశ్శబ్దంగా గమనిస్తున్నవాడిలా మౌనంగా నిలబడి వున్నాడు. శారద మాట్లాడలేకపోయింది. అతన్ని అలాగే చూస్తూంది. అతను కూడా శారదనే చూస్తున్నాడు. శారద అతనివైపు నాలుగు అడుగులు వేసి, మధ్యలో ఆగిపోయింది. అతనుకూడా రెండడుగులు ముందుకు వచ్చాడు. అంతలోనే సందేహంగా ఆగిపోయాడు. శారద బొమ్మలా నిలబడి వుంది.

రెండు నిమిషాలు గడిచాయి. నిశబ్దం అందంగా, గంభీరంగా, భరించలేనట్టుగా వుంది !

అతనే ఆ నిశబ్దాన్ని భంగపరుస్తూ పిలిచాడు.

"శారదా !"

శారద తలెత్తి చూసింది.

"నేను పంపిన పుస్తకం చదివావా?"

చదివానన్నట్టు తలవూపింది.

అతను మళ్ళీ మౌనంగా అయిపోయాడు.

శారద అతను చెప్పబోయే మాట కోసం వేచిచూస్తున్నదానిలా నిలబడింది.

'శారదా !' అతను పిలిచాడు. ఈ సారి అతని కంఠం మృదుగంభీరంగా వుంది.

శారద తలెత్తి చూసింది.

అతను చెయి చాచాడు.

శారద అడుగులో అడుగు వేస్తున్నట్టుగా అతని దగ్గరకు వచ్చింది. చెయి కొద్దిగా ఎత్తి చాచింది. అతను ఆ చేతిని రెండుచేతులతో గట్టిగా పట్టుకున్నాడు. అతను ఆ చేతిని లాక్కున్న వేగం ఎలాటిదోకానీ, హఠాత్తుగా శారద అతనికి అతి సన్నిహితంగా, ముఖాముఖీ నిలబడింది.

"శారదా! నేను—నేను చాలా భయపడ్డాను. అతను అస్పష్టంగా అన్నాడు.

"నేనుకూడా భయపడ్డాను" మెల్లని స్వరంతో అంది.

"నువ్వా! ఎందుకు ?"

"మీరు—మీరు-మనసు మార్చుకుని, రారేమోనని."

అతను విచిత్రంగా చూశాడు. ఆ వెంటనే అతని పెదవులమీద మనోహరమైన చిరునవ్వు వెలిగింది. శారదచేతిని అలా పట్టుకునే, తన కుడిచేతికి వున్న వుంగరం తీశాడు. శారద ఎడమచేతికి గుండెల దగ్గరగా పట్టుకుని వేలుకి తొడిగాడు.

"ఇదేమిటి ?" దాన్ని చూస్తూ.

"ఈ క్షణంనుంచీ మనిద్దరం స్నేహితులం. కాబోయే భార్యాభర్తలం !"

శారద తలెత్తి చూసేలోపలే అతని చెంప, ఆమె చెంపని ఆత్మీయంగా రాచుకుంది. శారదకి యిది వాస్తవంగాలేదు. కలలో తేలిపోతున్నట్టుగా వుంది!

ఇంతలో ఇద్దరు పిల్లలు లోపలికి వచ్చారు.

పాదాల చప్పుడు వినగానే ప్రసాద్ శారదని వదిలేశాడు. అతి సన్నిహితంగా నిలబడిన శారదని, ప్రసాద్‌ని వాళ్ళిద్దరూ కళ్ళు పెద్దవిచేసుకొని చూడసాగారు.

శారద వాళ్ళని చూడగానే నవ్వు తెచ్చిపెట్టుకుంది. "విమలా! ఈయన ప్రసాద్ అని-" ఖంగారుగా పరిచయం చేసింది.

"శారదకి కాబోయే భర్తని" ఎలాటి తడబాటులేకుండా చెప్పేశాడు ప్రసాద్.

వాళ్ళ కళ్ళు రెపరెపలాడినాయి. ఒక్కసారి వెనక్కి తిరిగి పరుగెత్తేశారు.

"శారదా! నేను వెళ్ళిరానా." అక్కయ్యకి యీ వార్తచెప్పేసి రేపు నీకోసం పూలపల్లకి లాటి కారు పంపిస్తాను" అన్నాడు.

—"నాకింకా నమ్మబుద్ధికావడం లేదు."

"నా పట్ల ఎలాటి అనుమానాలూ లేవుగా ?"

"ఊహూ !"

"ఈ వార్త వింటే పిల్లలు ఎంత సంతోషపడతారో తెలుసా ?"

"దగ్గరుండి వాళ్ళ సంతోషం పంచుకోవాలనిపిస్తుంది! నన్ను మీ దగ్గరకు చేర్చింది వాళ్ళేగా!"

ప్రసాద్ అవునన్నట్టు తలవూపాడు.

'ఇకనేనువెళతాను. వీలయినంత తొందరగా నిన్ను తీసుకుపోవటానికి వస్తాను '

ఇద్దరూ బైటికి వచ్చారు.

బైటికి రాగానే యిద్దరూ చకితులైనట్టు నిలబడ్డారు !

ఎదురుగా ప్రార్థనామందిరం బైట, అమ్మాయిలందరూ దడికట్టినట్టుగా నిలబడివున్నారు. వాళ్ళు ప్రసాద్‌నే చూస్తున్నారు.

'శారద భర్త. శారదని పెళ్ళి చేసుకుంటున్నాడు.' గుసగుసలుగా విన్పిస్తున్నాయి.

ఒక అమ్మాయి జంటగా కలిసిపట్టుకున్న బంతిపూలు రెండు తెచ్చి అతి వినయంగా అందించింది.

ప్రసాద్ దాన్ని అందుకుంటూ 'థ్యాంక్ యూ !' అన్నాడు.

అతను మెట్లుదిగి వస్తుంటే అందరూ పాయగా చీలి తొలిగి నిలబడి, దారి యిచ్చారు.

ప్రసాద్ కారుదగ్గరికి వెళ్ళాడు. యింతమంది అమ్మాయిల ఎదుట అతనికి శారదని చూడాలన్నా భయంవేసింది. మొహమాటంగా అనిపించింది. ప్రసాద్ ఎక్కిన కారు వెళ్ళిపోయింది. అందరూ శారదవైపు తిరిగారు. నలుగురు అమ్మాయిలు శారదని పైకెత్తేశారు. 'కొత్త పెళ్ళికూతురుని చూడండహో !' అంటూ అరిచింది ఒక అమ్మాయి.

ఒక అమ్మాయి బాజాలు వాయిస్తున్నట్టు డాన్స్ చేసింది! ఇంకో అమ్మాయి మంత్రాలు చదివినట్టు మాట్లాడింది !

"ఏమిటీ పిచ్చి ! వదలండి బాబూ !" శారద బలవంతంగా వాళ్ళ చేతుల్లోంచి దిగింది.

అందరూ శారదచుట్టూ మూగారు.

'శారదా ! పెళ్ళి ఎప్పుడే ?' ఒక అమ్మాయి ఆదుర్దాగా అడిగింది.

'దేవుకు లగ్నం పెట్టినప్పుడు సరేనా, నువ్వుమాట్లాడకు. 'శారదా ! మాకుమాట మాత్రంకూడా చెప్పలేదేం ?' యింకో అమ్మాయి నిష్ఠూరంగా అంది.

'బాగా డబ్బున్నవాడిలా వున్నాడు. బాగున్నాడుకూడా. శారద ఎంత అదృష్టవంతురాలో ?' అంది ఒకమ్మాయి.

"నిజంగా చాలా అదృష్టవంతురాలు. లేకపోతే మనం మాత్రం ఎంతమందికి వెళ్ళి సాయంచేయటంలేదూ. ఒక్కరైనా అలాటివాళ్ళు దొరికారా ? మొన్న నేను పనిచేయటానికి వెళ్ళానే ఆ సేఠ్ లేడూ. ఒట్టి పీనసి కిష్టయ్య. నన్ను ఆహర్నిశలూ దొంగలా చూసేవాడు. ఆయన భార్య సుసి అనే డిగులుకంటే నేనేం పట్టుకుపోతానో అనే భయంతోనే కూర్చునేవాడు' అంది ఒకమ్మాయి.

'శారదా! పెళ్ళి అయితే మమ్మల్ని మర్చిపోతావా ?' ఒకమ్మాయి దీనంగా అడిగింది.

'ఛా, ఎందుకు మర్చిపోతాను' అంది శారద.

'నీ పెళ్ళి ఎక్కడ జరుగుతుంది ?' ఒకమ్మాయి ఆరాతీసింది.

'ఎక్కడ ఏమిటి ? యిక్కడే. కనక మణిగారు చెప్పలేదూ. ఈ సేవాసద నంలో ఏ ఆడపిల్లకి పెళ్ళి అయినా యిక్కడ జరగాల్సిందే అని.'

'అవునవును' అంది యింకోమ్మాయి.

'శారదా, నీ పెళ్ళికి నేనే కొబ్బరా కుల పందిరి అల్లుతాను'.

వూరిలో కలవారి యిళ్ళలో పెళ్ళి అయితే కనకమణి సేవాసదనంకే కొబ్బ రాకుల పందిరికి ఆర్డర్ వస్తుంది. ఆడ పిల్లలు ఎంతో అందంగా అల్లుతారు. ఈ రూపంగా సేవాసదనానికి ఒక ఆదాయం కూడా. శారద పెళ్ళికి పందిరి అల్లడం అనేసరికి అందరికీ వుత్సాహం వచ్చింది.

'నీకు వాళ్ళ చీరెలు, నగలు పెడ తారా ?' ఆశగా అడిగింది ఒకమ్మాయి.'

'ఎందుకు పెట్టరు. వాళ్ళ బాగా ఉన్న వాళ్ళు' యింకోమ్మాయి స మా ధా న ం చెప్పింది.

ఆ రాత్రి ఆ పిల్లలందరి మనసుల్లో శారదపెళ్ళే మెదులుతోంది. వాళ్ళందరికీ ఈ పెళ్ళి అనేది ఒక మహా అదృష్టం. ఆడపిల్లకి సహజంగా జరిగే యీ సంఘ టనకి దూరమైన అభాగ్యులు వాళ్ళు. వాళ్ళ జీవితాలకి సరిహద్దులు, అనుభ వాలు చాలా వేరు! అందరి ఆడపిల్లల్లాటి వారుకాదు. ఈ సంగతి వాళ్ళకు తెలుసు. తమలో ఒక అనాథగా పెరిగిన శారదకి యీ అదృష్టం కలుగుతున్నందుకు అంద రికీ ఆనందంగానే వుంది. కానీ - తమ తమ దురదృష్టం గుర్తుకువస్తే బాధగా కూడా వుంది.

శారదకి నిద్ర రావటంలేదు. నిద్ర పోతే ఈ తీయటి స్వప్నం చెదిరిపోతుం దేమోనని భయం. మాటిమాటికీ చేతి వేలినవున్న వుంగరమే చూసుకుంటోంది. ప్రసాద్ చెంప తాకీతాకనట్టున్న ఆ స్పర్శ ఎంత వద్దనుకున్నా పోవడం లేదు. శారద అసలు ఎప్పుడూ సంతో షంగానే వుంటుంది. ఈ రోజున యీ సంతోషం పట్టరానట్లుగా, భరించలే నట్లుగా వుక్కిరిబిక్కిరి అవుతున్నట్లుగా వుంది.

ప్రసాద్‌ని చూస్తే ఎంతమామూలుగా వుంటాడు. కానీ తన అభిప్రాయంఎంత నిర్మొహమాటంగా చెప్పగలడు తాను. ఆ యింట్లో తను అన్ని రోజులుంది. అతను ఏ ఒక్కనాడుకూడా హద్దుమీరి ప్రవర్తించలేదు. అ త ను చూపిన నిగ్రహం, ఆ గౌరవం శారదకి ఎంతో అభిమానంగా అన్పిస్తోంది. ప్రసాద్ ఏం చేశాడు. ఆ పిల్లలతోపాటు వాళ్ళని అభిమానించే వ్యక్తిగా, తనని కూడా దగ్గరకు తీసుకుంటున్నాడు. శారదకి ఈ ఆలోచన ఎంతో హాయిగా అనిపించ సాగింది.

* * *

"మామూలు అమ్మాయిలకు వుండే గుర్తింపు, గౌరవం మీకు వుండవు. నేను వద్దంటే వినకుండా పెళ్ళిచేసుకున్న పద్మ గతి ఏమయింది? ఈ సేవా సదనంలోనే కాదు, అనాధగా పెరిగిన ప్రతి ఆడపిల్లకి పద్మ జీవితం ఒక గుణపాఠం కావాలి. పద్మ నేను చెప్పినట్లు విని ఆ పెళ్ళి చేసుకోకుండా వుంటే హాయిగా మీతోపాటే వుండేది కాదా? పాతికేళ్ల నిండకుండానే బ్రతుకు ముగించేసుకున్న నిర్భాగ్యురాలయింది.

"శారదా నువ్వు పెళ్ళిచేసుకోవటం నాకు యిష్టంలేదని కలలోకూడా అనుకోకు. ఈ సేవాసదనానికి నువ్వు కాకపోతే యింకొకరిని తయారుచేస్తాను. నేను భయపడేది నీ భవిష్యత్ గురించి. ఒక్కటే గుర్తుపెట్టుకో. పసిపాపగా వున్నప్పుడు బిడ్డ నిప్పుదగ్గరకు అమాయకంగా వెళుతుంటే తల్లి వద్దు కాలుతుందని వెనక్కు లాగుతుంది. అది నిప్పుని కాలుతుందని తెలియని పసిపిల్ల ఏడుస్తుంది. ఇప్పుడు నేను నిన్ను చేస్తున్న పని అదే. నీకు ఆ పెళ్ళనేది ఎలాటి అగ్నిగుండమో తెలియక, వద్దంటున్నానని బాధపడతావు. కొద్ది రోజులు పోతే నీకే అర్థమవుతుంది. ఎందుకు చెబుతున్నానో విను. ఆలోచించుకో."

ఇంతలో ఆవిడకోసంఎవరోవచ్చారు. శారద అక్కడనుంచి యివతలకు వచ్చేసింది. శారద మనసు చిత్రమైన అవస్థలో చిక్కుకున్నట్టుగావుంది. కనకమణిగారు యీ వార్తవిని సంతోషిస్తుందని, తనని ఆశీర్వదిస్తుందని ఎదురుచూచిన శారదకి ఆవిడ మాటలుచివాట్లూ అశనిపాతంలా అయినాయి. ఒక పెద్ద సంఘర్షణ అనే కెరటంలో చిక్కుకున్నట్టుగా ఉక్కిరిబిక్కిరి అవుతోంది. కనకమణిగారి మాటలు శారదలో పెనుగులాటను ప్రారంభించేసినాయి. అవును, తను పద్మను ఎలా మరిచిపోయింది. తనకి శారదకీ మధ్య ఈ ప్రసాద్ ఎక్కడనుంచి వూడిపడ్డాడు? ఆవిడ కోపం తమాయించుకుంది. శారద చిన్నపిల్లే. అందులోనూ వయసులోవుంది. ఎవరో నాలుగు మాటలు చెబితే మభ్యపడడం సహజమే. ఈమత్తు తనే వదలకొట్టాలి.

ఆవిడ శారదవైపు ప్రసన్నంగా చూసింది. "శారదా, నా ఆలోచనన్ని యిలా తలక్రిందులు చేస్తావని కలలో కూడా అనుకోలేదు. నువ్వు పెళ్ళిచేసుకుంటాననటంలో విడ్డూరం ఏమీ లేదు. పుట్టిన ప్రతి ఆడపిల్లా పెళ్ళిచేసుకోవాలనే అనుకుంటుంది. కానీ నువ్వు వేరు. అందరి ఆడపిల్లలాటిదానివి కాదు నీ మీద ఎంతో బాధ్యత వుంది. ఈ సేవా సదనం నా తర్వాత నిర్వర్తించగలిగిన వ్యక్తివి నువ్వే అనుకుంటున్నాను. నువ్వు త్వరపడకుండానిదానంగా ఆలోచించుకో ఆతనెలాటివాడు. ఒకసారి పెళ్ళి చేసుకున్నాడు. భార్యని చంపాడనే వదంతి

వుంది. పిచ్చాసుపత్రికి పెళ్ళివచ్చారు. పిల్లలున్నారు. ఇలాటి వ్యక్తినా నువ్వు కోరుకునేది. అతన్ని చేసుకొని నువ్వేం సుఖపడతావు నేను ఒప్పుకుంటానని ఎలా అనుకున్నావు? నీ పెళ్ళి విషయంలో నాకేం సంబంధంలేదా? పోనీ ఆ మాట చెప్పు'.

శారద చప్పున లేదన్నట్టు తల తిప్పింది.

"నీకు పెళ్ళిచేసుకోవాలని వుంటే నేను కాదనను. నీకు తగిన వ్యక్తిని నేనే చూస్తాను. నిన్ను పెళ్ళిచేసుకొనే వ్యక్తికి నీతోపాటు సమంగా యీ సేవా సదనంమీద శ్రద్ధాసక్తులు వుండాలి. నువ్వు యింకోటికూడా ఆలోచించు. నీకసలు యిలాటి మైమరుపు ఎలా వచ్చిందో నా కర్థంగావటంలేదు. మీరు అనాథలుగా పుట్టి యిక్కడ పెరిగారు."

కుర్చీలో కూర్చునివున్న కనకమణి తనటేబిల్‌కి ఎదురుగా నిలబడిన శారదని నఖశిఖపర్యంతం చూస్తూ తీవ్రంగా అంటోంది. "పెళ్ళి అంటే నీ యిష్ట మేనా? మాకు చెప్పనవసరంలేదా? మా అంగీకారం తీసుకోనక్కర్లేదా! శారదా! నువ్వు యీపని చేశావంటే నేను నమ్మలేకపోతున్నాను. నిన్ను మొదటినుంచీ నేనెలా పెంచాను. ఇక్కడ అందరి ఆడపిల్లలకంటే ఎంత ప్రత్యేకంగా చూస్తున్నాను. నా తర్వాత ఈ సేవాసదనం బాధ్యత అంతా అప్ప గించాలని అనుకుంటున్నానే. పెళ్ళిచేసుకుంటావా? నీ కసలు ఈ మైకం ఎలా వచ్చింది? అతనేం మాయమాటలు చెప్పాడు?". ఆవిడ తీక్షణంగా అడుగుతుంటే శారద జవాబు చెప్పలేనట్టుగా తల దించుకుంది.

ఈరోజు కనకమణి ఊరునుంచి వచ్చింది. ఆవిడ రాగానే పిల్లలు పట్టలేని ఆనందంతో ఈ శుభవార్త వినిపించేశారు. ఆ ప్రసాద్ ఎవరో ఆవిడకు వెంటనే గుర్తురాలేదు. తర్వాత అనసూయమ్మగారి తమ్ముడనితెలిసింది. అతను రావటం, ఉంగరం యివ్వటం, మేం పెళ్ళి చేసుకోబోతున్నామని పిల్లలందరికీ చెప్పటం యిదంతా యీ ఆవరణలోనే జరిగిందనేసరికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. శారదని పిలిచి వెంటనే అడిగింది. శారద మాట్లాడలేదు. శారద చేతినున్న వుంగరం జరిగినదంతా యదార్థమేనని ఋజువుచేస్తోంది. శారదని చూస్తుంటే మింగేయాలన్నంత కోపంవచ్చింది. శారద ఆవిడ ఆలోచన్నని, ఆశలని ఒక్కసారి తలక్రిందులు చేసేసింది. శారద అంటే ఆవిడకు మొదటినుంచి అభిమానమే. ఎంతఇష్టం లేకపోతే సేవాసదనం తాళంచెవులు అప్పచెపుతుంది. తను వున్నపుడేకాదు తను లేనప్పుడుకూడా మిగతా పిల్లలందరూ శారదకి భయపడతారు. శారదకి అదంతా గుర్తురాసాగింది.

పద్మ యిక్కడే తమతోపాటు పెరిగింది.

సేవాసదనంలో పిల్లలందరికీ వైరుతో బుట్టలు అల్లటం, కుర్చీలు అల్లటం నేర్పేటందుకు కనకమణి శంకర్ అనే కుర్రాడిని టీచర్‌గా కుదిర్చింది. కనకమణి పిల్లల్ని ఒక్క క్షణం వూరికే కూర్చోనీయదు. ఏదో ఒక పని చేయిస్తూ, ఆ రూపంగా డబ్బు రాబడుతూ వుంటుంది. శంకర్ దగ్గర అందరూ బుట్టలు అల్లటం నేర్చుకున్నారు. కానీ పద్మకీ అతనికీ ఎప్పుడెలా పెరిగిందో బాగా చనువు పెరిగింది. అతను పద్మని పెళ్ళి చేసుకుంటానని కనకమణిని అడిగాడు. కనకమణి ఒప్పుకుంది.

శారదకు ఆ పెళ్ళి యింకా యిప్పుడు జరిగినట్టే వుంటుంది. పద్మ పెళ్ళి అది కూడా ఈ సేవాసదనం ఆవరణలోనే అని వినగానే అందరూ ఎంతో సంబరపడ్డారు. పెళ్ళిపందిరి పద్మతోటిపిల్లలే అలంకరించారు. కనకమణి ప్రెస్ రిపోర్టర్స్‌ని, వూరిలో పెద్దలనికూడా పెళ్ళికి పిలిచింది. శంకర్‌కుకూడా ఎవ్వరూలేరు. అందువల్ల యిరుప్రక్కల పెళ్ళివారూ సేవాసదనం ఆడపిల్లలే అయారు.

మామూలు సరదాలకి, సంతోషాలకి దూరంగా వెలివేసినట్లుగా బ్రతికే ఆ పిల్లలకి యీపెళ్ళి పెద్ద ఆనందదాయకమైన సంఘటన అయింది. బ్రాహ్మణుడు వచ్చి మంత్రాలు చదువుతుంటే పెళ్ళి మండపంలో పద్మ పెళ్ళికూతురిలా కూర్చున్న దృశ్యాన్ని అందరూ అరమోడ్పు కన్నులతో తిలకిస్తున్నారు. ఆ క్షణంలో పద్మ ఎంత అదృష్టవంతురాలు అనిపించింది.

పెళ్ళి అవగానే శంకర్ పద్మనితీసుకు వెళ్ళాడు.

శంకర్‌కి భిలాయ్‌లో ఉద్యోగం వచ్చింది. పద్మ, శంకర్ యిద్దరూ వచ్చి చెప్పి వెళ్ళారు.

ఆరు నెలలు గడిచినాయి. ఒకరోజు హఠాత్తుగా పద్మ వచ్చింది. మనిషి శవాకారంలావుంది. కళ్ళు పీక్కుపోయి వున్నాయి. నవనవలాడే ఆ ఆరోగ్యం అంతా ఎక్కడపోయిందో! రోగిష్టిగా వున్న పద్మని చూసి అందరూ తెల్లబోయారు.

పద్మ కనకమణిని చూడగానే 'అమ్మా' అంటూ కౌగలించుకుని బావురుమని ఏడ్చేసింది.

ఆ తర్వాత పద్మ చెప్పినవిషయాలు వింటే అందరి శరీరాలూ జలదరించినాయి. జన్మలో పెళ్ళనేది వద్దురాబాబూ అనిపించింది. పద్మని శంకర్ భిలాయ్ తీసుకువెళ్ళాడు. అక్కడతనికిఉద్యోగం అన్నమాట ఒట్టి అబద్ధం. పద్మతో రెండునెలలు బాగానేవున్నాడు. ఆ తరువాత యింటికి అతని స్నేహితుల్ని తీసుకురాసాగాడు. వాళ్ళు ఒట్టి తాగుబోతులు. పద్మని వాళ్ళకు అప్పజెప్పి

వాడు పద్మ ఎదురుతిరిగితే కొట్టే వాడు. ఒకసారి పద్మ పారిపోవటానికి ప్రయత్నిస్తే పట్టుకున్నాడు. నానాచిత్ర హింసలూ పెట్టాడుట. పద్మ ఆరోగ్యం దెబ్బతింది. శంకర్ యింకో ఆమెని దగ్గరకు తీసాడు. పద్మని వెళ్ళిపొమ్మని తన్నితగిలేశాడు. ఛార్జీలకు డబ్బులు కూడా యివ్వలేదు. పద్మ వారినీ,వీరినీ అడుక్కుని రైలు టికెట్‌కి డబ్బులు సంపాయించి ఎలాగో యిక్కడికి చేరుకుంది.

ఇదంతా వినగానే కనకమణికోపంగా 'దొంగవెధవ, ఎంత పనిచేశాడు, వాడి అంతు తేలుస్తాను వుండు' అంది

ఆవిడ శంకర్ అడ్రసుకి వుత్తరం వ్రాసింది. కానీ ఆ వుత్తరం అతను అక్కడ లేనట్లుగా తిరిగివచ్చింది.

పద్మ దీనగాథవిన్న శారద 'అమ్మగారూ, ఎలాగైనాసరే, ఎంతకష్టమైనా సరే, ఆ శంకర్‌ని పట్టుకుని, తన్నిజైల్లో పెట్టించాలండీ' అంది. మిగతా పిల్లలు కూడా శారదని సమర్థించారు.

కనకమణి సరే సరే అందేగానీ, ఆ మాట పట్టించుకోనేలేదు. కారణం,ఆవిడ పద్మకి, శంకర్‌కి పెళ్ళిచేసినప్పుడు తన సేవాసదనం ఒక గొప్ప ఘనకార్యం చేసినట్లుగా పత్రికలచేత పొగిడించుకొంది. పెద్దలచేత శభాష్ అనిపించుకుంది. ఇప్పుడు ఆ పెళ్ళి యిలా తెల్లవారింది అంటే సేవాసదనం పరువేం కాను' అనుకుంది.

పద్మ విషయంతో అక్కడున్న ఆడపిల్లలకి పెళ్ళిమీద మోజుపోయింది. మనం పెళ్ళికి అనర్హులం అనే భావన కలిగింది. పద్మ ఒంటినిండా రోగాలు. కనకమణి మందులిప్పించినా అవి అంత సులభంగా తగ్గలేదు. పద్మ ఒంటరిగా కూర్చునేది. ఎప్పుడూ ఏడ్చేది.

చివరకి – చివరికి – ఒకరోజునశారద మామూలుగానే ఆరోజుకూడా ఉదయమే లేచింది. ప్రార్థనామందిరం తెరవటానికి వెళ్ళబోతున్నదల్లా ఎదురుగా చెట్టుకు ఏదో వేళ్ళాడుతు ంటే ఏ మి టా అని చూసింది. వెంటనే పెద్దగా కేకపెట్టింది.

ప ద్మ కంఠానికి ఉరిపోసుకుంది. శారద అరుపులకి పి ల్ల లు పరుగెత్తుకు వచ్చారు. కనకమణి వచ్చింది.

ఆరోజునుంచీ వారం,పదిరోజులపాటు పిల్లలందరూ పద్మ దెయ్యం అయి ఆవరణలో తిరుగుతున్నటుగా భ య ప డి పోయారు. చీకటిపడితే ఒక్కరూ బైటకి వచ్చేవారుకాదు.

ఇది జరిగి చాలారోజులు అయింది. శారదకళ్ళముందు పద్మ నిలబడిదీనంగా చెబుతున్నట్లుగా వుంది. "శారదా! మనం అ ం ద రి ఆడపిల్లలాంటి వాళ్ళంకాదు, మనకి దిక్కులేదు. మనం దిక్కులేని వాళ్ళం అనే అలుసుతో అందరూ మన మీద దౌర్జన్యం చేయటానికి చూస్తారు. నీకు తెలియదు. మీరెవ్వరూ ఈనాలుగు గోడలు దాటివెళ్ళలేదు కాబట్టి మీకు ఆ

బైట ప్రపంచం గురించి తెలియదు. అక్కడ మనలాటి అండలేని వాళ్ళకు స్థానంలేదు. మనకి యిక్కడే క్షేమం. కనకమణిగారు మనల్ని ఎంత తిట్టినా, మనవల్ల ఆవిడకు ఒక ఉపయోగంవుంది. ఈ గోడలు మనపాలిట జైలుగోడలు అనుకుంటాం గానీ, యివే మనకి చాలా రక్షణ అనుకో."

కానీ - కానీ - ప్రసాద్ అందరిలాటి వాడు కాదు. అతను జీవితంలో చాలా ఎగుడుదిగుళ్ళు చూసినవాడు. నా పరిస్థితి అంతా అతనికి తెలుసు, శారద మనసు ఎదురుతిరిగింది.

'నీకు తెలియదు వూరుకో. పెళ్ళనే వ్యామోహంలోపడిన నీకు ప్రస్తుతంఏమీ తెలియటంలేదు" ఏదో తెలియని భయం మనసుని కసిరింది.

శారదమనసు బేంగా అయిపోయింది. ప్రసాద్ ని స్వీకరించాలో, తిరస్కరించాలో అర్థంగాకుండా పోయింది. అతన్ని స్వీకరించడానికి మనసు గుడ్డిగా ముందు అడుగువేస్తోంది. కానీ పద్మ జ్ఞాపకం కనకమణి హెచ్చరికలూ అతని గత జీవితం అన్నీ కలిసి శారదని వెనక్కు లాగుతున్నాయి.

మనం ఏదయినా పనిచేస్తే అందులో సుఖం, నిశ్చింత వుండాలి. అవమానం హేళన ఎదురవకూడదు. అసలేఆధారం లేని జీవితం మనది. అందరాని పండు కోసం ఆశించి, బోర్లాపడిన చందం కాకూడదు.

పద్మ ఎందుకు చచ్చిపోయిందో యిప్పుడు తనకి బాగా అర్థం అవుతోంది! అపజయం ఎదుర్కోలేకపోయింది. ఒక విధంగా యిక్కడ ఈ జీవితంమీద రోత కలిగే ఆ పెళ్ళికి ఒప్పుకుని వెళ్ళింది. కానీ, పెనంమీదనుంచి నిప్పుల్లోపడ్డ చందం అయింది. అందుకే వెనక్కు తిరిగి వచ్చినా యిక్కడ యిమడలేక పోయింది.

ఒకసారి ఈ సేవాసదనం వదలి వెళ్ళిపోతే మళ్ళీ తిరిగి రాకూడదు. కనకమణిగారికి చిన్నప్పటినుంచీ ఎందుకో గానీ తనమీద ఎనలేని అభిమానం. ఆ అభిమానమే కోటగోడలా తనని రక్షిస్తూ వచ్చింది. ఆవిడ తర్వాత యీ సేవా సదనం అధికార నిర్వహణ శారదదేనని అందరికీ తెలుసు. ఆడపిల్ల జీవితానికి ఎంతో ముఖ్యమైన యీ పెళ్ళి ముఖ్యమా? లేక యీ సేవాసదనమా? శారద ఏటూ నిర్ణయించుకోలేకపోతోంది. శారదకి రెండూ కావాలనిపిస్తోంది కానీ అది అసాధ్యం అనికూడా వెంటనే అర్థమౌతోంది.

ఆ రాత్రి కనకమణి శారదను పిలిచింది.

"ఏమని ఆలోచించుకున్నావు?" అంది.

"నాకు తెలియటంలేదమ్మా. మీరు చెప్పండి" నిస్సహాయంగా అంది.

"శారదా, నువ్వు నామాటమీద గురి వుంచి నేను చెప్పినట్టు విను. పెళ్ళి అనేది

ప్రతి ఆడపిల్లా చేసుకుంటుంది. కానీ, యిలా పట్నుంచికి సేవచేసే అదృష్టం అందరికీ రాదు. నీకు పెళ్ళి చేసుకోవాలని వుంటే నేనే తగిన వరుణ్ణి చూస్తాను ఆ ప్రసాద్‌మాత్రం వద్దు. అతనికి తన కూతురునిచ్చి చేయాలని ఆ అనసూయమ్మగారు అనుకుంటోంది ఆ కల తర్లో నువ్వెందుకు తలదూర్చాలి."

శారద మౌనంగా నిలబడిపోయింది.

"ఆ వుంగరం యిలా యివ్వు. నువ్వు యిష్టపడడం లేదని అనసూయమ్మగారికి కబురుచేస్తాను"

శారద వేలివుంగరం తీసింది. టేబిల్ మీద ఆవిడకు ఎదురుగా పెట్టింది గిరుక్కున వెనక్కు తిరిగి ఎవరో తరుముకొస్తున్నంతవేగంగా అక్కడనుంచి పారిపోయింది.

* * *

"ఇదుగో, నువ్వు చేసిన ప్రధానపు కానుక కాబోలు! తిప్పి పంపింది. శారద ఈ పెళ్ళికి యిష్టంగా లేదుట." అనసూయమ్మగారు వుంగరం తెచ్చి ప్రసాద్ మంచంమీద పడేస్తూ అంది. అతను బైట పనిమీద వెళ్ళటానికి సిద్ధమవుతూ, షర్ట్ గుండీలు పెట్టుకుంటున్నాడు.

"అయినా, పెళ్ళిచేసుకోవాలంటే నీ పెత్తనమేనా! మా కెవ్వరికీ చెప్పనవసరంలేదా? అసలు ఆ శారద యీ యింటికి ఎలా వచ్చింది? నేను తీసుకువస్తేనేగా?"

ప్రసాద్ అక్క మాటలమీద ధ్యాస లేనివాడిలా ఆ వుంగరంవైపే చూస్తున్నాడు.

"నాలుగేళ్ళు గడిచాయికదాని నీగతం నువ్వు మర్చిపోయినంత మాత్రాన లోకం మర్చిపోతుందని అనుకోకు. నువ్వు జైలుకి వెళ్ళావనీ, పిచ్చాసుపత్రిలో వున్నావని తెలిసిన ఏ ఆడపిల్ల నిన్ను పెళ్ళిచేసుకుంటుందిరా? కవితను చేసుకోమంటే అది కేవలం నా స్వార్థం అనుకుంటున్నావేమోగానీ, నీ మంచి ఆలోచిస్తున్నానని నువ్వు బొత్తిగా అనుకోవటంలేదు."

ప్రసాద్ కోపాన్ని నిగ్రహించుకుంటూ అడిగాడు. "అక్కయ్యా, యీ వుంగరం ఎవరు తెచ్చారు?" నిదానంగా అడిగాడు.

"యింకెవరు తెస్తారు,కనకమణిగారు. శారదని నాలుగు రోజులు సాయంకోసం పంపిస్తే మీ తమ్ముడిలా చేయటం బాగుందా అంటూ నన్ను నాలుగూ దులిపింది నువ్వసలు ఆ సేవాసదనంకి వెళ్ళినట్టే తెలియదు. నేను ఆవిడముందు తలెత్తుకోలేకపోయాను. నువ్వు ఆవిడకి కానీ, నాకుగానీ కనీసం చెప్పనైనాచెప్పకుండా శారదతో యీ పెళ్లి ప్రస్తావన తీసుకురావటం చాలాతప్పు."

అతను మౌనంగా ఆ వుంగరంఅందుకుని వేలికి పెట్టేసుకున్నాడు. అనసూయమ్మగారు హఠాత్తుగాకంఠంమార్చింది.

"నాకు తెలుసురా ప్రసాదూ నీ బాధ. నీకు చిన్న వయసుకే పెద్ద బాధలు చుట్టుకున్నాయి. పెళ్లిపేరుకు అయిందన్నమాటేగానీ ఆ సుఖం ఏమిటో నువ్వు బొత్తిగా అనుభవించలేదు. నువ్వు ఇంత అనుభవం జరిగిన తర్వాత మళ్ళీ చేసిన తప్పే చేస్తానంటే ఎలా. నామాట విని నువ్వు కవితను చేసుకో."

"కానీ, కవిత నన్ను చేసుకోనని అంత ఖచ్చితంగా చెబుతోందిగా అక్కయ్యా".

"దానిముఖం. దానికేం తెలుసు. నేను ఒప్పిస్తానుగా."

"అక్కయ్యా ఎవరితోనూ బలవంతపు పెళ్ళి నాకు అవసరంలేదు. నేనే పొరబడ్డానేమో. నువ్వన్నమాటే నిజం. జైలుకి వెళ్లివచ్చినవాడిని, మెంటల్ హాస్పిటల్లో వుండివచ్చినవాడిని నన్ను ఏ ఆడపిల్ల చేసుకుంటుంది. యికముందెప్పుడూ యీపెళ్ళి ప్రసక్తి నా దగ్గర తీసుకురాకు. నేను పొరబడ్డానక్కయ్యా చాలా పొరబడ్డాను ఇది ఏ వ్యక్తితోను నాకు పెళ్ళి కాకముందే తెలిసింది. ఇంకా నయం." అతను నిస్పృహగా మంచం మీద కూలబడ్డాడు.

శారద ఉంగరం వాపసు యివ్వటం అతను వూహించలేని విషయం అయింది. శారదముందు తనేదీ దాచలేదే. లజ్జవిడిచి అభిమాన పడకుండా అన్నీ చెప్పేశాడే. ఆలోచించుకోవటానికి టైమ్ కూడా ఇచ్చాడే అప్పుడు అంగీకరించిన శారదకి ఇంతలో ఏమయింది. ఆడవాళ్ళు ఇంత చపలచిత్తులా.

ఈ వుంగరం శారదే స్వయంగా ఇచ్చినట్టయితే ఎంతో బాగుండేది. తను ఏమీ అనుకొనేవాడుకాదు. ఈ నాలుగురోజుల నుంచీ తను ఎంతో హాయిగా వున్నాడు. ఎంత ఆనందంగా గడిపాడు.

తనకి రెండో పెళ్ళిచేసుకొనేయోగ్యత లేదా. ఏం తప్పు చేసానని తనకి శిక్ష! శారద సమక్షంలో తన జీవితం నిశ్చింతగా వెళుతుందని ఆశపడ్డాడు. శారీరకంగాకంటే, శారదని మానసికంగా తనకి ఒక [illegible] కోరుకున్నాడు. శారదకి యిది అర్థం కాలేదా? యిలా ఎందుకు చేసింది?

తన జీవితనౌక ఒక తీరం చేరుతుందని, యిక నిశ్చింతగా వుండవచ్చని భావించాడు. దూరంనుంచి ఎంతో అందంగా కన్పించిన ఆ తీరం, తను దగ్గరయేసరికి మాయమై ఎండమావిలా వెక్కిరించింది.

తన జీవితం అడుగడుక్కీ ఎందుకిలా శాపగ్రస్థంగా అవుతోంది.

అతను లేచి చెప్పులు వేసుకున్నాడు. అతనికి శారదను చూడాలనిపించింది. కసిదీరా నాలుగూ అనాలని ఆవేశంగా అనిపించింది.

(సశేషం)

# మొగలిరేకు

## యామిని

(గత సంచిక తరువాయి)

"నాకు వాయించాలని లేదు," అంది రాధ.

"పావుగంటేనా కా లే దు ... మీ అమ్మగారు చూస్తే..."

"మా అమ్మ ఇంట్లో లేదు."

"అయ్యో బాబోయ్! అయితే నేను వెళ్ళొస్తాను."

"మీరు పాఠం చెప్పకుండా వెళ్ళి పోయేరని అమ్మతో చెప్తాను."

"వద్దు తల్లీ నీకు పుణ్యం ఉంటుంది."

"పనసతొనలాంటి పిల్లను పట్టుకొని తల్లీ అంటారేమిటి! మీవన్నీ పసివాళ్ళ బుద్ధులు!"

"నేను నీతో మాట్లాడలేను."

"మేస్టారూ!"

"ఊఁ!"

"మీకు ప్రపంచంలో అన్నింటికంటె అందమైనదేమిటి?"

"ఏమో తెలీదు."

"ఆలోచించండి!"

"నా చేతకాదు."

"నా కందమైనదేమిటో చెప్ప మంటారా?"

"అక్కర్లేదు..."

రాధ మూతి ముడిచింది

"చెప్పు తల్లీ! చెప్పు!" అన్నాడు కృష్ణమూర్తి.

"చెప్పేయ్యమంటారా!"

"మీరు నమ్ముతారు కదూ!"

"ఆ."

"చెప్పేక నమ్మనని నన్ను చిన్న బుచ్చుతారేమో!"

"ఏమీ చిన్నబుచ్చను."

"అయితే చెప్పేస్తున్నా..."

"చెప్పు"

"మా చిన్నారి పిలకమేష్టారూ! ఎంత ముద్దుగా ఉంటుందని నా కెప్పుడూ

దాన్ని దువ్వి దిద్దాలని ఉంటుంది... మేష్టారూ మేష్టారూ..."

"ఏమిటి?"

"ఒక్కసారి మీ పిలక దువ్వ నియ్యరూ!" అని కృష్ణమూర్తి పిలక పట్టుకోబోతుంటే "ఏమిటే అది?" అంటూ మాణిక్యం వచ్చింది.

''చూడండి మీ అమ్మాయి నన్ను పిలకపట్టుకొని ఆడిస్తూంది." అన్నాడు కృష్ణమూర్తి

''నా కీ ఫిడేలు తలనొప్పిగా ఉందమ్మా! రేపట్నుంచి మాస్టార్ని రావద్దని చెప్పమ్మా!" మారాంతో సాగ తీస్తూ అంది రాధ కృష్ణమూర్తికి సైగ నిసి.

''ఏమిటే ఆ కొంటె పనులు! పెద్దవాళ్ళని అలా వేళాకోళం చెయ్యచ్చా! నాకు కోపం రప్పించక బుద్ధిగా నేర్చుకో! దాని మాటలు లెక్కచెయ్యకండి మేస్టారూ! మీ పని మీరు కానివ్వండి" అని వెళ్ళిపోయింది మాణిక్యం.

కృష్ణమూర్తిని గట్టిగా పట్టుకొని అతన్ని ఉక్కిరిబిక్కిరి చేసింది రాధ.

ఆనాటి నుండి రాధ కొంటెతనం వెనుక ఉన్న ఆప్యాయత ఆరాధన గుర్తించిన కృష్ణమూర్తికి ఆమెవద్ద ఒక మనిషిగా ఒక కళాకారుడిగా సానుభూతి లభించింది లౌక్యం తెలియని వాడుగా పేదవాడుగా సంఘం అతన్ని చూసిన

చిన్నచూపుకు మారుగా అతనొక గొప్ప వ్యక్తిగా ఆమెచూపిన గౌరవం ఒక సంగీతవేత్తగా అతనిని భావపార వశ్యంతో కొలవడం ఆమెపట్ల ఎంతో స్నేహభావాన్ని రేకెత్తించాయి. పైగా వేశ్యగా స్త్రీపురుష సంబంధాలలో ఒక నియమానికి అలవాటుపడని ఆమె స్వేచ్ఛా ప్రవృత్తి అతన్ని ఆమెకు మరింత తొందరగా చేరువచేసింది.

రాధకు మాత్రం తాను అందరిలోకీ మిన్నయైన ఆటకత్తెగా అందకత్తెగా పేరు పొందడంతోనే అన్నాళ్ళూ గర్వంతో కూడిన సంతృప్తి కలిగినా కృష్ణమూర్తితో పరిచయం అయిన తర్వాత ఆమెకు తెలీకుండానే క్రమక్రమంగా తన వృత్తిమీద నీచభావం కలగడం మొదలుపెట్టింది. తనకోసం అతడు, అతనికోసం తాను అనేభావం బలపడిసాగింది. ఒకరికొకరు వ్యసనంగా మారుతూన్న ఆ పరిస్థితి గమనించే మొదటికి మోసంవస్తుందని సుందరి రాధను వారించింది అందుచేత లోలోపల ఎంతమార్పు వస్తూన్నా బాహ్యంగా ఏమీ మార్పులేనట్లుగానే అతిప్రయత్నం మీద నడుపుకొస్తూంది రాధ.

## 2

రామమోహనరావుగారూ, కేశవరావుగారూ ఒకవూరి వాళ్ళే. అగర్భ శ్రీమంతుడుగా కేశవరావు పుడితే పేదవాడుగా పుట్టి పొరుగూరి శ్రీమంతుల ఇంటికి

మిరమిట్లు గొల్పే తెలుపు
చూడగానే
అందరి నోట ఒకే మాట...



ఇది తప్పక
# డెట్
డిటర్జెంట్
బిళ్ల వుతుకే




Shilpi DM 35A/78 Tel

దత్తుడుగా వాళ్ళ ఆస్తికి వారసుడుగా వెళ్ళేడు రామమోహనరావు. ఇరువురి పొలాలనూ కనుచూపుమేరకు కలిపి ఉంచిన సరిహద్దు గట్టులాగే వాళ్ళిద్దరి మధ్యా స్నేహం చలనంలేకుండా అలానే ఉంది. మనస్తత్వాలు వేరయినా పరస్పరం మర్యాద చూపించుకోడానికీ సరితూగడానికీ సరిపోయే సంపద ఉండడంచేత వ్యత్యాసాలు ఎప్పుడూ కొలవబడలేదు.

నిజానికి కేశవరావు స్వభావం కొంత అభిజాత్యం, విలాసత్వం కూడుకొని ఉండగా రామమోహనరావు మాత్రం చాలా క్రమశిక్షణ కలిగి సాంప్రదాయాన్ని గౌరవించే మనిషి. రుక్మిణీదేవి పుట్టినప్పటినుంచీ అంతకు ముందే కొడుకును కన్న కేశవరావు ఆమెను 'కోడలా!' అంటూండడం ఆలాగే కేశవరావు కొడుకు హరినారాయణను రామమోహనరావు 'అల్లుడా!' అనడం రెండు కుటుంబాల్లోనూ బాగా అలవాటయిపోయింది.

రామమోహనరావుగారి అత్తగారి కుటుంబం బ్రతికి చెడ్డదయింది. ఆయన అత్తగారు కళ్ళుమూస్తూ పసివాడైన ఒక్కగానొక్క కొడుకు నరసింహాన్ని కూతురు చేతిలో పెట్టిపోయింది. తల్లి లేని పిల్లవాడని కొంచెం మెత్తగా ఉండడం వలననో సహజ స్వభావం వలననో నరసింహానికి ఏమంచివిద్యా అలవడలేదు. అందుచేత ఇంటి పనులే చేస్తూండిపోయాడు. తగిన మంచి స్నేహం దొరకకా, రోజుకు ఇరవై నాలుగుగంటలూ ఏమి చెయ్యాలో తెలియకా అక్క బావల కనుమరుగులో అన్ని వ్యసనాలూ నేర్చుకున్నాడు. ఆ నోటా ఈనోటా వాటిని గురించి తెలిసిన అక్క మందలించింది. బావగారు అసహ్యించుకున్నాడు.

ఎవరో ఎప్పుడో అన్న మాట మనసులో నిలచిపోయి మేనకోడలు రుక్మిణీదేవి పెద్దదవుతూంటే ఆమెను పెళ్ళి చేసుకోవాలని కలలు కనడం మొదలుపెట్టేడు.

చివరకు కేశవరావుగారి అబ్బాయి హరినారాయణతో రుక్మిణికి తాంబూలాలు పుచ్చుకోబోతున్నారని తెలిసి తెగించి ఒక రోజు అక్కముందు మనసులోకోరిక బయటికి వెలిబుచ్చేడు.

లక్ష్మీదేవికి తమ్ముడిమీద ఎంత అభిమానమున్నా రుక్మిణికి తగిన వరుడు కాదనిపించింది. పైగా వయసులోకూడా పది సంవత్సరాలు మించి తేడాఉంది. అన్నిటికీమించి భర్త సుతరామూ ఒప్పుకోడన్నవిషయం స్పష్టంగా తెలుసు,

"రుక్మిణి పుట్టినప్పటినుంచి స్నేహితులిద్దరూ వియ్యంకుళ్ళు కావాలనీ కలలు కంటున్నారు తమ్ముడూ! ఇప్పుడు ఆయన కేశవరావుగారిని కాదనలేరు." అంది తమ్ముణ్ణి చిన్నబుచ్చడంఇష్టంలేక.

ఆనాటి నుండి రుక్మిణి పెళ్ళయిన తర్వాత తన గతి ఏమవుతుందోనని పెద్దభయం పట్టుకుంది నరసింహానికి. ఆ రోజునుండి కావాలని పసగట్టి చేతికి దొరికిందల్లా పక్కకు పెట్టి జాగ్రత్త పడుతున్నాడు.

రుక్మిణికి తాంబూలాలు పుచ్చుకొన్నప్పుడు నరసింహం ఉత్సాహంగా అన్ని పనులూ చేస్తూంటే తమ్ముడి మనసు గాయపడలేదని కొంత కుదుటబడింది లక్ష్మీదేవిమనసు. ఆ జాలితో ఇంటి విషయాల్లో మరింత చనువిచ్చింది. నరసింహం పొచికపారింది.

ఒక్కగానొక్క కూతురైన రుక్మిణి పెళ్ళి ఎంతో వైభవంగా ముచ్చటగా జరిపించాలని నిశ్చయించుకున్నాడు రామమోహనరావు.

నెలరోజుల ముందునుంచే పెళ్ళపనులు ప్రారంభమయ్యేయి. పెళ్ళి అయిదురోజులకూ రోజుకు ఇరవైనాలుగు గంటలూ వినోద కార్యక్రమాలు ఏర్పాటు చేయబడ్డాయి.

ఊరంతాపందిరి వేశారు విడిదిదగ్గర ఒకటి పెళ్ళింటి దగ్గరఒకటి ఉన్న వాళ్ళల్లో పోటీపడి పేరు తెచ్చుకున్న రెండు బ్యాండు మేళాలు కుదిర్చేరు. మేజువాణీలు కుదిర్చేరు. ఎప్పుడు ఎవరు ఏమికావాలన్నా అందుబాటులో ఉండేటట్లు తినుబండారాలూ, టిఫిన్లు, కాఫీలనూ ఏర్పాట్లు చేసేరు.

మగ పెళ్ళివారు ఊళ్ళోకి వచ్చారు. బ్యాండు మేళాలు రెండూకలసి దిక్కులు ప్రతిధ్వనించేటట్లుగా పెళ్ళివారికి స్వాగతం పలికేయి.

పూర్వం రాజుల కాలంలో లాగా నెరజాణలు నాట్యంచేస్తూ ఎదురుసన్నాహం వెళ్ళేరు

కేశవరావుగారు వియ్యంకుడు చేస్తూన్న మర్యాదకి పరమానంద భరితుడైపోయాడు.

తెల్లవారితే పెళ్ళి.

ఉరమూ మెరుపూ లేకుండా నీలాకాశంలో నుంచి పిడుగుపడింది.

రామమోహనరావుకు మద్రాసు నుండి టెలిగ్రాం వచ్చింది. ఏనాడో అతని దాయాదులు అతని దత్తత చెల్లదనీ, అతన్ని పెంచుకున్న వారి ఆస్తి దక్కదనీ వేసిన దావాలో రామమోహనరావుకు ప్రతికూలంగా హైకోర్టు తీర్పుయిచ్చింది. ఆనాటినుండి అతడు ఏ ఖర్చూ ఆ ఆస్తినుండి చేయడానికి వీలుండదనీ జరిగిన ఖర్చుకు లెక్క చెప్పవలసి ఉంటుందనీ కూడా ఉంది.

వచ్చిన మరుక్షణమే వార్త మగ పెళ్ళివారి విడిదిలోకి పాకిపోయింది.

## 3

ఉరుములు మెరుపులతో కుంభవృష్టిగా కురుస్తూన్న వాన అలాగే హఠాత్తుగా నిలిచిపోయినంత నిశ్శబ్దంగా ఉంది. పొంగుతూన్న సముద్రంలోని అణు





# నోటి దుర్వాసనను ఆపండి...
# కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో
# దంతక్షయాన్ని ఎదుర్కోండి

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత, కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి కోల్గేట్, ప్రపంచమంతటా దంత వైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది అవి ముందు నోటి దుర్వాసన, ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు, దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క సమగ్రమైన శుభ్రీకరణ ఎలా పనిచేస్తుందంటే :



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకు చేరి హానికరమైన ఆహారపు అణువులను బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం దంతక్షయంనుండి రక్షణ.

హాయినిగొల్పే, తాజా శ్వాసకోసం, పళ్ళను తెల్లగా రూపొందించేందుకు ప్రపంచంలో ఎక్కువ మంది, మరే ఇతర టూత్‌పేస్ట్ కన్న ఎక్కువగా కోల్గేట్‌నే కొంటూ ఉంటారు!




**ఒక్క దంతవైద్యులు మాత్రమే**
**దీనికన్న మేలైన దంతరక్షణ సమకూర్చగలరు.**

వణువులోనూ చలనం స్తంభించిపోయి నట్టుంది.

గాలికూడా వీచడంమానివేసినట్టుంది.

ఊరందరి మనస్సుల్లోనూ ఒకటే ప్రశ్న! కేశవరావుగారు పెళ్ళి ఆపుచేసి వెనక్కు వెళ్ళిపోతున్నారు! ఎలాగ! ఏం జరుగుతుంది!

పెళ్ళింట్లోంచి చెప్పులుకూడా లేకుండా విడిది ఇంట్లోకి రామమోహనరావు నడచి వెడుతూంటే అందరికన్నులూ ఉరికంబాని కెక్కుతూన్న దోషిని చూసినట్లు ఆయన మీదే! బెదిరిన భావాలతో చేష్టలుదక్కి నిర్జీవంగా తండ్రి వెళ్ళినవైపే చూస్తుంది రుక్మిణి. ఆగని కన్నీళ్ళ ప్రవాహాన్ని తుడుచుకుంటూ దిక్కుతెలియక రోది స్తూంది లక్ష్మీదేవి

పందిరి, పచ్చతోరణాలూ, పలుకని వాయిద్యాలూ అన్నింటికీ అసంధిగ్ధం దుంబ్రరంగానే ఉంది.

రామమోహనరావు కేశవరావు కూర్చున్న గదిలోకి వెళ్ళేడు. అందరికీ విషయం ఒకేవిధంగా అర్థంఅయినట్లుగా వాళ్ళిద్దర్నీ అక్కడ వదలి అందరూ బయటకు వచ్చేసేరు. ఎవరో తలుపు దగ్గరగా మూసేరు.

రామమోహనరావు కేశవరావు కళ్ళ ల్లోకి చూసేడు.

తన నిస్సహాయతని చెప్తూన్నట్టుగా కేశవరావు తల పక్కకుతిప్పుకున్నాడు.

మరో రెండు నిముషాలు దారుణమైన నిశ్శబ్దం. ఆ నిశ్శబ్దమే కొన్ని ప్రశ్నలు వేసుకుని జవాబు చెప్పుకున్నట్లుంది

"నేను సుప్రీంకోర్టుకు అప్పీలు చేయవచ్చు!" అన్నాడు రామమోహన రావు.

"తీర్పులో మార్పుండకపోవచ్చు!" అన్నాడు కేశవరావు.

"నా ఆస్తిమూసే నువ్వు వియ్యమందా లనుకున్నావా?"

"నా కొడుకు ఈరోజు బిచ్చగాడుగా రోడ్డుమీద నిలబడి ఉంటే ఇంత వైభవం తోనూ, సంతోషంతోనూ నువ్వు ఈపెళ్ళి చెయ్యగలవా?" ఎదురు ప్రశ్న వేసేడు కేశవరావు.

"ఈ పెళ్ళి ఆగిపోతే నా ఇంటి పరువూ, రుక్మిణి జీవితం ఏమవుతాయో ఆలోచించగలవా!"

"ఆ రెండింటికీ నేను చాలా విచారి స్తున్నాను."

"కాని నువ్వు కనీసం దాని జీవితా న్నయినా రక్షించగలవు."

"మావాడి భవిష్యత్తు!"

"అతడెలాగూ నీ కొడుకే! అతని కేంలోటు!"

(సశేషం)

Pirnted and Published by A. Chandra Sekhar Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor: A. SUDHAKARA RAO

